అట్టలోపలివైపు అచ్చు వేసిన శిల్పంలో కనబడేది శుద్ధోదన మహారాజుకు గౌతమ బుద్ధుని తల్లియైన మహారాణి మాయాదేవి కన్న స్వప్నం గురించి జ్యోతిష్యులు వ్యాఖ్య చేస్తూ ఉండిన దృశ్యం. వారికి దిగువ వారి వ్యాఖ్యను వ్రాసుకుంటున్న లేఖకుడు కనిపిస్తాడు. భారతదేశంలో లేఖనకళ చిత్రశిల్పంలో నిబద్ధమై లభించే దృష్టాంతాలలో ఇదే ప్రాచీనమైనది. నాగార్జునకొండ, క్రీ. శ. 2వ శతాబ్దం.

(జాతీయ పురావస్తు ప్రదర్శనశాల, న్యూఢిల్లీ వారి సౌజన్యంతో)

భారతీయ సాహిత్య నిర్మాతలు

# కాళోజీ నారాయణరావు

ఆచార్య పేర్వారం జగన్నాథం




సాహిత్య అకాదెమీ

Kaloji Narayana Rao : A monograph in Telugu by Pervaram Jagannadham, Sahitya Akademi (2007), Rs. 40



First Published : 2007

సాహిత్య అకాదెమీ

'రవీంద్ర భవన్, 35, ఫిరోజ్‌షా రోడ్. న్యూఢిల్లీ - 110 001

'స్వాతి' మందిర్ మార్గ్, న్యూఢిల్లీ - 110 001.

జీవన్‌తారా భవనము, 4వ అంతస్తు, 23A/44X, డైమండ్ హార్బర్ రోడ్, కోల్‌కటా-700053.

443, గుణ బిల్డింగ్స్, తేనాంపేట, అన్నాశాలై, చెన్నై - 600 018.

సెంట్రల్ కాలేజ్ క్యాంపస్, డా. బి.ఆర్. అంబేడ్కర్ వీధి, బెంగళూరు - 560 001.

172, ముంబయి మరాఠి గ్రంథ సంగ్రహాలయ మార్గ్, దాదర్, ముంబయి - 400 014.

ISBN : 81-260-2332-5

వెల : రూ. 40

Typesetting by R Graphic Design, Bangalore
Printed at Sai Leo Print Pack, Bangalore

# మనవి

ప్రజాకవి శ్రీ కాళోజీ నారాయణరావుగారి గురించి సంక్షిప్త జీవిత చరిత్ర రాసే అవకాశం నాకు కలిగించిన కేంద్ర సాహిత్య అకాదెమీకి ముందుగా నా ధన్యవాదాలు తెలుపుతున్నాను. కాళోజీ జీవిత చరిత్ర అంటే అది ఆనాటి సాంఘిక రాజకీయ చరిత్ర అన్నమాటే. ఆయన సమగ్ర జీవితాన్ని ప్రదర్శించడం చాలా కష్టం. ఐనా సాధ్యమైనంతవరకు స్థూలంగానైనా ఆయన వ్యక్తిత్వాన్నీ, కవిత్వతత్త్వాన్నీ ఇందులో వర్ణించే ప్రయత్నం చేసినాను. ఆనాటి రాచరికపు నేపథ్యంలో జరిగిన సన్నివేశాల్ని, సంఘటనల్ని వాస్తవిక దృష్టితో జరిగింది జరిగినట్లుగా ఇక్కడ ఉల్లేఖించడమైంది. ఈ గ్రంథానికి కాళోజీ ఆత్మకథ- "ఇదీ నాగొడవ" చాలా వరకు ఉపయోగపడింది.

ఈ గ్రంథరచనలో నాకు కావలసిన సమాచారాన్నందించడమేకాక దీని వ్రాత ప్రతిని ఆసాంతం చదివి తగిన సూచనలిచ్చిన నా చిరకాల సాహితీ మిత్రులు శ్రీ నాగిళ్ళ రామశాస్త్రి గారికీ, డా.అంపశయ్య నవీన్ గారికీ నా కృతజ్ఞతాభివందనాలు. ఇది పాఠకుల కేమాత్రం ఉపకరించినా ధన్యుణ్ణి.

పేర్వారం జగన్నాథం

వరంగల్లు
తేది: 21.7.2004

# కాళోజీ రేఖాచిత్రం

పద్మవిభూషణ్, ప్రజాకవి కాళోజీ నారాయణరావుగారి వ్యక్తిత్వం బహుముఖీన మైంది. కడు విస్తారమైంది. ఆయన ఏ ఒక్క ఉద్యమానికో, ఏ ఒక్క పార్టీకో కట్టుబడి ఉన్నవాడు కాదు. వాటి చట్రంలోకి ఇమిడి పోయే మనస్తత్వం కలవాడూ కాదు. అన్యాయం ఎక్కడున్నా, అధర్మం ఎవ్వరాచరించినా ఆయన తిరుగబడుతాడు. కలం పడుతాడు. గళమెత్తుతాడు. ధర్మసంస్థాపన జరిగేదాకా ఆయన పోరాడుతూనే ఉంటాడు. పోరాటమే ఆయనకూపిరి. ఆయన నిత్య సమరశీలి. కలంతో దుర్మార్గాల్ని చెండాడుతాడు. గళంతో దుష్టచేష్టల్ని ఖండిస్తాడు. ప్రజల బాధలగాథల్ని చూసి సలసల కాగిపోతాడు. వలవల ఏడుస్తాడు. తన కళ్ళముందు కనిపించే కుటిల కుతంత్రాల్ని నిరసిస్తూ కవితారూపంలో ప్రకటిస్తాడు. ఆయనెప్పుడూ నడుస్తున్న చరిత్రను 'నా గొడవ'గా వినిపిస్తాడు. అదే ప్రజల గొడవ. మనందరి గొడవ. అదే దరిద్ర నారాయణుల సంవేదనాసంభరితకావ్యేతిహాసం 'నాగొడవ.'

కాళోజీ ఆర్య సమాజంలో ఉంటాడు. ఆంధ్ర మహాసభలో పనిచేస్తాడు. గణపతి నవరాత్ర్యుత్సవాల్ని నిర్వహిస్తాడు. కాంగ్రెసు పార్టీ నడిపే సత్యాగ్రహాల్లో పాల్గొంటాడు. ఆంధ్రసారస్వతపరిషత్తు స్థాపనలో ముందుంటాడు. పౌరహక్కుల సంరక్షణ కోసం నడుం బిగిస్తాడు. ప్రత్యేక తెలంగాణా ఉద్యమాన్ని సమర్థిస్తాడు. అధికృతహింస వలదంటాడు. ఏది చేసినా, ఎట్లా చెప్పినా, ఆయన అచ్చమైన మానవతావాది. అసలు సిసలైన ప్రజలమనిషి. ఇంతచేసినా ఆయన కేపార్టీలోను సభ్యత్వం లేదు. ఏ సంస్థతోనూ సంబంధం లేదు. తామరాకుపై నీటిచుక్కలా ఉంటాడు. ఆయన హృదయం కరుణార్ద్ర భరితం. ఎవరికైనా ఏదైనా చిన్న హాని జరిగినా కడవల కొద్దీ కల్తీలేని కన్నీళ్ళు కారుస్తాడు. ఆయన మూర్తీభవించిన కరుణామయుడు. ఆయన ప్రకటించిన 'నా గొడవ' సంపుటాలన్నీ సామాజిక సంవేదనలకు నిలువుటద్దాలు. ఆయన కవితలు రచించినా, కథలు రచించినా సంఘం వాటిలో ప్రతిఫలిస్తుంటుంది.

మూగవేదనలు ధ్వనిస్తుంటాయి. అందుకే కాళోజీ గూర్చి రాయడం అంత సులభమైంది కాదు. ఆయన సమగ్రజీవితాని కిదొక రేఖా చిత్రంమాత్రమే.

కాకతీయ రాజన్యుల కదొకప్పుడు రాజధానీ నగరం. ప్రప్రథమంగా ఒక మహిళ రాణిరుద్రమదేవి అవక్ర పరాక్రమంతో తెలుగు నేలను పరిపాలించిన వీరభూమి. మొక్కవోని ఖడ్గధారలతో ఢిల్లీసుల్తానులను మట్టి కరిపించిన పోతుగడ్డ. స్వామి విద్యారణ్యులవంటి తపస్సంపన్నులు వేదవిజ్ఞానాన్ని పంచిపెట్టిన పుణ్యభూమి. విద్యానాథుడిక్కడే దేవభాషలో కావ్యరచనకు కడంగినాడు. జాయపసేనాని కొత్తకొత్త జానపదనృత్య భంగిమలకు శాస్త్రీయతను కల్పించింది ఇక్కడే. ఇక్కడే పాల్కుర్కి సోమనాథుడు తెలుగు సాహితీ క్షేత్రంలో క్రొంగొత్త ప్రక్రియల్ని పండించినాడు. భక్తపోతన రాజుల్ని ధిక్కరించి తన కావ్యాన్ని రామాంకితం చేసిందీ ఇక్కడే. అదే మన ఓరుగల్లు. అదిప్పుడు వరంగల్లు.

మీరు హైదరాబాదు నుండి వరంగల్లు వెళుతూ ఖాజీపేట రైలు స్టేషన్లో దిగి చక్కగా ప్రధాన మార్గం నుండి హనుమకొండ వైపు పయనిస్తే మొదట మీకు జాతీయసాంకేతికవిద్యానిలయం కనిపిస్తుంది. అది దాటి వస్తుంటే కలెక్టరు కార్యాలయం, దాని పిదప ఆర్ట్సుఅండ్ సైన్స్ కళాశాల, ఇంకా ముందుకు వెళితే ఎడమ వైపు అదాలతు, కుడివైపు జిల్లా పరిషత్తు భవనాలు కనిపిస్తాయి. మీరు ఒక్కడుగు ముందుకు వేస్తే నక్కలగుట్ట ప్రాంతంలో ఉంటారు. వరంగల్లు నగరపాలక సంస్థవారు ఈ ప్రాంతాన్ని కాళోజీనగర్ గా మార్చినారు. ఈ ప్రాంతంలోనే మూడుబాటల కూడ లొకటుంటుంది. అక్కడి నుంచి ఎడమవైపు సందులోకి వెళ్ళి నాలుగడుగులు నడిస్తే నిరాడంబరమైన ఇల్లొకటుంటుంది. ఆ ఇంటిముందు వరండాలో ఒక బక్కపలుచటి వ్యక్తి ఉంటాడు. తెల్లని ఖమీజూ ధోవతి ధరించి ఉంటాడు. పసిమిఛాయ కలవాడు. గడ్డం పెరిగి ఉంటుంది. ప్రక్కనొక ఊతకర్ర. చిందరవందరగా అటుకొన్ని ఇటుకొన్ని, పుస్తకాలు పరచి ఉంటాయి. గోడనిండా కొన్ని సన్మాన పత్రాలు, స్మారికలూ వ్రేలాడదీసి ఉంటాయి. అక్కడొక కుర్చీలో కూర్చున్న ఆ వ్యక్తి ఏదో ఆందోళనగా కనిపిస్తుంటాడు. అదిగో ఆయనే మన కాళోజీ నారాయణరావు.

ఆయనకు మరోప్రక్క కుర్చీలో కూర్చుండి ఏదో ఉర్దూ పుస్తకం



చదువుతుంటా డొకాయన. ఈయన ఉర్దూలో గొప్పకవి. 'షాద్' పేరుతో ఉర్దూలో చక్కని కవితలు రాస్తాడు. ఆయనే కాళోజీ రామేశ్వరరావు. నారాయణరావుగారి కగ్రజులు. ఇదంతా ఒకనాటి మాట. ఇప్పుడు వాళ్ళిద్దరూ కీర్తిశేషులు. వీళ్ళలో కాళోజీ నారాయణరావుగారి గురించి మరికొంత తెలిసికుందాం.

---

# సమరశీలి కాళోజీ

## 1

'పద్మవిభూషణ్' 'ప్రజాకవి' శ్రీ కాళోజీ నారాయణరావుగారు 9 సెప్టెంబర్ 1914 తేదీన కర్నాటక రాష్ట్రం, బిజాపూరు జిల్లాలోని రట్టహళ్ళి అనే గ్రామంలో జన్మించినారు. వారి తండ్రిపేరు రంగారావు, తల్లిపేరు రమాబాయి. అప్పుడు వీరి తండ్రిగారైన రంగారావుగారు ఉద్యోగరీత్యా అక్కడున్నారు. అవి మొదటి ప్రపంచయుద్ధం ప్రారంభమవుతున్న రోజులు. రంగారావుగారి పూర్వీకులు ఎప్పుడో మహారాష్ట్రం నుండి వచ్చి తెలుగునేలలో స్థిరపడినారు. అందువల్ల రంగారావుగారికి మరాఠీ అర్థమయ్యేది కాని మాట్లాడలేకపోయేవారు. నిత్యవ్యవహారంలో వీరు ఉర్దూ లేక తెలుగు మాట్లాడేవారు. ఉర్దూ, ఫార్సీ, హిందీ భాషల్లోనూ మంచి పండితుడు. ఈయన తులసీరామాయణం పురాణకాలక్షేపంగా చెప్పేవాడు. నారాయణరావుగారు తల్లిమాత్రం కన్నడిగ. ఐనా తల్లి వైపువాళ్ళు ఎక్కువకాలం మహారాష్ట్రంలో నివసించినందున ఆమెకు కన్నడం, మరాఠీ భాషలు వచ్చు, కాని తెలుగు రాకుండేది. కాళోజీ రామేశ్వరరావుగారు నారాయణరావుగారి అగ్రజులు. ఈయన నారాయణరావుగారికన్న ఆరేండ్లు పెద్ద. ఉర్దూలో మంచి పేరున్న కవీ, పండితుడు, చిరకాలం వరంగల్లులో న్యాయవాద వృత్తి చేపట్టి అందులో రాణించినాడు. ఐతే రామేశ్వరరావుగారూ, నారాయణరావుగారూ స్వభావంలో ఉత్తర దక్షిణ ధృవాల్లాంటి వాళ్ళు. ఇద్దరి అభిరుచులు వేరు. అలవాట్లు వేరు. ఆలోచనా విధానాలు వేరు. కాని దేశసంక్షేమం గూర్చి ఆ ఇద్దరి ఆశయాలూ ఒక్కటే. నారాయణరావుగారే ఒకచోట అన్నగారిది ఎంత రెగ్యులర్ జీవితమో నాదంత ఇర్రెగ్యులర్ అని చెప్పుకున్నారు. వీళ్ల తరపువాళ్ళు కొందరు మహారాష్ట్రంలో స్థిరపడినందున వాళ్లకు మరాఠీ మాత్రమే వచ్చు. వీరి మేనమామ గారైన నరసింహారావుగారు హిందీ, సంస్కృత భాషల్లో గొప్ప పండితుడు. వారు కోల్‌కత్తాయూనివర్సిటీ నుంచి 'శాస్త్రి',



బెనారస్ యూనివర్సిటీనుంచి 'వేదతీర్థ్' పరీక్షల్లో ఉత్తీర్ణులైనారు. ఈయన కాంగ్రెసుసభల్లో పాల్గొనేవాడు. ఆర్యసమాజ్‌ను అభిమానించేవాడు. వాటి కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొనేవాడు. కొంతకాలం జైలుకు వెళ్ళినాడు. జీవితాంతం బ్రహ్మచారిగానే ఉండిపోయినాడు. ఈయన హరిద్వార్‌కు వెళ్ళిపోయి అక్కడొక గురువును ఆశ్రయించి అక్కడే ఉండిపోయినాడు. అక్కడ చాలామంది నరసింహారావులుండడం వల్ల గురువుగారు ఈయన పేరును 'నరదేవ్'గా మార్చినారు. దీనికి ఆయన ఉత్తీర్ణుడైన పరీక్షల బిరుదులు తగిలించి అందరు నరదేవ్‌శాస్త్రివేదతీర్థ్ అని పిలిచేవాళ్ళు. నారాయణరావుగారి మాతామహునిది తిలక్ ఆలోచనామార్గం. ఈయనకూడ ఆర్యసమాజీయుడు. ఆ సంస్థకు చాలా సన్నిహితుడు.

కాళోజీ రెండోఏట, వాళ్ల కుటుంబం వరంగల్లుకు సమీపంలోని మడికొండలో స్థిరపడింది. ఇది విద్యావంతులూ, కవులూ, పండితులూ ఎక్కువగా ఉన్న ఊరు. కాళోజీ వ్యక్తిత్వమంతా ఇక్కడే రూపుదిద్దుకున్నదని చెప్పవచ్చు. ఇక్కడ కొందరు పాతకాలపు వకీళ్ళుండేవాళ్ళు. వాళ్ళు కొందరు యువకులకు వకీలుపరీక్ష రాయడానికి శిక్షణ ఇచ్చేవాళ్లు. ఆ ఊర్లో ప్రతాపరుద్రాంధ్రభాషానిలయం పేరుతో ఒక గ్రంథాలయ ముండేది. దీన్ని కాళోజీ రంగారావుగారూ, వానమామలై వెంకటాచార్యులూ, పెద్ది శివరాజం గారలు కలసి స్థాపించినారు. పెద్దిశివరాజం పురాణాలు చెప్పేవాడు. వానమామలై వెంకటాచార్యులుగారున్ను పురాణాలు చెప్పుతుండేవాడు. వీరు సుప్రసిద్ధ కవీశ్వరులైన వానమామలై వరదాచార్యులకు పెద్దన్న. కాళోజీ తండ్రిగారైన రంగారావుగారు హిందీలో తులసీరామాయణం చెప్పేవాడు. అంతేకాక వెంకటాచార్యులుగారున్నూ, రంగారావుగారున్నూ చిన్నపిల్లల దగ్గరినుంచి పకాలతు చదివేవాళ్ళవరకూ పాఠాలు చెప్పుతుండేవాళ్లు. చుట్టుప్రక్కల గ్రామాలనుండి కూడ పిల్లలు వచ్చి మడికొండలో మకాం పెట్టి చదువుకుంటుండేవాళ్ళు. వాళ్లొక గదిని అద్దెకు తీసుకొని స్వయంగా వండుకుంటూ చదువుకునేవాళ్ళు. రంగారావుగారు పిల్లలకు వ్యాయామం చేయడం, కసరత్తులు చేయడం వంటివి నేర్పేవాడు. ఉర్దూలో కవిత్వమల్లడం కూడా నేర్పించేవాడు. వెంకటాచార్యులుగారు తెలుగులో కవిత్వమల్లడం నేర్పేవాడు. ఇట్లా ఆ ఊర్లో తెలుగులోనూ, ఉర్దూలోనూ కవిత్వం చెప్పేవాళ్ళు కొందరు తయారైనారు. ఆ రోజుల్లోనే సురభినాటక కంపెనీవాళ్లు మడికొండకు

వచ్చి కొన్నాళ్లుండి నాటకాలు ప్రదర్శించేవాళ్లు. కాళోజీ విద్యాభ్యాసం మడికొండలోనే ప్రారంభమైంది. వీరి తండ్రిగారైన రంగారావుగారికి కొందరు ముస్లింమిత్రు లుండేవాళ్ళు. వాళ్లు రంగారావుగారిని గాఢంగా అభిమానించేవాళ్లు. రంగారావుగారెంతో ఆత్మాభిమానం కలవ్యక్తి. ఒకసారి రెవెన్యూమంత్రి వద్ద బెంచిక్లర్కు ఉద్యోగం కోసం ప్రకటన ఇచ్చినారు. దానికి రంగారావుగారున్నూ దరఖాస్తు చేసినాడు. ఏదో ఒకనాడు ఉదయం 11 గంటలకు ఇంటర్వ్యూకు రావలసిందిగా అభ్యర్థులకు కబురు చేసినారు. రంగారావుగారు నిర్ణీత సమయానికి రెండు నిమిషాలు ముందే ఇంటర్వ్యూ స్థలానికి వెళ్లినాడు. మొత్తం ఏడుగురు అభ్యర్థులు. నిర్ణీత సమయానికి ఇంటర్వ్యూ ప్రారంభం కాలేదు. రంగారావుగారు పదినిమిషాలు వేచి చూచి, అక్కడున్న బంట్రోతును పిలిచి నిర్ణీత సమయానికి ఇంటర్వ్యూ ప్రారంభం కాలేదు కనుక వెళ్లిపోతున్నానని చెప్పి అక్కడినుంచి వెళ్లిపోయినాడు. పిదప రెవెన్యూ మంత్రిగారు వచ్చి వాకబు చేయగా ఒక అభ్యర్థి వెళ్లిపోయినట్లు తెలిసింది. అప్పుడొక ఆంగ్లేయుడు రెవెన్యూమంత్రిగా ఉండేవాడు. వెంటనే ఆ రెవెన్యూమంత్రి రంగారావుగారి సమయపాలనకూ, క్రమశిక్షణకూ మెచ్చి ఆయనకే ఉద్యోగమిచ్చినాడట. ఐతే రెవెన్యూ మంత్రిగారు ప్రతిరోజు ప్రధానమంత్రిని కలువడం కోసం గుర్రబ్బండీలో వెళుతుండేవాడట. అప్పుడు బెంచ్‌క్లర్కు గుర్రబ్బండీ తోలేవాని ప్రక్కన కూర్చుండడం ఆచారం. కాని రంగారావుగారికి గుర్రబ్బండీ తోలేవాని ప్రక్కన కూర్చోవడం నామోషీగా కనిపించింది. అందుకు ఆయన అట్లా వెళ్లకూడదని నిశ్చయించుకున్న సమయంలోనే రెవెన్యూమంత్రిగారు రంగారావుగారి స్వభావాన్ని గ్రహించి వేరే టాంగా కట్టించుకొని రావలసిందిగా ఒక చీటీతో సహా ఆయనకు డబ్బులు కూడ పంపించినాడట. అప్పుడు రంగారావుగారు వేరే టాంగాపై ప్రధానమంత్రి వద్దకు వెళ్లినాడట. హైదరాబాదురాష్ట్రంలో అప్పట్లో ముఖ్యమంత్రి అనే పదవిలేదు. అతన్ని ప్రధానమంత్రి అనేవాళ్లు. అదీ రంగారావుగారి ఆత్మాభిమానం, ఆభిజాత్యం. ఒకసారి రంగారావుగారికి సంసారం మీద విరక్తి పుట్టి ఇల్లూ, ఇల్లాలినీ వదిలిపెట్టి వెళ్లి సాధువుల్లో కలిసినాడట. ఒకనాడు సాధువులకు అన్నం వడ్డిస్తూ ఉండగా వాళ్ల వరుసలోఉన్న రంగారావుగారి వాలకాన్ని కనిపెట్టి సాధువుల నాయకుడొకాయన రంగారావుగారిని ఇంటికి వెళ్లిపోవలసిందిగా మెత్తగా మందలించినాడట.



ఆయన చెప్పిన ప్రకారం రంగారావుగారు తిరిగి ఇంటికి వచ్చినాడట. ఈయన మళ్లీ ఇల్లు చేరిన పిదపనే మన కాళోజిగారు జన్మించినారట. లేకుంటే కాళోజి జన్మించి ఉండకపోయేవాడు. ఇట్లా కాళోజిపై తన మాతామహుని ప్రభావమూ, మేనమామ గారైన నరదేవ్ ప్రభావమూ, తండ్రిగారి మనస్తత్వ ప్రభావమూ, తాను పెరిగిన మడికొండ గ్రామవాతావరణ ప్రభావమూ పడిందనే చెప్పాలి.

రామేశ్వరరావుగారు మడికొండలో మాధ్యమికపాఠశాలలో చదువు పూర్తిచేసినాక న్యాయశాస్త్రం చదువుకునేందుకు హైదరాబాదు వెళ్లవలసి వచ్చింది. అప్పుడు కాళోజి కూడా అన్నగారితో కలిసి హైదరాబాదు వెళ్లినాడు. అక్కడ కాళోజికి చదువు చక్కగా సాగలేదు. రెండు మూడు పాఠశాలలు మార్చవలసి వచ్చింది. చివరికి రెసిడెన్సీపాఠశాలలో చేరి చదువు కొనసాగించినాడు. అదే సమయంలో దేశంలోని స్కౌట్స్, గైడ్స్ సంస్థలన్నీ కలిసి ముంబాయిలో పెద్ద ఎత్తున జరిపిన మహాసభలో కాళోజి పాల్గొన్నాడు. దాన్నే జంబూరి అన్నారు. ఈ జంబూరీకి వెళ్లడానికి కావలసిన ఖర్చుల నిమిత్తం పాఠశాల తరపున "ప్రహ్లాద చరిత్ర" నాటకం ప్రదర్శించినారు. అందులో రామేశ్వరరావు గారు ఆ పాఠశాల విద్యార్థికాకున్నా హిరణ్యకశ్యపుని వేషం వేయగా, కాళోజి శచీదేవి వేషం వేసినాడు. కాళోజి రెసిడెన్సీ పాఠశాలలో చదువు పూర్తిచేసుకొని సిటీకాలేజి హైస్కూల్లో చేరినాడు. అక్కడ కొంతకాలం చదువుకొనసాగుతుండగా రామేశ్వరరావుగారు వకాలతు ఉత్తీర్ణులై ప్రాక్టీసు చేసుకోవడానికి మళ్ళీ వరంగల్లుకు మకాం మార్చవలసి వచ్చింది. అట్లా కాళోజి మళ్లీ వరంగల్లుకు వచ్చి కాలేజియేట్‌హైస్కూల్లో ఇంటర్‌లో చేరినాడు. ఇంటర్ రెండోసంవత్సరంలో ఉన్నప్పుడు ఆయనకు క్షయరోగం సోకింది. ఆ రోజుల్లో క్షయరోగం ప్రాణాంతకమైందిగా ఉండేది. దానికా రోజుల్లో సరియైన మందులు లేవు. వరంగల్లులో తగిన వైద్యం లభించనందున కాళోజి హైదరాబాదులోని ఉస్మానియా ఆసుపత్రిలో చేరి అక్కడకొన్ని మాసాలు చికిత్స పొందినాడు. కాళోజి కాలేజియేట్‌హైస్కూల్లో విద్యార్థిసంఘానికి జనరల్‌సెక్రటరీగా కూడా ఎన్నుకోబడినాడు. ఈయన ఆసుపత్రిలో చికిత్స కోసం చాలా రోజులుండవలసి వచ్చినందున విద్యార్థిసంఘ కార్యకలాపాలు కూడా నిర్వహించలేకపోయినాడు. మంచం మీదనుంచి మాటిమాటికి లేవడంకానీ, ఇతరులతో మాట్లాడడం కానీ చేయవద్దని

డాక్టరు పదేపదే హెచ్చరించేవాళ్లు. ఐనా కాళోజీకి తరచుగా ఇతరులతో మాట్లాడడం సరదాగా ఉండేది. అది ఆయన అలవాటుకూడ. ఒకసారి కాళోజి ఎవరితోనో మాట్లాడుతుంటే, డాక్టరు ఇది గమనించి ఇట్లా మాట్లాడుతుంటే ఆరు మాసాల్లో చనిపోతావని హెచ్చరించినాడట. అందుకు కాళోజి వెంటనే స్పందించి మాట్లాడకుంటే ఆరు రోజుల్లోనే చనిపోతానని డాక్టర్‌తో అన్నాడట. అప్పుడు డాక్టరు నవ్వుకున్నాడట. ఐతే కాళోజి ఊపిరితిత్తి నొకదాన్ని తీసివేసినారు. అట్లా కాళోజి సుమారు ఏడాదిన్నర చికిత్సకోసం ఆసుపత్రిలోనే ఉండి నయమైనాడు. కాని ఇంటర్మీడియేట్ పూర్తికాకుండానే ఆయన చదువు ఆగిపోయింది.

## 2

ఆ రోజుల్లో గణపతి నవరాత్ర్యుత్సవాలు వరంగల్లులో ఘనంగా జరిగేవి. విద్యార్థులకు వ్యాసరచన, వక్తృత్వ పోటీలవంటివి నిర్వహించేవాళ్లు. ఏదైన ఒక కూడలిలో వినాయకుని విగ్రహాన్ని ప్రతిష్ఠించి, తొమ్మిది రోజులు విగ్రహానికి పూజాపునస్కారాలు, భజనలు జరిపించేవాళ్లు. చివరిరోజు ప్రజలంతా చప్పుళ్లతో ఊరేగింపుగావెళ్లి ఒక చెరువులో విగ్రహనిమజ్జన చేయడం జరుగుతుండేది. ఇట్లా ఊరేగింపు తీయడం కొందరు ముస్లింలకు కంటగింపుగా ఉండేది. అంతేకాక వాళ్ల మసీదుముందు బాజాభజంత్రీలు కానీ, డప్పులుకానీ మ్రోగకూడదని నిషేధించేవాళ్ళు. ఈ వైఖరి చాలా సందర్భాల్లో మతఘర్షణలకు దారితీసేది. ఐనా ప్రభుత్వం ముస్లింలది కనుక హిందువులు చేసేదిలేక తలవంచుకునేవాళ్లు. ఆ రోజుల్లో ప్రతి ముస్లిం తనదే ప్రభుత్వం అయినట్లూ, తానే ప్రభువైనట్లూ దురహంకారంతో ప్రవర్తించేవాడు. వినాయకుని విగ్రహాలు నిమజ్జనం చేసేరోజు విద్యా సంస్థలకు పగలు సెలవు ప్రకటించడం ఆనవాయితీగా వస్తుండేది. కాని ఒకసారి ఎందుకో సెలవు ప్రకటించలేదు. అప్పుడు కాళోజి ఇంటర్మీడియేట్ విద్యార్థి. ఆ సంవత్సరం వాళ్ల కాలేజియేట్‌హైస్కూలులో సుమారు 1200 మంది హిందూ విద్యార్థులుండిరి. కాళోజి మరి కొంతమంది విద్యార్థులు కలిసి అప్పటి కప్పుడు ఇంటర్వెల్లో కూర్చుండి సుమారు 1150 సెలవు



చీటీలు వేరు వేరుగా రాసి విద్యార్థులందరికీ పంచినారు. వాటిపై విద్యార్థులంతా సంతకాలు చేసి సంబంధిత క్లాసు టీచరుకు పంపినారు. ఆ పిదప నిమజ్జనోత్సవంలో పాల్గొన్నారు. ఆ పూట కాలేజీ కెవరూ హాజరు కాలేదు. దీనితో ప్రిన్సిపాలు కలవరపడి విద్యార్థులకు అపరాధరుసుం విధించినాడు.

ఒకసారి గణపతిఉత్సవాల్లోనే కాళోజి మరికొందరు విద్యార్థులు కలిసి 'సంఘటనేశక్తి' 'సహకారంమేలు' 'ఐకమత్యం మహాబలం' వంటి కొన్ని నీతిసూక్తులు ప్లకార్డుల మీద రాసి పట్టుకొని ఉరేగింపులో పాల్గొన్నారు. వాటిలో 'ముల్లును ముల్లుతోనే తీయాలి', 'కుక్కకాటుకు చెప్పుదెబ్బ' వంటి నినాదాలు కూడా ఉన్నాయి. ఈ నినాదాల్లో ఎక్కువభాగం కాళోజి రాసినవే. ఊరేగింపు బ్రాహ్మణవాడనుండి బయలుదేరి హనుమకొండ చౌరస్తావైపు వస్తున్నది. చౌరస్తాలోనే గణపతి విగ్రహముండింది. ఆ విగ్రహాన్నే తీసుకపోయి నిమజ్జనం చేయవలసి ఉండెను. ఆ సమయంలోనే అక్కడికి రెవెన్యూ అధికారులూ, పోలీసుఅధికారులూ చేరుకొని 'ముల్లును ముల్లుతోనే తీయాలి', 'కుక్కకాటుకు చెప్పుదెబ్బ' వంటి నినాదాలున్న ప్లకార్డులను తొలగించవలసిందిగా ఆదేశించి ఊరేగింపు నడ్డుకున్నారు. హఠాత్తుగా ఊరేగింపు ఆగిపోవడం గమనించి కొందరు ఏం చేయాలో తోచని స్థితిలో ఉన్నారు. మరికొందరు సర్దుకుపోయే తరహాలో మాట్లాడుతున్నారు. ఈ ఊరేగింపులో గజాననమండలి సభ్యులతోపాటు కొందరు వకీళ్ళు, విద్యార్థులు, ఇంకా పట్టణ ప్రముఖులు ఉన్నారు. అప్పుడు కాళోజి ఊరేగింపులో నుండి ముందుకు వచ్చి, ఆ ప్లకార్డులను రాసింది తానేనని ప్రకటించి ప్రభుత్వాధికారులతో వాదుకు దిగినాడు. అంతేకాక ప్లకార్డులను తొలగించేది లేదనీ, చట్టప్రకారం తమకు తోచింది చేసుకోవచ్చుననీ ధైర్యంగా పలికినాడు. అప్పుడక్కడ వరంగల్లు సుబేదారున్నూ, జిల్లా కలెక్టరున్నూ, హైదరాబాదునుంచి వచ్చిన డి.ఐ.జి. మున్నగు ప్రభుత్వాధికారులున్నూ ఉండిరి.

కాని ఇంతలో సంఘర్షణ కూడదన్న ఉద్దేశంతో కొందరు కాళోజీకి తెలియకుండా వెళ్ళి ప్లకార్డులను తొలగించి వచ్చినారు. ఇది కాళోజీకి చాలా బాధకలిగించింది. ఇంతలో కాళోజి అభిమతానికనుగుణంగా టి. హయగ్రీవాచార్యులు, పి.వి. నరసింహారావు, బి. లక్ష్మీకాంతరావు వంటి ప్రముఖులు ముందుకువచ్చి, ఇది అవమానకరమైన విషయం కనుక ఇంటికి వెళ్లిపోదామంటూ ఊరేగింపునుద్దేశించి ప్రకటించినారు. దానితో జనమంతా

గణపతి విగ్రహాన్నక్కడే వదిలివేసి తమతమ ఇండ్లకు వెళ్లిపోయినారు. ఇది మరొక సమస్య వచ్చిపడిందని గ్రహించిన ప్రభుత్వాధికారులు గణపతి విగ్రహాన్ని తీసుకపోవలసిందిగా అదే రాత్రి కాళోజికి రాయబారమంపినారు. ఐనా కాళోజి ససేమిరా అంగీకరించలేదు. తమకు పట్టపగలు నడిరోడ్డుపై అవమానం జరిగింది కనుక మళ్లీ అట్లాగే పట్టపగలు ప్రజల సమక్షంలోనే సమస్యను పరిష్కరిస్తేనే గణపతి విగ్రహాన్ని తీసుకపోతామని పట్టుపట్టినాడు. అందుకు ప్రభుత్వాధికారులు ఒక మెట్టు దిగివచ్చి కొందరు వకీళ్లూ, పురప్రముఖులతో మంతనాలు జరిపి, పోలీసుల సహాయంతో ఏదోవిధంగా అర్ధరాత్రి గణపతినిమజ్జనం చేయించివచ్చినారు.

నిజాంసర్కారు హిందువుల మత సంబంధమైన ప్రతి అంశంలోనూ జోక్యం కలిగించుకునేది. హిందువులకు మతపరమైన స్వేచ్ఛలేకుండా చేసేది. రాష్ట్రంలో అధికజనాభా కలిగిన హిందువుల మనోభావాల్ని కించపరిచే విధంగా ఆదేశాలిస్తుండేది. తబ్లిక్ పేరుతో హిందువుల్ని ముస్లింలుగా మార్చే మతాంతీకరణను ప్రోత్సహించేది. బహదూర్ యార్జంగ్ దాన్ని రాష్ట్రమంతటా ఒక బృహత్కార్యక్రమంగా చేపట్టినాడు. ఇక్కడ దీన్ని ఎదిరించడానికి వచ్చిందే ఆర్యసమాజం. ఇది హైదరాబాదులో 1892 ప్రాంతంలో స్థాపించబడింది. హవనం చేయడం ఆర్యసమాజంలో ఒక పవిత్ర ఆచారంగా ఉండేది. దీన్ని నిజాంసర్కారు నిషేధించింది. హవనం చేయాలంటే ముందుగా ప్రభుత్వ అనుమతి అవసరమని ఎన్నో షరతులు విధించింది. ఐతే దీన్ని కాళోజి ఎదిరించ దలచినాడు. ఒక గది అద్దెకు తీసుకొని, ఆ గదికి 'ఆర్యసమాజం' అని రాసున్న అట్ట తగిలించి, హవనద్రవ్యాలన్నీ సమకూర్చుకొని హవనం చేసేవాడు కాళోజి. ఇంతకూ ఆయనకు సంధ్యావందనం మంత్రాలు కూడా రావు. ఐనా ప్రభుత్వ ఆజ్ఞలను ధిక్కరించడమే ధ్యేయంగా పెట్టుకొని ఆయన ఆ విధంగా హవనం చేసేవాడు. ఒకనాడు ఒక పోలీసు అధికారి వచ్చి హవనం చేయడాన్ని ఆక్షేపించి ఆపుజేసే ప్రయత్నం చేసినాడు. ఐతే కాళోజి ఆయనకు తగిన విధంగా సమాధానమివ్వగా ఏం చేయాలో తోచక ఆ పోలీసు అధికారి వెళ్లిపోయినాడు.

ముస్లింల పీర్లపండుగనాడు హిందువులు కూడా ఆ రోజుల్లో అధిక సంఖ్యలో పాల్గొనేవాళ్లు. పీరీల నెత్తుకొని శివమూగేవాళ్లు. పీరీలు తమ



ఇండ్ల ముందుకు వచ్చినప్పుడు హిందువులున్ను వాటికి కుడుకలు కట్టి ఊదుపొగ వేసేవాళ్లు. తమ కోరికలు తీరాలని పీరీలకు మొక్కుకునేవాళ్లు. ఒకసారి ఎప్పటిమాదిరిగానే ముస్లింలు పీర్లపండుగ చేసుకుంటున్నారు. పీర్లను ఊరేగింపుగా తీసుకవచ్చి ముస్లింలు ఒక వేపచెట్టు కింద నిలిపినారు. అక్కడ పీరీలకు కుడుకలు కట్టడం ఊదుపొగ వేయడం వంటి తంతు జరుగుతున్నది. అదే వేపచెట్టుకింద ఎన్నాళ్లనుంచో పోచమ్మ మైసమ్మ దేవతల విగ్రహాలున్నాయి. వాటినేమాత్రం ఖాతరు చేయకుండా ముస్లింలు ఆ చెట్టుకిందనే గంతులేస్తూ తిరుగుతున్నారు. విగ్రహాలను తొక్కుతున్నారు కూడ. ఐతే ఈ దురాచారాన్ని విమర్శిస్తున్న వాళ్లే కాని ధైర్యంగా ముందుకు వచ్చి అడిగే నాథుడే లేడు. ప్రభుత్వాధిపతులు ముస్లింలైనందున ఏమంటే ఏ కొంప మునుగుతుందోనని ఎవరి భయం వారికున్నది. అప్పుడు పద్మాక్షి గుట్టనుండి కొందరు మిత్రులతో అటుగా వస్తున్న కాళోజి ఇది గమనించినాడు. ఆయన కొందరు హిందూ స్త్రీలను పురమాయించి కడవలతో నీళ్లు తెప్పించి ఆ పోచమ్మ మైసమ్మ విగ్రహాల మీద కుమ్మరింపజేసినాడు. మరి కొందరితో పసుపు కుంకుమలు చల్లింపజేసినాడు. దీన్ని కొందరు ఆశ్చర్యంగా చూస్తూ మొహర్రంనాడు పోచమ్మ పండుగేమిటని అడిగినారు. అప్పుడు కాళోజి ఆడవాళ్లు బోనాల పండుగ చేసుకుంటున్నారనీ, ఎవరి పండుగ వాళ్లు చేసుకుంటున్నారు తప్ప ఇందులో తప్పేముందనీ సమాధానమిచ్చినాడు. సున్నితంగా చెప్పిన ఈ సమాధానానికి ఎవరూ మారుమాట్లడలేక పోయినారు. ముస్లింలు కూడా కిమ్మనకుండా వెళ్లిపోయినారు. ఈ సంఘటన కాళోజి విద్యార్థిగా ఉన్న కాలంలోనే జరిగింది.

నిజాంసర్కారు అండదండలతో ఆ రోజుల్లో కొందరు ముస్లింలు ఎంతటి మతోన్మాదంతో ప్రవర్తించే వాళ్లో, వరంగల్లులో జరిగిన ఒక సంఘటన గూర్చి ఇక్కడ వివరిస్తే తెలుస్తుంది. వరంగల్లు చౌరస్తాకూ రామలింగేశ్వర ఆలయానికీ మధ్య ఇంతెజార్ గంజ్ అనే పోలీసు నాకా ఒకటున్నది. అక్కడొక షెడ్డు, అందులో ఒక కానిస్టేబుల్ ఉండేవాడు. ముస్లిం కానిస్టేబుళ్లు అక్కడే నమాజు చేసుకునేవాళ్లు. రామలింగేశ్వరాలయంలో వినాయక చవితికి గణపతిని ప్రతిష్ఠించి తొమ్మిది రోజులు పూజలు జరిపించి చివరిరోజు నిమజ్జనోత్సవం నిర్వహించేవాళ్లు. అట్లాగే ప్రతిఏటా గోకులాష్టమినాడు

ఉట్లశావను తీస్తుండేవాళ్లు. ఒకసారి ఉట్లు కొట్టుకుంటూ పోలీసునాకా ప్రాంతంనుండి ఊరేగింపుగా శావ వెళుతుంటే ముస్లింలు అందుకు అభ్యంతరం తెలిపినారు. తామక్కడి మసీదులో నమాజు చేసుకోవడానికిది ఆటంకంగా ఉన్నందున ఈ పండుగ చేయరాదని పట్టుపట్టినారు. ఇంతకూ ఆ స్థలంలో మసీదేలేదు. ఉన్నది ఒక చిన్ననాకా మాత్రమే. ఎక్కడైతే వరుసగా కొన్ని రోజులు నమాజు చేస్తారో ఆ స్థలాన్నే మసీదుగా గుర్తించాలనీ, అదే మసీదనీ ముస్లింలు వింతగా వాదించడం ప్రారంభించినారు. అందుపై ఇరువర్గాలకూ పెద్ద ఘర్షణ జరిగింది. కొందరు ప్రముఖులను, షాపుకార్లను అరెస్టు చేసి ప్రభుత్వం వాళ్లపై కేసులు పెట్టింది. వీళ్లను విడిపించడంకోసం కోల్‌కత్తా నుండి ఒక యూరోపియన్ లాయర్‌ను పిలిపించుకోవలసి వచ్చింది. ఈ విషయంలో నిజాల్ని తేల్చడం కోసం, ప్రభుత్వం ఒక సంఘాన్ని నియమించింది. దానికి వరంగల్లు సుబేదారు అధ్యక్షుడుగా ఉండెను. ఆ సంఘం కూడా అక్కడ మసీదు లేదని ప్రభుత్వానికి నివేదిక సమర్పించింది. ఈ సంఘాధ్యక్షుడుగా ఉన్న వరంగల్లు సుబేదారు ముస్లిమే అయినా నిష్పక్షపాతంగా వ్యవహరించినాడు. ఐతే నిజాంనవాబు మాత్రం ముస్లింలు అక్కడ మసీదును కోరుతున్నారు కనుక అక్కడొక మసీదును నిర్మించాలనీ, హిందువుల పండుగలు పబ్బాలకు ఎలాంటి ఆటంకాలు కలుగనివ్వకూడదనీ ఆదేశించినాడు. దాని ప్రకారం ఆ స్థలంలో కొత్తగా ఒక మసీదును నిర్మించినారు. ఈ మసీదు నిర్మాణానికి హిందువులు కూడా చందాలిచ్చి సహకరించినారు. ఐతే నిజాం ఫర్మానాను ఖాతరు చేయకుండా ముస్లింలు మసీదు నిర్మించిన పిదప కూడ హిందువుల పండుగల్లో ఉత్సవాలు చేయడాన్ని ఆటంకపరచిన సందర్భాలెన్నో ఉన్నాయి. ఒకసారి ఎప్పటిలాగే వరంగల్లులో గణపతి ఉత్సవాలు జరుగుతున్నాయి. మళ్లీ ముస్లింలు మసీదు ముందునుంచి ఊరేగింపు తీయరాదని ఆక్షేపణ తెలిపినారు. ఇరుపక్షాల్లో మాటా మాటా పెరిగింది. ఉద్రేకాలకు గురైనారు. తలలు పగిలేటట్లుగా ఇరుపక్షాలవాళ్లూ కొట్టుకున్నారు. రోడ్డుపై ఉన్న దుకాణాలూ, హోటళ్లూ ధ్వంసమైనాయి. కొందరు ఆసుపత్రి పాలైనారు. కాళోజి ఆయన మిత్రులు కొందరు ఆసుపత్రిలో చేరినవాళ్లకు సేవ చేసినారు. వాళ్ల కుటుంబాలకు సాయపడినారు. ఆనాటి దుస్థితి కిదొక ఉదాహరణ మాత్రమే. నిజాంప్రభువు హిందూముస్లింలు తనకు రెండు కళ్లు అని ప్రకటించేవాడు. కాని ఆచరణలో మాత్రం అందుకు



భిన్నంగా జరిగేది. ప్రతి అంశంలోనూ ప్రభుత్వాధికారులు వివక్ష ప్రదర్శించేవాళ్లు. సర్వసాధారణంగా హిందువులు ప్రభుత్వం ముస్లింలదన్న భావంతో అణిగిమణిగి ఉండేవాళ్లు. కాని ఎప్పుడైనా తమపై జరిగే దౌర్జన్యం మీద, పెత్తనం మీద, అణచివేత మీద హిందువులు తిరుగుబాటు చేస్తే అది హిందూముస్లింల మతఘర్షణగా చిత్రీకరించేవాళ్లు. కాని నిజంగా ఫ్యూడల్ వ్యవస్థపై, దోపిడి విధానంపై, పెత్తందారీ జులుంపై జరిగిన తిరుగుబాటు. ఐతే ఇది క్రమంగా హిందువులు సంఘటితం కావడానికి దారితీసింది.

## 3

'ఆంధ్ర పితామహ' మాడపాటి హనుమంతరావుగారు ప్రారంభించిన ఆంధ్రమహాసభ ఆనాడు తెలంగాణంలో మొత్తం పదమూడు మహాసభల్ని జరుపుకున్నది. ప్రారంభంలో ఆంధ్రమహాసభ కేవలం తెలుగు భాషా సాహిత్యాల్ని ఉద్ధరించడం, సాంస్కృతిక వికాసం కోసం పాటుపడడం, ఆంధ్రుల ప్రాచీనచారిత్రకవైభవాన్ని వెలికితీయడం వంటి వాటికోసం మాత్రమే అవతరించింది. 1930లో జోగిపేటలో సురవరం ప్రతాపరెడ్డిగారి అధ్యక్షతన మొదటి ఆంధ్రమహాసభ జరిగింది. అదే వరుసలో 1936లో షాద్‌నగర్‌లో కొండా వెంకటరంగారెడ్డిగారి అధ్యక్షతన ఐదవ ఆంధ్రమహాసభ జరిగింది. అప్పుడు భోజనవసతిసౌకర్యాలు ఏర్పాటు చేయడంలో కొంత లోపం జరిగి సభాసదులు ఇబ్బందికి గురైనారు. ఆ సభలకు కాళోజి, హర్కారే శ్రీనివాసరావుగారూ హాజరైనారు. శ్రీనివాసరావుగారు కాళోజికి బంధువుకూడ. ఈ ఇద్దరూ కలిసి "కాలహర" కవులు అనే పేరుతో ఆ సభల నిర్వహణ గురించి "ఇక రాము ఇక రాము ఇటువంటి సభలకు" అంటూ హాస్యంగ కొన్ని పంక్తులు జంటకవిత్వంగా చెప్పినారు. కాళోజిలో సున్నితమైన హాస్యం, వ్యంగ్యం ఉండి సంభాషణైనా, కవిత్వమైనా మనల్ని ఆకట్టుకుంటుంది. అప్పట్లో వరంగల్లులో ఒక సాహిత్య సంస్థను కూడ మన కాళోజి, శ్రీనివాసరావుగారలు కలిసి నిర్వహిస్తుండేవాళ్లు. దానికి వీళ్లే అధ్యక్ష కార్యదర్శులుగా ఉండేవాళ్లు.

ఆంధ్రమహాసభ రానురాను రాజకీయ స్వభావాన్ని సంతరించుకున్నది. పైగా అందులో వామపక్ష రాజకీయభావాలు కలవాళ్ల ప్రాబల్యం క్రమంగా పెరుగుతూ వచ్చింది. 1944లో భువనగిరిలో రావి నారాయణరెడ్డిగారి అధ్యక్షతన జరిగిన 11వ ఆంధ్రమహాసభ రెండుగా చీలింది. అప్పుడు జాతీయవాదులు సభలతాలూకు ఫైళ్లను కొత్తగా ఎన్నికైన రావి నారాయణరెడ్డి ప్రభృతుల కప్పగించి సభనుండి వాకౌట్ చేసినారు. కాని కాళోజి అట్లా చేయక ఏ విషయమైనా లోపలే ఉండి చర్చించాలి కాని వాకౌట్ చేయడం భావ్యం కాదని వాదించినాడు. ఐనా వాళ్లు వినకుండా వెళ్లిపోయినారు. కాళోజి స్టాండింగ్ కమిటీ సభ్యుడుగా కూడ ఉండెను. దేశం మతకల్లోలాలతో, ప్రాంతీయభేదాలతో, కులవైషమ్యాలతో ఇప్పటికే అల్లకల్లోలమవుతుంటే అదనంగా ఇప్పుడు వర్గపోరాటాన్ని తేవడం కూడదనీ, మతకల్లోలాలవంటి వాటిని ఎట్లా నిరసిస్తున్నామో, అట్లాగే ఈ వర్గపోరాటాన్ని కూడ నిరసించాలనీ కాళోజి స్టాండింగ్ కమిటీలో ఒక తీర్మానం ప్రవేశపెట్టినాడు. ఐతే ఇది కమ్యూనిస్టులకు కంటగింపుగా ఉండెను. ఇది వాళ్ల సిద్ధాంతానికి గొడ్డలిపెట్టు వంటిది. మహాసభలో ఈ తీర్మానాన్ని ఓటుకు పెట్టగా వీగిపోయింది. ఐనా కాళోజి తన దృక్పథాన్ని మార్చుకోలేదు. సభానంతరం కాళోజి వెళ్ళిపోతుండగా, ఆ ప్రక్కనే కూర్చుండి ఉన్న చంద్ర రాజేశ్వరరావుగారు కాళోజీని వర్గపోరాటం గూర్చి మీ అభిప్రాయమేమిటని అడిగినాడట. ఆయనకు కూడ అదే సమాధానం చెప్పి తాను వెళ్లిపోయినట్లు కాళోజి తన ఇంటర్వ్యూలో ఒకచోట చెప్పుకున్నాడు. ఆ తరువాత కమ్యూనిస్టుల ప్రాబల్యం ఉన్న ఆంధ్రమహాసభ ఒకవైపూ, జాతీయవాదుల ప్రాబల్యం ఉన్న ఆంధ్రమహాసభ మరొకవైపూ విడివిడిగా మరి రెండు ఆంధ్రమహాసభల్ని జరుపుకున్నాయి.

మొత్తానికి కాళోజి ఒక పార్టీకి కానీ, ఒక సంఘానికి కానీ, ఒక సంస్థకు కానీ కట్టుబడి ఉండేవాడు కాదు. వాటి నియమనిబంధనలకు, క్రమశిక్షణకు, సైద్ధాంతిక ప్రణాళికలకు కట్టుబడి ఉండడమన్నది కాళోజి స్వభావానికి విరుద్ధమైన అంశం - ఏదైనా ఒక పార్టీ సభ్యత్వం పుచ్చుకొని, దానికి కట్టుబడి ఉండడమంటే అది పాతివ్రత్యం లాంటి 'పార్టీవ్రత్యం' అనేవాడు. ఎక్కడ ఎవరికి ఏ రకమైన అన్యాయం జరిగినా దాన్ని ప్రతిఘటించడం కాళోజి స్వభావం. ఆయన పార్టీలకతీతంగా, సంఘాలకతీతంగా, ఉద్యమాల్లో పాల్గొనేవాడు. నిరసనలు తెలిపేవాడు. సభల్లో ప్రసంగించేవాడు,



అందుకే ఒకసారి ఒక పోలీసు అధికారి కాళోజీని ప్రశ్నిస్తూ, పోచమ్మ దగ్గరనీవే ఉంటావు, గణపతి దగ్గర నీవే ఉంటావు, ఆర్యసమాజాల్లో నీవే ఉంటావు, ఆంధ్రమహాసభలో పాల్గొంటావు, హిందూమహాసభలో ప్రసంగిస్తావని అడిగినాడట. అందుకు కాళోజి పౌరసమాజానికి ఎక్కడ అన్యాయం జరిగితే అక్కడ తానుండి ప్రతిఘటిస్తాననీ, ఎక్కడ ప్రజలపై దౌర్జన్యం జరుగుతుందో అక్కడ తాను వాళ్ల పక్షాన పోరాడుతాననీ సమాధానమిచ్చినాడట.

ఆ రోజుల్లో వరంగల్లులో మత, సాంస్కృతిక, రాజకీయాది రంగాలకు సంబంధించిన అనేక సభలూ, సమావేశాలే కాక, ఆయా ఉద్యమాలు కూడా జరుగుతుండేవి. ఈ రకరకాలైన ఉద్యమాల్లోనూ, సభలూ సమావేశాల్లోనూ పాల్గొనేందుకు వేరువేరు ప్రదేశాలనుండి పండితులూ విద్యావేత్తలూ, మేధావులూ వరంగల్లుకు వస్తుండేవాళ్లు. ఇట్లా వచ్చినవాళ్లందరికీ కాళోజిసోదరుల ఇల్లు కేంద్రంగా ఉండేది. వాళ్లంతా కాళోజి ఇంట్లోనే మకాంవేసేవాళ్లు. ఈ అందరికీ విసుక్కోకుండా కాళోజిసోదరులు ఆతిథ్యం ఇస్తుండేవాళ్లు. వీళ్లందరితోనూ కాళోజీకి పరిచయాలు కలుగుతుండేవి. వాళ్లతో ఆయన పలు విషయాలపై చర్చించేవాడు. విచిత్రమేమిటంటే తన అభిప్రాయాలతో పూర్తిగా భిన్నించే వాళ్లతో కూడా కాళోజి సన్నిహితంగా మెదిలేవాడు. అభిప్రాయాలతో భేదించినా మైత్రిలో కానీ, అనురాగఅనుబంధాల్లోకానీ, ఆత్మీయతలోకానీ తేడా ఉండేది కాదు. ఏ విషయమైనా సూటిగా, స్పష్టంగా నిర్మొహమాటంగా చెప్పడం కాళోజిలో ఉన్న ప్రత్యేకత. అదే కాళోజి వ్యక్తిత్వం. అందువల్లనే సైద్ధాంతికంగా భిన్న ధృవాలకు చెందినవాళ్లైనా కాళోజిని అభిమానిస్తారు, గౌరవిస్తారు. మరో విశేషమేమంటే తాను పాల్గొన్న ఉద్యమాల్లో దేనికీ తాను నాయకుణ్ణి కాదనీ, అట్లాగే అనుచరుణ్ణి కూడా కాదనీ, గొర్రెదాటు వ్యవహారం తనది కాదనీ ఒకచోట కాళోజి స్పష్టంగా చెప్పుకున్నాడు. అట్లాగే తాను పాల్గొన్న ఉద్యమాలేవైనా విజయవంతమైనాయంటే ఒక్క కాళోజి వల్ల జరిగింది కాదనీ, ఒక్క కాళోజి సాధించిందేమీ లేదనీ అది తన మిత్రులూ, కార్యకర్తలంతా కలిసి సమష్టిగా చేసిన కృషిఫలితమేననీ సవినయంగా చెప్పుకుంటాడు. చివరికది ప్రజల విజయమేనంటాడు.

ఒకచోట కాళోజీనిగూర్చి దేవులపల్లి రామానుజరావుగారు ఇట్లా

అన్నారు - "కాళోజికి బహుభాషలతో పరిచయమున్న మాట వాస్తవమే. అయినా ఆయనను పండితుడని చెప్పడానికి వీలులేదు. అనేక విషయాల గూర్చిన అవగాహన ఆయనకున్నది. అయినా ఏ విషయంలోనూ పారంగతుడని చెప్పడానికి వీలులేదు. స్వార్థాన్నిగూర్చి ఆలోచించక అన్ని జాతీయోద్యమాలలో పాల్గొనిన త్యాగమూర్తి ఆయన. అయినప్పటికిని ఆయనను యీనాటి పరిభాషలో నాయకుడని చెప్పడానికి వీలులేదు. దేశసేవకు జీవితాన్ని అంకితం చేసిన కాళోజి అన్నిటికి మిన్నగా కరుణార్ద్ర హృదయుడైన కవీశ్వరుడు. ఎక్కడ ఏ అన్యాయం జరిగినా ఆయన కండ్ల నుండి జలజల నీరు రాలి, గాయపడిన హృదయములోని భావాలు గేయరూపమున వెలువడును. ఆయన కవిత్వమంతా ఈ విధంగా ప్రకటితమైనదే." ఈ మాటలు కాళోజి వ్యక్తిత్వానికి గీసిన రేఖాచిత్రం వంటివి. అంతేకాక మన మాజీప్రధాని శ్రీ పి.వి. నరసింహారావుగారు కాళోజి షష్టిపూర్తి ఉత్సవ సందర్భంలో వారికి శుభాకాంక్షలు తెలుపుతూ -

ఆరుపదులు నిండెనంట 'నారయ'నీ కాయమునకు
ఆరా పదియా మనస్సు కనెడి సందియముతోచును
సూక్తులు శాపములును పునరుక్తిదోష మంటకుండ
జగత్తు నభిశంసించుచు శతసంవత్సరములు దాటుము
నోటి కస్సుబుస్సుకు కన్నీటి వింత జతకూర్చుచు
అంతరంగనవనీతము అనారతము పంచిఇమ్ము
బ్రహ్మ నీకు పొరపాటున పాపుల వయసిచ్చుగాక
కాలుడు మా 'కాళయ్య' ను కలకాలము మరచుగాక!

అంటు ఒక కవితతో కాళోజిని ప్రశంసించినారు.

రామేశ్వరరావుగారూ, నారాయణరావుగారూ ఆదర్శసోదరులు. నారాయణరావుగారికి చిల్లిగవ్వ సంపాదనలేకున్నా చిన్ననాటినుండి నారాయణరావుగారిని పెంచిపోషించినవ్యక్తి రామేశ్వరరావుగారు. ఈ ఇద్దరి కుటుంబాల భారమంతా తానే మోసినాడు. వీళ్ల కుటుంబంలో ఏ విధమైన పొరపొచ్చాలుండేవి కావు. కాళోజీసోదరులు రామలక్ష్మణుల వంటివాళ్లని జనం పొగిడేవాళ్లు. ఐతే అక్కడ తమ్ముడు అన్నకు సేవచేస్తే ఇక్కడమాత్రం



అన్నే తమ్ముని భారమంతా మోసినాడు. అందుకే రామేశ్వరరావుగారు మరణించిన సందర్భంలో ఎంతో ఆవేదనతో కాళోజి తన ఆరవఏట అన్న బుజాలమీదికెక్కిన తాను ఆయన మరణించేదాకా దిగలేదని వాపోయినాడు. అన్నగారి మీద నారాయణరావుగారికి అంతటి ప్రేమాభిమానాలుండేవి. రామేశ్వరరావుగారికి తమ్ముడంటే ఎంతో వాత్సల్యం. అందుకే ఆ పరస్పర ప్రేమాభిమానాల వల్లనే నారాయణరావుగారు అన్నకు తన 'నా గొడవ'ను అంకితం చేసి కొంతలో కొంతైనా ఋణం తీర్చుకున్నాడు. అదీ కాళోజి సోదరుల ఆదర్శ జీవితం. ఐతే ఇక్కడ గమనించవలసిన అంశం ఒకటున్నది. సైద్ధాంతికంగా, వీళ్ళిద్దరూ ఉత్తర దక్షిణ ధృవాల్లాంటివాళ్లు. అభిరుచులలోకానీ, ఆలోచనల్లోకానీ, అలవాట్లలోకానీ, అంతస్స్వభావంలోకానీ వీళ్లిద్దరివీ భిన్నమార్గాలు.

## ౯

అవి హైదరాబాదురాష్ట్రంలో బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పరచాలంటూ రాష్ట్రమంతటా ముమ్మరంగా సత్యాగ్రహాలు చేస్తున్న రోజులు. ఇది నిజాం ప్రభువుకు కంటగింపుగా ఉండెను. ఈ సత్యాగ్రహం తాలూకు కరపత్రాల్ని పంచడానికి సహచరులూ కార్యకర్తలూ భయపడుతున్న సమయంలో కాళోజి సైక్లోస్టైల్ చేసిన కరపత్రాల్ని హనుమకొడచౌరస్తాలో ఒక్కడే పంచుతూ నినాదాలిచ్చినాడు. హైదరాబాదురాష్ట్రంలో బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పరచాలంటూ రాసి ఉన్న కరపత్రాలవి. ఇది ప్రభుత్వానికి వ్యతిరేకమైనదిగా భావించి పోలీసులు కాళోజిని అరెస్టు చేసి నేరుగా జైలుకు తీసుకవెళ్లినారు. ఇది చట్టవిరుద్ధమైన చర్య. ఎందుకంటే అరెస్టు చేసిన 24 గంటల్లోగా పోలీసులు నిందితుల్ని కోర్టులో హాజరుపరచవలసి ఉంటుంది. ఆ తరువాతనే కోర్టు ఆదేశానుసారం ఏదైనా చేయవలసి ఉంటుంది. ఐతే ఇక్కడ జైలుకే మెజిస్ట్రేటువచ్చి కాళోజిపై విచారణ జరిపినాడు. మెజిస్ట్రేట్ అడిగిన ప్రశ్నలన్నింటికీ కాళోజి నిర్భయంగా సమాధానం చెబుతూ కరపత్రం రాసింది తానేననీ, సైక్లోస్టైల్ చేసిందీ తానేననీ, చౌరస్తాలో తాను కరపత్రాలు పంచుతూ సత్యాగ్రహం చేసిందీ నిజమేననీ అంగీకరించినాడు. అప్పుడు మెజిస్ట్రేట్

కాళోజికి రెండు సంవత్సరాల జైలుశిక్ష విధించినాడు. ఆ ప్రకారం కాళోజిని జైలుకు పంపినారు.

హైదరాబాదురాష్ట్రంలో 1938 ప్రాంతంలో ఉస్మానియా విశ్వవిద్యాలయం హాస్టళ్లలో విద్యార్థులు మూకుమ్మడిగా వందేమాతరం గీతాలాపన చేయనారంభించినారు. దీన్ని నిజాంప్రభుత్వం నిషేధించింది. ఐనా విద్యార్థులు నిషేధాజ్ఞల్ని ఉల్లంఘించి హాస్టళ్లలో వందేమాతరం గీతాన్ని పాడినారు. విశ్వవిద్యాలయ ప్రాంగణమంతా వందేమాతరంగీతంతో మారుమ్రోగింది. అప్పుడు ప్రభుత్వం విద్యార్థులందరినీ విశ్వవిద్యాలయం నుండి బహిష్కరించింది. ఈ విద్యార్థుల్ని తమవద్ద చేర్చుకోవడానికి ఆంధ్రవిశ్వవిద్యాలయం నిరాకరించింది. ఐతే దేశంలో ఒక్క నాగపూర్ విశ్వవిద్యాలయం మాత్రం ఈ విద్యార్థుల కాశ్రయమిచ్చింది. వాళ్లక్కడ చేరి పైచదువులు కొనసాగించినారు. ఇట్లా బహిష్కృతులై నాగపూర్ విశ్వవిద్యాలయంలో చేరిన విద్యార్థుల సహాయం కోసం ఇక్కడొక సంఘం ఏర్పడింది. కాళోజి ఈ సంఘం తరఫున విద్యార్థుల సహాయం కోసం కృషి చేసినాడు. ఇక్కడి నుంచి నాగపూర్‌కు విద్యార్థుల్ని పంపడంలోనూ, అక్కడ నాగపూర్లో వాళ్ల కే ఇబ్బంది కలుగకుండా తగినవసతులు కలిపించడంలోనూ ఈ సంఘం ఎంతో కృషి చేసింది. ఈ సందర్భంలో కాళోజి చేసిన కృషి చెప్పుకోదగింది.

కాళోజి హైదరాబాదులో న్యాయశాస్త్రం చదువుతున్నప్పుడు బ్రిటీష్ ఇండియాలో ఆయా ప్రావిన్స్‌లలో ప్రభుత్వాల్ని ఏర్పరచడం కోసం మొదటిసారి 1937 ప్రాంతంలో ఎన్నికలు జరిగినాయి. ఈ ఎన్నికలు చాలా పరిమితమైనవి. ఇప్పటివలె వయోజనులకందరికీ ఓటు హక్కులేదు. జమీందార్లు, జాగిర్దార్లు, కొందరు విద్యావేత్తలు, పారిశ్రామికవేత్తలు మాత్రమే ఓటర్లుగా ఉండేవారు. ఆ సందర్భంలో షోలాపురంలో ప్రసంగించడానికి జవహార్లాల్‌నెహ్రూగారు వస్తాడని విని కాళోజి మరికొందరు మిత్రులతో కలిసి అక్కడికి వెళ్లినాడు. షోలాపూర్ బ్రిటీష్‌ఇండియాలోని పట్టణం. నిర్ణీత సమయానికి కొన్ని గంటలు ముందుగానే పట్టణమంతా కదిలివచ్చినట్లు అశేష ప్రజానీకం సభాస్థలికి చేరింది. షోలాపూర్ పట్టణంలో సభను నిర్వహించడానికి ప్రభుత్వం అనుమతించలేదు. అందువల్ల పట్టణం వెలుపల బహిరంగసభ జరిగింది. నెహ్రూగారి హిందీఉపన్యాసాన్ని అచ్యుతపట్వర్థన్‌గారు మరాఠీలోకి



అనువదించినాడు. గంటకుపైగా మాట్లాడిన నెహ్రూగారి ఉపన్యాసం కాళోజిని బాగా ఆకర్షించింది. అంతకుముందే నెహ్రూగారి పుస్తకాలు కాళోజి చదివి ఉన్నాడుకూడ. ఆ పిదప నెహ్రూగారు బార్సీలోనూ జరిగిన ఒక బహిరంగసభలో అమోఘంగా ప్రసంగించినాడు. దానికీ హజరై కాళోజీ తిరిగి హైదరాబాదు చేరుకున్నాడు. ప్రజాఉద్యమాల సందర్భంలో కాళోజీ బయటి రాష్ట్రాలకు వెళ్లడం ఇదే ప్రథమం.

కాళోజీకి 1940 ప్రాంతంలో రుక్మిణీబాయితో వివాహమైంది. ఈమె వరంగల్లుకు సమీపంలోని గవిచెర్ల గ్రామానికి చెందిన వేలూరు మాణిక్యరావుగారి కూతురు. వాళ్లింట్లో ఆమెను యాదక్క అని పిలిచేవాళ్లు. రుక్మిణీబాయిగారి మేనమామ దేవరాజురాజా ఆ రోజుల్లోనే వర్ణాంతర వివాహం చేసుకున్న సంఘసంస్కర్త. సచ్ఛీలుడుగా పేరుగాంచినాడు. ఆయన ప్రతిరోజు వరంగల్లులోని సిద్ధేశ్వర గుండంలో స్నానం చేసి స్వయంగా బట్టలుతుక్కునే వాడు. ఈయన వెంట చిన్నతనంలో కాళోజీకూడ వెళ్లి గుండంలో స్నానం చేసి వచ్చేవాడు. సంఘసంస్కరణాభిలాష, నిస్వార్థసేవాతత్పరత, కాళోజీకి ఈయన వల్ల సంక్రమించి ఉండవచ్చు.

కాళోజీ చిన్ననాటి నుంచే దేనికైనా వెంటనే స్పందించే స్వభావం కలవాడు. ఎంతటి గొప్పవాడైనా ఏమైనా అనుచితంగా అంటే వెంటనే తగిన విధంగా తిప్పికొట్టేవాడు. ఎవరికి భయపడేవాడుకాదు. ఈ గుణం ఆయనలో చివరిదాకా కొనసాగింది. హనుమకొండలో రాజమ్మ అనే ఒక పంతులమ్మ తన స్వస్థలంలో ఆంజనేయస్వామిగుడి కట్టించగా స్థానికులు ప్రతిరోజు అక్కడికివెళ్లి భజనలు చేసేవాళ్లట. రకరకాల సామాజిక వర్గాలవాళ్లు జట్లు జట్లుగా ఒకరితరువాత ఒకరు వెళ్లి భజనలు చేస్తుండేవాళ్లట. ఒకసారి కాళోజీకూడ అక్కడికి విద్యార్థుల జట్టుతో వెళ్లి ఒకచోట నిలుచున్నాడట. అప్పుడక్కడికి వచ్చిన ఒకవ్యక్తి మాటలసందర్భంలో కాళోజీని తల తిరుగుతున్నదా అంటూ దురుసుగా మాట్లాడినాడట. వెంటనే కాళోజీ ప్రతిస్పందించి - సృష్టిలో భూమి గుండ్రంగా తిరుగుతున్నది, దానిపైన ఉన్న చెట్లూగుట్టలూ తిరుగుతున్నాయి. మనుషులు తిరుగుతున్నారు, మరి మనుషులపైనఉన్న తలలు తిరుగవా అంటూ ఎదురుప్రశ్న వేసినాడట. అప్పుడా వ్యక్తి కిమ్మనకుండా నోరు మూసుకున్నాడట.

కాళోజీ కొత్తగా వకీలైన తొలినాళ్లలో ఒకనాడు కోర్టు లైబ్రరీలో కూర్చుండి తోటి వకీళ్లతో పిచ్చాపాటి మాట్లాడుతున్న సందర్భంలో పాశ్చాత్య దేశాలు తిరిగివచ్చిన ఒక ఈడుముదిరిన వకీలు, అక్కడ విచ్చలవిడిగా తిరిగే ఆడవాళ్ల శీలాన్ని గురించి చెడుగా వ్యాఖ్యానించి మన ఆడవాళ్లు శీలవంతులని పొగడినాడట. అప్పుడు కాళోజీ కల్పించుకొని మరి మనదేశంలో మగవాళ్ల సంగతేమిటని అడిగినాడట. ఆ వకీలు ఇక్కడి మగవాళ్లలో 80% మంది పచ్చి వ్యభిచారులని తిట్టినాడట. వెంటనే కాళోజీ స్పందించి, మరి ఇక్కడి మగవాళ్లు ఎవరితో వ్యభిచరిస్తున్నట్లని ఎదురుప్రశ్న వేసేసరికి ఆ వకీలు అవాక్కైనాడట. ఇట్లా ఆడవాళ్లను అపకీర్తిపాలుచేసే విధంగా మాట్లాడడం మన సమాజంలో ఒక దురలవాటుగా మారిందని కాళోజీ ఆవేదన వ్యక్తం చేస్తాడు.

ఒకసారి హనుమకొండలోని నాగులసంది ప్రాంతంలో దొంగలు పడ్డారన్న భయంతో అక్కడి జనమంతా కంగారుగా అటునిటు దొంగలకోసం పరుగిడుతున్నారట. కొందరు లైట్లు వేసుకొని హడావిడి చేస్తున్నారే కాని ఏ ఇంట్లో దొంగలు పడినారో ఎటు వెళ్లినారోనన్న ఆలోచనే చేయకుండా గడబిడ చేస్తున్నారట. ఆ సమయంలో అదే ప్రాంతంలో ఒక మిత్రుని ఇంట్లో మాట్లాడుతూ కూర్చున్న కాళోజీకి ఈ కేకలు వినిపించి, వీధిలోకి వచ్చి గమనిస్తున్నాడట. అదే సమయంలో అక్కడికివచ్చిన అమీన్‌సాబ్ (సబిన్స్పెక్టర్) ఒకాయన దారిలో నిల్చున్న కాళోజీని చూసి ప్రక్కకు జరిగితే నీ మగతనమేమైనా పోతుందానని కోపగించినాడట. వెంటనే కాళోజీ ఉద్రిక్తుడై దొంగలను పట్టుకోవడానికి వచ్చిన వాడికి తన మగతనమేమైనా పనికి వస్తుందేమోనని నిల్చున్నానంటూ బదులు చెప్పేసరికి ఆ అమీన్‌కు చెంపపెట్టులా తగిలి తలవంచుకొని వెళ్లిపోయినాడట.

నిజాంరాష్ట్రంలో తెలుగుకు ఏ మాత్రం ప్రోత్సాహంలేని కాలంలో తెలుగుభాషా సాహిత్యాల్ని పరిరక్షించే ఉద్దేశంతో ఆంధ్ర సారస్వత పరిషత్తును 1943లో స్థాపించినారు. హైదరాబాదులో కొండా వెంకటరంగారెడ్డిగారి అధ్యక్షతన జరిగిన దశమాంధ్ర మహాసభల సందర్భంలో కొద్దిమంది సాహితీ ప్రియులకు ఏదైనా ఒక సాహితీసంస్థను స్థాపించాలన్న కోరిక కలిగింది. పరస్పరం చర్చించుకొని వెంటనే ఒక ఉపసంఘాన్ని వేసినారు. అది



రెండు మూడు మాసాల్లోనే ఒకనియమావళిని సిద్ధం చేసింది. దాని ప్రకారం సాహితీప్రియులు సమావేశమై లోకనంది శంకరనారాయణగారిని అధ్యక్షులుగానూ, బిదురు వెంకటశేషయ్యగారిని కార్యదర్శిగానూ ఎన్నుకున్నారు. ఇంకా మాడపాటి హనుమంతరావూ, సురవరం ప్రతాపరెడ్డీ, బూర్గుల రంగనాథరావూ, భాస్కరభట్ల కృష్ణారావూ, మఱ్ఱిచెన్నారెడ్డీ, కాళోజీ వంటి ఉద్దండులు కొందరిని కార్యనిర్వాహకవర్గంలోకి ఎన్నుకున్నారు. ఇట్లా కాళోజీ పరిషత్తు వ్యవస్థాపక సభ్యుడైనాడు.

ఆంధ్రసారస్వతపరిషత్తు మొదటి వార్షికోత్సవాలు వరంగల్లులో 1944లో మూడు రోజులు వైభవోపేతంగా జరిగినాయి. ఆహ్వానసంఘం అధ్యక్షులుగా వద్దిరాజు రాజేశ్వరరావుగారున్నూ, కార్యదర్శిగా కాళోజీగారున్నూ ఉండి వార్షికోత్సవాల్ని విజయవంతంగా జరిపించినారు. మహాసభలకు సురవరం ప్రతాపరెడ్డిగారు అధ్యక్షత వహించగా, రాజాబహద్దూర్ కొత్వాల్ వెంకటరామారెడ్డిగారు ఉత్సవాలను ప్రారంభించినారు. ఐతే మూడవరోజు కవిసమ్మేళనాన్ని వరంగల్లు కోటలోని ఖుష్మహల్ ప్రాంతంలో ఏర్పాటుచేసినారు. కాని కొందరు ముస్లిందుండగులు పందిళ్లను తగులబెట్టి విధ్వంసం సృష్టించినారు. అంతేకాక ఎం.ఎస్. రాజలింగం, అడవాల సత్యనారాయణ, ఆరెల్లి బుచ్చయ్య వంటి కార్యకర్తల్ని చితుకబాదినారు. వాళ్లు ఆస్పత్రిపాలైనారు. ఐనా ధైర్యంచెడక బూడిదనెత్తిపోసి తగులబెట్టినచోటనే ముసిపట్ల పట్టాభిరామారావుగారి అధ్యక్షతన కవిసమ్మేళనం దిగ్విజయంగా నిర్వహించినారు. నిజాంకాలంలో తెలుగుకు సంబంధించిన సభలంటే అవి ఉర్దూకు వ్యతిరేకమన్నమాట. ఉర్దూకు వ్యతిరేకమంటే అది ముస్లింలకు వ్యతిరేకమన్నమాట. ముస్లింలకు వ్యతిరేకమంటే ముస్లింప్రభువైన నిజాంకు వ్యతిరేకమైందిగా ఆనాడు ముస్లింలు కొందరు భావించేవాళ్లు. ఐతే కంటితుడుపుగా జిల్లాకలెక్టరు అధ్యక్షతన ఒక విచారణసంఘం ఏర్పడి విచారణ జరపడానికి వచ్చింది. అప్పుడా సంఘం తరపున వచ్చిన డిప్యూటికలెక్టరు జరిగిన గొడవ గురించి మాట్లాడుతూ ఇదంతా సరస్వతీపూజ వల్లనే జరిగిందని ఎవేవో అవాక్యలు చెవాక్యలు వాగినాడట. సరస్వతీపూజ అంటే ఆంధ్రసారస్వతపరిషత్తు ఉత్సవాలని ఆ అధికారి ఉద్దేశం. ఇది పరిషత్తును అవమానించడంగా భావించి కాళోజి ఆగ్రహంతో "క్యాబక్ రహాహై" అంటూ ఆ అధికారిని గద్దించినాడట. అంటే ఏం వాగుతున్నావని దాని అర్థం.

వెంటనే జిల్లాకలెక్టరు కలిగించుకొని ఆయన మా డిప్యూటీకలెక్టరంటూ సర్దిచెప్పినాడట. ఇట్లా కాళోజీ ఏ చిన్న అన్యాయమైనా, అవమానమైనా జరిగితే సహించేవాడు కాదు. ఆ పిదప పందిళ్లను తగులబెట్టినవాళ్లు క్షమాపణ చెప్పినారట.

## 5

ఆ రోజుల్లో తెలుగు భాషా సంస్కృతుల వికాసానికి పాటుపడడమంటే నిజాంప్రభుత్వాన్ని కూలదోయడానికేనన్న దురభిప్రాయం కొందరు ముస్లింలలో పాతుకొని ఉండేది. కనుకనే గ్రంథాలయాలు స్థాపించడమన్నా, తెలుగు మాధ్యమంగా పాఠశాలల్ని నెలకొల్పుకోవడమన్నా, తెలుగు భాషాసాహిత్యాల ఉద్ధరణకు సంస్థల్ని నడుపుకోవడమన్నా ప్రభుత్వానికి కంటగింపుగా ఉండేది. ఈ కార్యకలాపాల్ని నిరోధించడం కోసమే నిజాంప్రభువరేణ్యులు 1921లో గస్తీనం. 53. ఫర్మానా జారీచేసినాడు. దీన్నే ఉర్దూలో గస్తీనిషాన్ తిర్పన్ అనేవాళ్లు. దీనిప్రకారం రాష్ట్రంలో ప్రజలు ఏ విధమైన కార్యక్రమాలు చేపట్టదలచినా ప్రభుత్వ అనుమతి తప్పనిసరి. ఈ అనుమతి కోసం కార్యకర్తలు ఎక్కడేవిధమైన భాషాసంస్కృతుల సభలు నిర్వహించ దలచినా, హైదరాబాదుకు వెళ్లి కార్యాలయాల చుట్టూ నెలల తరబడి తిరుగవలసివచ్చేది. ఇంత తిరిగినా ఒక్కొక్కసారి అనుమతి లభించకపోయేది. ఇది వ్యయప్రయాసలతో కూడిన అంశమే కాక సంవత్సరాలు గడిచినా అనుమతి లభించడం కష్టసాధ్యంగా ఉండేది. నిజాంనవాబు ఛత్రచ్ఛాయలోనే బాధ్యతాయుత ప్రభుత్వాన్ని కోరడంకూడా ఆ రోజుల్లో నిజాంప్రభుత్వం నేరంగా భావించేది.

1946 ప్రాంతంలో వరంగల్లు కోటలో ప్రముఖ కాంగ్రెసు నాయకులు కలిసి మన జాతీయ జండా నెగురవేసినారు. దానికి టి. హయగ్రీవాచార్యులుగారు నాయకత్వం వహించినారు. జండాపందనం తరువాత వీళ్లంతా ఒక మిత్రుని ఇంట్లో కూర్చుండి టీ సేవిస్తున్నారు. వాళ్లలో కాళోజీ కూడా ఉన్నాడు. అదే సమయంలో రజాకార్లు కత్తులు కటార్లతో వీళ్లపైకి దాడిచేసినారు. అప్పుడక్కడ ఉన్న మొగిలయ్య అనే దేశభక్తుడు ధైర్యసాహసాలతో వీళ్లందరిని కాపాడి



ఎక్కడివాళ్లనక్కడికి పంపించినాడు. కాని అంతటితో కథ సుఖాంతం కాలేదు. తర్వాత రజాకార్లు పెక్కుమంది మారణాయుధాలతో దాడిచేసి మొగిలయ్యను హతమార్చినారు. అక్కడినుండి రక్కసిమూకలు చెలరేగుతూవచ్చి దారిలో కనిపించిన పసిబాలున్ని బల్లెంతో పొడిచి పైశాచికనృత్యం చేసినారు. అట్లా మొగిలయ్య వీరోచితంగా మరణించగా వరంగల్లు నగరంలో బాగా ఉద్రిక్తత నెలకొన్నది. ఐనా ప్రభుత్వం మనది కాదన్న భయంతో ప్రజలు నిస్సహాయులుగ ఉండిపోయినారు.

ఇది జరిగిన ఒకటిరెండు నెలలకే రజాకార్లు డాక్టర్ నారాయణ రెడ్డిని మండీబజారులోని తన స్వగృహం ముందు దారుణంగా హతమార్చినారు. ఈయన ప్రజలకు వైద్యంచేస్తూ మంచి డాక్టరుగ పేరుగడించినాడు. పోలీసులకూ ముస్లింలకూ కూడ వైద్యం చేసేవాడు. ప్రజలందరి మన్ననలను పొందినవాడు. అందువల్ల ముస్లింల అభిమానంకూడ పొందిన తనకు వాళ్ల వల్ల ఏ హానీ జరుగదన్న ధీమాతో ఉండేవాడు. ఆ భావాన్ని పలుచోట్ల వ్యక్తం చేసేవాడు కూడ. తన హత్యకు ఒకరోజు ముందు నారాయణరెడ్డిగారు ఒకరింట్లో కాళోజీని కలిసికున్నపుడు కాళోజీకి రజాకార్లతో ప్రమాదముందని హెచ్చరించినాడు. ఇది జరిగిన మరునాడే నారాయణరెడ్డి హత్యకు గురికావడం విచిత్రం. కడు విషాదకరం. అప్పటి పరిస్థితులెంతటి దారుణంగా, భయానకంగా ఉండేవో ఈ హత్యలవల్ల తేటతెల్లమవుతుంది.

నారాయణరెడ్డిగారి హత్య జరిగిన మరుసటిరోజు కాళోజీ ఇంకా తదితర వకీళ్లంతా కోర్టుహాల్లో కూర్చున్నారు. అందులో హిందూ వకీళ్లున్నారు. ముస్లిం వకీళ్లున్నారు. "ఇత్తెహాదుల్ ముసల్మీన్" అధ్యక్ష కార్యదర్శులూ ఉన్నారు. ఇది ముస్లింల మతపరమైన సంస్థ. దీన్ని హైదరాబాదులో కొందరు ముస్లిం యువకులు స్థాపించినారు. కాళోజీ కోర్టుహాల్లో కూర్చున్నాడే కాని ఆయన మనసంతా నారాయణరెడ్డిపైనే ఉన్నది. జరిగిన దారుణాని కాయన కుతకుత ఉడికిపోతున్నాడు. ఆవేశాన్ని అపుకోలేక అప్పుడాయన - తనకు రక్తంతో తడిసిన చేతులు కళ్లముందు కదలాడుతున్నాయనీ, రక్తపు కంపు కొడుతున్నదనీ, హంతకుల మధ్య కూర్చుండలేననీ, ముస్లిం నాయకులనుద్దేశించి ఘాటుగ విమర్శించినాడు. అది విన్న ముస్లింవకీళ్లు కోపతాపాలకు గురైనారు. పండ్లు పటపట కొరికినారు. హిందూవకీళ్లు మౌనం వహించి వెళ్లిపోయినారు. అట్లా సందర్భం వచ్చినప్పుడల్లా కాళోజి

దౌర్జన్యపరులపై, దుర్మార్గులపై నిప్పులు చెరుగుతాడు. నిర్మొహమాటంగా ఖండిస్తాడు. అంతేకాక అప్పటికప్పుడు కవితలల్లి తన విప్లవశంఖం ఊదుతాడు. పైన పేర్కొన్న హత్యలు జరిగిన సందర్భంలో కాళోజీ స్పందించి -

పట్టపగలే పట్టణంలో పట్టి
పౌరుల కొట్టిచంపిన
దుష్టకూటమితో ప్రభుత్వం
దొంగబేరము చేసినట్లే
రక్షణకు ఏర్పడ్డ బలగము
రక్కసుల పక్షంబు చేరిన
రాక్షసుల ఇష్టానుసారం
రాజ్యమును నడిపించినట్లే
న్యాయమును పాటింపనొల్లని
ఆధిపత్యం అండ యుండిన
హత్య, దోపిడి, మానభంగాల్
నిత్యకర్మల చేరినట్లే

అంటూ నినదించినాడు. ఎప్పుడే అన్యాయం జరిగినా ఆయన ఊరుకోడు. కార్యరూపంలోనూ, కవితారూపంలోనూ ప్రతిఘటిస్తాడు. అంతేకాక తనకు ప్రాణహాని ఉన్నప్పటికినీ కాళోజీ నిర్భయంగా వరంగల్లులో ఒక్కడే తిరిగేవాడు. రక్షణకోసం ఒకరిద్దరు వలంటీర్లను తోడుగా పెట్టుకోవలసిందిగా ఎవరైనా సలహాఇచ్చినా వినేవాడు కాదు. ఆత్మస్థైర్యం ఉన్నవాడు. ఆ కాలంలో ఒక పోలీసు కానిస్టేబుల్ ప్రవర్తన బాగుండకపోయేది. అతని తాగుబోతుతనానికీ, విచ్చలవిడితనానికీ ఉద్యోగంనుండి తొలిగించినారు. తరువాత అతడు రజాకారుగా మారినాడు. అతడు చేతిలో కత్తిపట్టుకొని రాత్రనక పగలనక అందరిని బెదిరిస్తూ డబ్బులు వసూలు చేసుకునేవాడు. కొత్తగా రజాకారుగా అవతారమెత్తి ఈతడు ప్రజల్ని భయభ్రాంతుల్ని చేస్తుండేవాడు. ఒకనాడు రాత్రిపూట కాళోజీ ఇంటినుండి బయలుదేరి నడుచుకుంటూ వెళుతున్నాడు. చీకట్లో ఈ రజాకారు కత్తి తిప్పుకుంటూవచ్చి కాళోజీని బెదిరింపసాగినాడు. కాళోజీ వాని కాలర్ పట్టుకొని ఏమిరా అంటూ గద్దించినాడు. వెంటనే ఆ రజాకారు కాళోజీని గుర్తించి ఆయన కడుపులో తలపెట్టి క్షమించమని



ప్రాధేయపడినాడు. అట్లా కాళోజీ క్లిష్టసమయంలోనూ ధైర్యసాహసాల్ని ప్రదర్శించేవాడు తప్ప దాసోహమనేవాడు కాదు.

హనుమకొండలో 'ఏనుగులగడ్డ' అని పిలిచే స్థలమొకటున్నది. అక్కడ కాకతీయుల కాలంలో ఏనుగుల్ని కట్టేవారనీ, అందుకే ఆ ప్రాంతానికి ఆ పేరు వచ్చిందనీ జనవ్యవహారం ఉన్నది. దీన్ని ముస్లింలు పీనుగులగడ్డ అంటూ వెక్కిరించేవాళ్లు. దీని చెంత ముస్లింల గోరీలు కూడా కొన్ని ఉండేవి. ఇవి కాకతీయులతో పోట్లాడి వీరమరణం చెందిన ముస్లిం సైనికులవని ఒక భావన ప్రచారంలో ఉండేది. ఈ ప్రాంతంలో పందులూ, కుక్కలూ తిరుగుతుండేవి. హిందువులు పిడుకలుచేసి ఆరవేసుకునేవాళ్లు. ఆ స్థలమంతా చెత్తా చెదారంతో నిండి అపరిశుభ్రంగా ఉండేది. ఐతే ఆ గోరీలు అపరిశుభ్రమవుతున్నాయని భావించిన ముస్లింలు కొందరు దానిచుట్టూ గోడకట్టడంకోసం ప్రభుత్వంనుండి ఉత్తరువులు తెచ్చుకున్నారు. ఈ ప్రాంతంలో రెండు వైపుల హిందువుల ఇండ్లున్నాయి. వాళ్లంతా పేదవాళ్లే. మరొకవైపు మురికి కాలువ ఉన్నది. దీనికి ఒకే ఒక్కవైపు దారి ఉన్నది. ఈ స్థలం చుట్టూ గోడ కడితే హిందువుల ఇండ్లముందు ఏ మాత్రం స్థలం మిగులదు. ఇండ్లల్లోకి రాకపోకలు సాగడానికి వీలుండదు. మే మెక్కడినుండి నడువాలంటూ గోడకట్టడాన్ని హిందువులు వ్యతిరేకించినారు. ముస్లింలు కట్టితీరాల్సిందేనంటూ పట్టుపట్టినారు. పైగా వాళ్లు ప్రభుత్వం నుండి ఉత్తరువులు కూడా తెచ్చుకున్నారాయె. పరిస్థితి ఉద్రిక్తంగా తయారైంది. అప్పుడు కాళోజీ ఇత్తెహాదుల్ముసల్మీన్ అధ్యక్షుని వద్దకు వెళ్లి గోడకట్టడాన్ని వ్యతిరేకిస్తూ అతనితో తీవ్రంగా వాదించినాడు. అసలు గోరీలు కట్టే సంప్రదాయం ఇస్లాం మతంలోనే లేదన్నాడు. మక్కాలో ఒక్క గోరీనైనా చూపించగలవా అంటూ ప్రశ్నించినాడు. ఆ ముస్లిం నాయకుడు కూడ తోటి న్యాయవాదే. అప్పుడతడు హేతుబద్ధంగా సమర్థించుకోవడాని కేమీలేక, ముస్లింలు అట్లా కోరుతున్నారంటూ పేలవంగా సమాధానమిచ్చినాడు. కాళోజీ ఇట్లా ధైర్యంతో ఆ ముస్లిం నాయకుని ఇంటికి వెళ్లి వాదించిరావడాన్ని చాలామంది కొనియాడినారు. కొందరైతే ఏ ప్రమాదం జరుగుతుందోనని భయపడినారు. చివరికి గోడకట్టడాన్ని నిలిపివేసినారు. ఇదీ ఆనాటి పరిస్థితి. నిజాంరాజ్యంలో హిందువుల జీవనగతులు ఎంతటి దుర్భరంగా ఉండేవో వీటివల్ల అవగతమవుతుంది. ప్రజలు తమకు కొన్ని సదుపాయాలు కావాలని కోరడంకూడ అది ప్రభుత్వ

వ్యతిరేకచర్యగా అధికారులు భావించేవాళ్లు. ప్రజలు తమ మతాచారాల్ని పాటించడంకూడ కొందరు ముస్లింలకు కంటగింపుగ ఉండేది. తెలుగు భాషాసాహిత్యాల వికాసంకోసం పాటుపడడం, గ్రంథాలయాల్ని స్థాపించుకోవడం వంటివి ఆ రోజుల్లో పాలకుల దృష్టిలో ప్రభుత్వ వ్యతిరేక చర్యలుగా కనిపించేవి. గ్రంథాలయాల్ని విప్లవకేంద్రాలుగానూ వాళ్లు భావించేవాళ్లు. నిజాం ఛత్రచ్ఛాయలో బాధ్యతాయుత ప్రభుత్వాన్ని కోరడం కూడ నిజాంనవాబును గద్దెదించడానికి చేసేకుట్రగా భావించి ప్రభుత్వం ప్రజానాయకుల్ని జైల్లో పెట్టేది. ఇట్లాంటి దుర్భర వాతావరణంలో, ఇత్తెహాదుల్ముసల్మీన్ సంస్థ ఆగడాలు మరీ పెరుగుతూ వచ్చినాయి. ఈ అవకాశాన్ని అదనుగాతీసుకొని నిజాం ప్రభుత్వం కాళోజీ, టి. హయగ్రీవాచారి, ఎం.ఎస్.రాజలింగం, రామస్వామి ఇంకా మరికొందరిని మూడు నెలలపాటు వరంగల్లు నగరబహిష్కారం చేస్తూ ఉత్తర్వులు విడుదల చేసింది. దీన్నే ఉర్దూలో 'షహరేబదర్' అనేవాళ్లు. వీళ్లతో పాటు కంటితుడుపుగా కొందరు ముస్లిం నాయకుల్ని కూడ బహిష్కరించింది. కాళోజీ తదితర నాయకులంత వరంగల్లును విడిచి ఇతరప్రదేశాలకు వెళ్లిపోయినారు. కాని ఒక్క ఎం.ఎస్.రాజలింగంగారు మాత్రం ప్రభుత్వ ఉత్తర్వులు ధిక్కరించి వరంగల్లును విడిచి వెళ్లిపోలేదు. అందువల్ల ఆయన్ని ప్రభుత్వం అరెస్టుచేసి జైలుకు పంపింది. ఇంతకూ విచారిస్తే ఇది హిందూ ముస్లింల మధ్య తగాదాకాదు. అది ప్రభుత్వ దమననీతికీ, ఫ్యూడల్ అరాచకానికీ, దొరలు దేశముఖుల దౌర్జన్యానికీ, వాళ్ల దోపిడికీ వ్యతిరేకంగా సాగిన ప్రజలపోరాటం. భూమికోసం భుక్తికోసం రైతాంగం సాగించిన విముక్తి పోరాటం. కాని దీన్ని ముస్లిం సోదరులు తమ రాజ్యానికి వ్యతిరేకపోరాటంగా అపార్థం చేసుకున్నారు. మహాఘనతవహించిన నిజాంప్రభువరేణ్యుల పీఠానికే ముప్పువాటిల్లుతున్నదని భావించినారు. దీనికి మతంరంగు పులిమినారు. హిందూముస్లింల తగాదాగా చిత్రీకరించినారు. ముస్లింలలో ఏర్పడిన ఈ భావోద్రేకాల్ని నిజాంప్రభువు తన కనుకూలంగా వాడుకున్నాడు. తన పీఠాన్ని పదిలపరచుకోవడంకోసం మతద్వేషాన్ని పెంచి పోషించినాడు. బహదూర్‌యార్జంగ్, ఖాసింరజ్వీ వంటి మతోన్మాదుల్ని ఉసికొల్పినాడు. మతఘర్షణలు చెలరేగడానికి ప్రభుత్వం ప్రదర్శించిన ఈ వివక్షేకారణమైంది. ఇట్లా పరిస్థితులు దిగజారుతున్న సమయంలో, హైదరాబాదు రాష్ట్రానికప్పుడు ప్రధానిగా ఉన్న మిర్జాఇస్మాయిల్



వరంగల్లు నగర స్థితిగతుల్ని పరిశీలించడంకోసం బయలుదేరినాడు. అప్పుడు నగర బహిష్కరణలో ఉన్న కాళోజీ మిర్జాఇస్మాయిల్ కొక లేఖరాస్తూ అందులో తనను నగరబహిష్కారం చేయడానికి గల కారణాలేమిటో, వరంగల్లులో పరిస్థితులు విషమించడానికి తానెట్లా కారకుడైనాడో రుజువు పరిచేందుకు తనను కూడా వెంట తీసుకపోవలసిందిగా మిర్జాఇస్మాయిల్‌ను కోరినాడు. ఆ లేఖను కాళోజీ స్వయంగా ప్రధానమంత్రికి అందజేయడానికి ఆయన నివాసానికి వెళ్లినాడు. కాని ఆయన కలువనందున ఆ లేఖను అక్కడి సిబ్బంది చేతికిచ్చి వచ్చినాడు. ఐతే ప్రధానమంత్రి కార్యాలయంనుండి కాళోజీకి ఏ విధమైన వార్త అందలేదు. మిర్జాఇస్మాయిల్ వరంగల్లు వెళ్లినాడు. అప్పుడు కాళోజీ కుపితుడై గేయరూపంలో ఈ విధంగా ప్రధానికొక బహిరంగ లేఖ రాసినాడు.

ఎన్నాళ్లనుండియో ఇదిగొ అదిగొ యనుచు
ఈనాటికైనను ఏగివచ్చితివా?
కోటగోడలమధ్య ఖూని జరిగినచోట
గుండాల గుర్తులు గోచరించినవా?
జెండ యెత్తిన యంత జంబియాలు దూసిన
శిక్ష తప్పదటంచు చెప్పి వచ్చితివా?
బాజార్లో బాలకుని బల్లెంబుతో పొడుచు
బద్మాషునేమైన పసిగట్టినావ?
సూబాధికారులు జోహుకుం అనువారు
చుట్టూ చేరి అంత చూపెట్టినార?
కాలానుగుణ్యమౌ కాళోజీ ప్రశ్నలకు
కళ్లెర్రజేసి ఖామోష్ అంటవా?

ఈ గేయాన్ని కాళోజీ గోలకొండ పత్రికకు పంపగా సురవరం ప్రతాపరెడ్డిగారు దీన్ని అందులో ప్రముఖంగా ప్రచురించినారు. ఈ గేయం అప్పట్లో బాగా ప్రచారమైంది. వరంగల్లు నగరబహిష్కరణలో ఉన్న కాళోజీ ఈ మూన్నెల్లూ వేరువేరు ప్రాంతాలకువెళ్లి కాలంగడిపినాడు.

కాళోజీకి నిత్యవ్యవహారాల్లో ఒక క్రమమంటూ ఉండదు. నియమ నిబంధనలకు కట్టుబడేవాడుకాదు. ఏ మిత్రుడెటురమ్మని తీసుకపోయినా

కట్టుబట్టలతో ఆతని వెంట వెళ్లుతాడు. నెలలకొద్ది అక్కడే గడుపుతాడు. పెద్దపెద్ద భవంతుల్లోనూ నివసిస్తాడు. పేదవాళ్ల పూరిగుడిసెల్లోనూ ఉంటాడు. ఆహారపానీయాల్లో పట్టుదలలులేవు. వెండిగిన్నెలలో మృష్టాన్నభోజనం పెట్టినా ఆరగిస్తాడు. మట్టిపాత్రలలో కారంమెతుకులు పెట్టినా భుజిస్తాడు. ఇంటినుండి బయలుదేరేటప్పుడు ఎక్కడెక్కడికి వెళ్లి ఎన్నెన్ని రోజులుంటానోనన్నది ఆయన ఆలోచనలోనే ఉండదు. కాళోజీ జీవితమంతా ఇట్లాగే సాగింది. మొత్తానికి ఆయన స్వేచ్ఛాజీవి. ఎందుకంటే ఆయనకు సంసారం గురించిన బరువు బాధ్యతలు లేవు. సంపాదించేవాడు కాదు. ఇట్లా కాళోజీ జీవితం సాగడానికి అన్నగారైన రామేశ్వరరావుగారి చలువే కారణం. ఆయనే సర్వస్వమై కాళోజీనీ, ఆయన కుటుంబాన్నీ పోషించినాడు. తన స్వేచ్ఛాజీవితాన్ని గూర్చి వర్ణిస్తూ కాళోజీ ఒకచోట ఇట్లా ఒక గేయంలో చెప్పుకున్నాడు -

అతిథివోలె ఉండి ఉండి
అవని విడిచి వెళ్లుతాను
పల్లె పట్టణంబు లనక
పల్లేరై తిరిగినాను
మురికి నీటి నడుమనున్న
ఇరుకులలో ఇరికినాను
కూటిపేద తన కబళము
నోటికీయ గుడిచినాను.
పూలవాసనలు నిండిన
పాలరాతివేడలలో
ఆయాసము కలిగించెడి
పాయసాలు మెక్కినాను
వాయువుతో పోటీపడు
వాహనాలు ఎక్కినాను
కంటకాల మధ్య నేను
కాలినడక నడిచినాను
కాలుబైట పెట్టకుండ
కాలమెంతొ గడిపినాను
. . . . . . . . . . . . . .



ఈగవోలె దోమవోలె
వాగుచు తిరుగాడినాను
అతిథివోలె ఉండి ఉండి
అవని విడిచివెళ్లుతాను

ఇట్లా ఈ గేయంలో కాళోజీ తన స్వభావాన్నంతా వర్ణించుకున్నాడు.

## 6

హైదరాబాదురాష్ట్రంపై పోలీసుచర్య జరుగకముందు కాళోజీ పలుసార్లు జైలుకువెళ్లి అష్టకష్టాలనుభవించినాడు. అక్కడి అనుభవాలగూర్చి ఆయన అప్పుడప్పుడూ మిత్రులతో చెప్పుతుండేవాడు. కొందరు ఖైదీలు బీడీలకో సిగరెట్లకో అలవాటుపడి వాటికోసం నానా తంటాలుపడేవాళ్లట. తిండిగూర్చి పట్టింపులేకున్నా ఇలాంటి అలవాట్ల గురించి మాత్రం తల్లడిల్లేవాళ్లట. ఈ దురలవాట్ల కారణంగానే అవసరమైతే క్షమాపణచెప్పి లొంగిపోవడానికికూడ సిద్ధపడేవాళ్లట. కాళోజీకి తప్పనిసరిగా కావాలన్న దురలవాట్లేవీ లేనందున ఆయన కే చీకూచింతాలేకుండేది. అసలు కాళోజీది నియమబద్ధమైన జీవితం కాదాయె. అన్నం ఉడికినా ఉడుకకపోయినా, రొట్టె కాలినా కాలకపోయినా సర్దుకపోయే మనస్తత్వమాయనది. ఫలానా సమయానికి ఫలానాది తప్పనిసరిగా కావాలన్న అలవాట్లు కలవాడు కాదు. నిర్ణీత సమయానికి నియమబద్ధంగా కాలకృత్యాలు తీర్చుకోవాలని తొందరపడేవాడు కాదు. అవకాశం వచ్చి అన్ని సౌకర్యాలు లభించినా వద్దనేవాడు కూడా కాదు. అందువల్ల దుర్భరమైన జైలుజీవితాన్ని కూడా ధైర్యంతో అనుభవించగలిగినాడు. ఎటొచ్చీ ఆయనకు ఆరోగ్యమే సహకరించేది కాదు. జైల్లో పాతికమందిని ఉంచవలసిన ఒక్కొక్క బారక్‌లో నూరూ నూటాయాభై మంది ఖైదీలదాకా కుక్కేవాళ్లట. సగంకాలిన రొట్టె, ఉడికీఉడకని అన్నంపెట్టి ఖైదీలను నానాహింసలు పెట్టేవాళ్లట. ఖైదీలను చూడడానికి బంధువులనో మిత్రులనో సులభంగా అనుమతించేవాళ్లు కాదట. నిజాంకాలంలో ఖైదీలను పశువులకన్న కడహీనంగా చూసేవాళ్లని కాళోజీ చెబుతుండేవాడు.

ఇక్కడ విచిత్రమేమిటంటే రెండవ ప్రపంచయుద్ధ సమయంలో

కమ్యూనిస్టులు మొదట దాన్ని సామ్రాజ్యవాద యుద్ధమంటూ వ్యతిరేకించినారు. ఎప్పుడైతే రష్యా మీదికి జర్మనీ దండెత్తిందో అపుడు మాటమార్చి కమ్యూనిస్టులు దాన్ని ప్రజాయుద్ధమంటూ సమర్థించసాగినారు. ఇది బ్రిటిషు ప్రభుత్వానికి అనుకూలమైన ధోరణి కనుక అప్పటికి కమ్యూనిస్టులపై ఉన్న నిషేధాన్ని తొలగించినారు. అయితే ప్రపంచయుద్ధం ముగిసిన కొన్నాళ్లకు అంటే 1946 ప్రాంతంలో ప్రభుత్వం కమ్యూనిస్టులపై మళ్లీ నిషేధం ప్రకటించింది. కమ్యూనిస్టుల సాయుధపోరాటంతో గ్రామప్రజలు అడకత్తెరలో పోకచెక్క మాదిరిగా నలిగిపోయినారు. ఎందుకంటే రాత్రిళ్ళు కమ్యూనిస్టులు వచ్చి గ్రామప్రజల ఆశ్రయం పొందేవాళ్లు. పగలు పోలీసులు వచ్చి ప్రజల్ని వేధించేవాళ్లని కాళోజీ చెప్పుతుండేవాడు. కమ్యూనిస్టుల మీద నిజాం పోలీసులవత్తిడీ బాగాపెరిగి కనిపిస్తే వాళ్లను కాల్చివేసేవాళ్లు. ఈ ప్రక్రియలో అమాయక ప్రజలు బలైపోయే వాళ్లు.

రెండవ ప్రపంచయుద్ధాన్ని మొదట కమ్యూనిస్టులు సామ్రాజ్యవాద యుద్ధమనీ, ఆ పిదపదాన్ని ప్రజాయుద్ధమనీ మాటమార్చిన సందర్భంలో ప్రభుత్వం కమ్యూనిస్టులపట్ల వ్యవహరించిన తీరును దృష్టిలో పెట్టుకొని కాళోజీ -

ప్రజా సంస్థపై పగ సాధించిన
ఫలితము తప్పక బయటపడున్

అంటూ కవిత చెప్పి వాళ్ల కళ్లుతెరిపించినాడు. ఎందుకంటే ప్రభుత్వం చాకచక్యంగా, కమ్యూనిస్టులు ప్రపంచయుద్ధాన్ని ప్రజాయుద్ధమని బలపరచినప్పుడు వాళ్లపై ఉన్న నిషేధాన్ని ఎత్తివేసి, యుద్ధం పరిసమాప్తం కాగానే తిరిగి నిషేధం విధించింది. ఇట్లా వాళ్లకు తగిన ప్రాయశ్చిత్తం కలిగిందని కాళోజీ భావించినాడు.

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన పిదప భారతప్రభుత్వానికీ, నిజాంప్రభుత్వానికీ "స్టాండ్‌స్టిల్" ఒప్పందం కుదిరింది. అంటే ఎక్కడున్నవాళ్లు అక్కడే ఉండిపోవాలన్న ఒప్పందమన్నమాట. ఒక సంవత్సరం వరకు ఎవరు ఎవరి మీదికి దాడి చేయకూడదని దాని తాత్పర్యం. దాని ప్రకారం నిజాంప్రభుత్వం జైల్లోఉన్న రాజకీయఖైదీలందరినీ విడుదలచేసేటందుకు ఉత్తర్వులిచ్చింది. ఒక జైలుఅధికారి కాళోజీ దగ్గరకు వచ్చి తనను



విడిచిపెడుతున్నామని చెప్పగానే కాళోజీ వెంటనే స్పందించి ఖాసింరజ్వీని జైల్లో పెడుతున్నరా అని ఎదురు ప్రశ్నవేసినాడట. ఆ అధికారి నివ్వెరపోయి అదేమిటి అట్లాఅంటున్నారేమనంటే - ఖాసింరజ్వీకి కాళోజీకి ఒకేసారి స్వేచ్ఛ ఉండడానికి వీలులేదనీ, ఒకరు జైల్లో ఉంటే మరొకరు బయట ఉండాల్సిందేననీ కాళోజీ చమత్కరించినాడట. ఇక ఆ అధికారి మారుపలుకక వెళ్లిపోయిన్నాడట. ఈ ఖాసింరజ్వీ రజాకార్ నాయకుడు. 'రజాకార్ సాయుధదండును తయారుచేసి గ్రామాలకు గ్రామాలనే తగులబెట్టించిన కిరాతకుడు. మనుషుల్ని పిట్టల్ని కాల్చినట్లుగా కాల్పించిన దుర్మార్గుడు. ఎందరో స్త్రీల మానభంగాలకు కారకుడైన నరరూప రాక్షసుడు, మతోన్మాది. అసలు 'రజాకార్' అనే ఉర్దూపదానికి స్వచ్ఛంద సైనికుడనే అర్థమున్నది. కాని వాళ్ల దుశ్చర్యలవల్ల ఆ పదమే భ్రష్టుపట్టిపోయింది. ఐతే జైలునుంచి విడుదలైన కాళోజీకి ఆ పిదప జాతీయజెండా ఎగురవేసిన కేసులో మళ్లీ జైలుశిక్ష పడింది. 1948 సెప్టెంబరులో హైదరాబాదు రాష్ట్రంపై పోలీసుచర్య జరిగిన పిదప మాత్రమే కాళోజీ విడుదలై వచ్చినాడు.

నిజాంరాష్ట్రంలో ఇన్ని ప్రజాఉద్యమాలు, పోరాటాలు సాగుతున్నప్పటికినీ వీటిలో ముస్లిములు పాల్గొనేవాళ్లు కాదు. వాళ్లలోనూ ఎందరో పేదవాళ్లున్నారు. కష్టజీవులున్నారు. పీడితులున్నారు. ఐనాసరే వాళ్లు రాష్ట్రంలోని ప్రజలతో కలిసి ఉద్యమాల్లో పాల్గొనేవాళ్లు కాదు. వీటిలో వాళ్ల పాత్ర ఏమీ ఉండేది కాదు. ఎందుకంటే ఈ రాజ్యం ముస్లింలదీ, రాజు ముస్లింవాడన్న భావం వాళ్లలో బలంగా ఉండేది. కనుక ఈ రాజ్యాన్ని పాలించే అధికారం ముస్లింలకే ఉన్నదనీ, ఈ ముస్లిం రాజ్యాన్ని ప్రతి ముస్లింవాడు తనదిగా భావిస్తూ కాపాడుకోవాలనీ వాళ్లకు పట్టుదలగా ఉండేది. అందుకే ఈ రాష్ట్రంలో ఆంధ్రమహాసభ అయినా, కాంగ్రెసుపార్టీ అయినా, కమ్యూనిస్టుపార్టీ అయినా, ఇంకా మరేసంస్థ అయినాసరే అవి నడిపిన ఉద్యమాల్లో ముస్లింలు పాల్గొనలేదు. ప్రజా ఉద్యమాలకు వాళ్లు దూరంగానే ఉండిపోయినారు. ఎక్కడో నూటికోకోటికో ఒకరిద్దరు పాల్గొన్నారు తప్ప వాళ్లు ఉద్యమాలతో మమేకం పొందలేదు. పైగా ఈ ఉద్యమాలను వ్యతిరేకించేవాళ్లు. అట్లాగే జమీందార్లూ, జాగీర్దార్లూ కోటీశ్వరులూ వాళ్లు హిందువులైనా ముస్లిములైనా ప్రజా ఉద్యమాలకు దూరంగానే ఉండిపోయినారు. ఎందుకంటే వాళ్ల భోగభాగ్యాలకు ప్రమాదం వస్తుందన్న భయం వాళ్లకుండేదని

కాళోజీ చెబుతుండేవాడు. వరంగల్లులో ఎక్కువగా కిందితరగతుల ప్రజలే ఉద్యమాల్లో పాల్గొన్నారు. ఇతర గ్రామాల నుండి హనుమకొండకు చదువుకోవడానికి వచ్చిన విద్యార్థులూ చురుగ్గా ఉద్యమాల్లో పాల్గొనేవాళ్లు. సంపన్నులూ, విద్యాధికులూ ఎక్కువగా తమకేమీ పట్టనట్లు అంటకముట్టక ఉండేవాళ్లు. ఈ ఉద్యమాలతో తమకువచ్చేదేమిటని వాళ్లలో కొంత ఉదాసీనభావం కనిపించేది. ఐతే తమ కిష్టమైనదేదైనా సభ జరిగితే దానికి మాత్రమే హాజరయ్యేవాళ్లని కాళోజి అప్పటి పరిస్థితుల గూర్చి చెబుతుండేవాడు.

దసరా పండుగ వచ్చిందంటే తెలంగాణంలో కత్తులు కఠార్లు పట్టుకొని జమ్మిపూజకోసం ఊరిబయటకు వెళ్లడం ఆచారం. జమ్మిపూజ జరిపిన పిదప దాని ఆకు కోసుకొని పాలపిట్టను దర్శించుకొని తిరిగి ఇల్లు చేరుతుంటారు. కాని నిజాంప్రభుత్వం ఈ కత్తులుకఠార్లు పట్టుకోవడాన్ని నిషేధించింది. అందుకు ఎదురుతిరిగి కొందరు యువకులు ఒక దసరానాడు కత్తులుకఠార్లు కట్టెలు పట్టుకొని జమ్మిపూజకోసం బయలుదేరినారు. ఇందులో కాళోజీ కూడ ఒక కత్తిపట్టుకొని వెళ్లినాడు. అదే సమయంలో కొత్తగా ముస్లింమతం పుచ్చుకున్న పీసరవీరయ్య అనే హరిజనుడొకడు నిజాంజెండా చేతపట్టుకొని పాతికమంది అనుయాయులతో గుర్రం మీద స్వారీచేస్తూ ఈ యువకుల గుంపును అడ్డగించినాడు. ఈతడు ముస్లింగా మారిన పిదప సర్దార్‌అలీగా పేరు మార్చుకున్నాడు. మొదట్లో ఈతని రాకను చూసి ముస్లింగా మారినవాడు దసరాఉత్సవాల్లో పాల్గొనడమేమిటా అని జనం విస్తుపోయినారు. కాని ఆతడు దాడిచేయవచ్చినాడన్న సంగతిని తొందరగా గ్రహించి ప్రజలు తిరగబడి ఆతని చేతిలో ఉన్న నిజాంజెండాను చింపివేసినారు. ఇక్కడేదో అల్లరి జరుగుతున్నదన్న సంగతి తెలిసినవెంటనే మహమూద్ అనే డి.ఎస్.పి. రంగప్రవేశం చేసినాడు. ఐనా ప్రజలు రెచ్చిపోయి ఈతని కారుపైన రాళ్లు రువ్వినారు. అప్పుడా డి.ఎస్.పి. చేసేదిలేక కాళోజీని బ్రతిమిలాడి తనకు రక్షకుడుగా ఆయన్ని తన కారులో ఎక్కించుకొని అక్కడినుంచి పలాయనం చిత్తగించినాడు. ఇంతలో గుండా నారాయణ అనే చిన్న దుకాణందారుడు ఒక తుపాకిలో తూటానింపి దాన్నిపోలీసులపై గురిపెట్టినాడు. ఈయన పిల్లవాడు కనుక అక్కడున్న జమేదారొకడు జాగ్రత్తపడి ఆ తుపాకిని నారాయణ దగ్గర నుంచి గుంజుకున్నాడు. అదే సమయంలో డి.ఎస్.పి. కారులో వెళ్లిపోతున్న కాళోజీని చూసి నారాయణ తన తుపాకిని తనకిప్పించవలసిందిగా కోరినాడట.



అప్పుడు కాళోజీ ఆ డి.ఎస్.పి.కి ఏదో నచ్చ చెప్పి నారాయణ కా తుపాకి నిప్పించినాడట. నారాయణ కనుక ఆ తుపాకిని పేల్చి ఉంటే పెద్ద ప్రమాదమే జరిగి ఉండేదట. ఇట్లా కాళోజీకి వరంగల్లులోని అధికారులతో మంచి పరిచయాలుండేవి. వాళ్లు కాళోజీని గౌరవించేవాళ్లు. ఐతే మతసంబంధమైన కలహాలు చెలరేగినప్పుడు మాత్రం ఆ అధికారులు తరచుగా ముస్లింలపక్షమే ఉండేవాళ్లు. నిజాంజెండాను చింపి అవమానపరచినారని నేరం మోపుతూ పాతికమందిపై ప్రభుత్వం కేసు నమోదు చేసింది. అందులో మొదటి ముద్దాయి తూమువరదరాజులుగారు, రెండవ ముద్దాయి కాళోజి రామేశ్వరరావుగారు, మూడవ ముద్దాయి ఏటూరి వెంకటేశ్వరరావుగారు, నాలుగవ ముద్దాయిగా స్వరూప్‌సింగ్‌గా రుండిరట. కాని ఈ కేసును కొంత కాలానికి ఇరుపక్షాలమధ్య రాజీకుదిర్చి ఉపసంహరించుకున్నారట.

కాళోజీతో మరి కొందరు సమవయస్కులు కలిసి ఒక జట్టుగా ఏర్పడి సమాజసేవాకార్యక్రమాలు నిర్వహించేవాళ్లట. ఎవరైనా అనాథలు చనిపోతే శవాన్ని తీసుకపోయి దహన సంస్కారాలుచేసి వచ్చేవాళ్లు. ఇట్లాంటివి చేయడానికి ఇతరులెవ్వరూ ముందుకు వచ్చేవాళ్లు కాదు. వీళ్లలో రకరకాలవాళ్లుండేవాళ్లు. రాజన్న అనేవాడొకడు సైకిల్ రిపేరు చేసే దుకాణం కలిగి ఉండేవాడు. ఈయన బలిష్ఠుడై పహిల్వాన్‌గా కనిపించేవాడు. ఈయన ఇతరుల మాటల్ని అనుకరించేవాడు. ముఖ్యంగా షావుకార్ల మాటల్ని ఉన్నది ఉన్నట్లుగా అనుకరించి వినోదం కలిగించేవాడట. ఇప్పుడీ విద్యలో ధ్వన్యనుకరణసమ్రాట్ నేరెళ్ల వేణుమాధవ్‌గారు జగద్విదితుడు. అట్లాగే గొంగళ్ల వెంకటయ్య అనే మరొకడుండేవాడు. ఈయనకూడ ప్రజా కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొనేవాడు. ఇంకా మరికొందరు మాటేటివాళ్ల పిల్లలూ, కుసుమవాళ్ల పిల్లలూ ఈ జట్టులో ఉండేవాళ్లు. ఎక్కువగా పద్మశాలీ పిల్లలే ఉండేవాళ్లు. వీళ్లలో మధుసూదన్ అనే వారుండేవారు. చిన్నప్పుడు ఈయనపేరు మల్లయ్య. తరువాత మధుసూదన్‌గా మారినాడు. ఈయన ఎక్కువగా చదువుకోలేదు. కాళోజీ కుటుంబానికి అతి సన్నిహితుడు. వాళ్ల కుటుంబంలో ఒకడుగా ఉండేవాడు. కాళోజీగారి తల్లి ఈయన్ని బాగా ఆదరించేది. ఈ మధుసూదన్‌గారు మంచి కార్యదక్షుడు, క్రియాశీలి, ఉత్సాహవంతుడు. నిత్యం వ్యాయామం చేసేవాడు. ఆర్యసమాజం కార్యకర్తలకు వ్యాయామంలో శిక్షణ ఇచ్చేవాడు. అందుకే ఈయన్ని కెప్టెన్ అనేవాళ్లు. ఈయన్ని

నిజాంపోలీసులు చిత్రహింసలు పెట్టినారు. జైల్లో వేసినారు. ఐనా నిర్భయంగా సమాజసేవాకార్యక్రమాల్లో పాల్గొనేవాడు. ఈయన టి. హయగ్రీవాచారి, పొట్లపల్లి రామారావుగారలతో కలిసి మొదటి జట్టులో సత్యాగ్రహం చేసినాడు.

మధుసూదన్‌గారు పింగిలి రంగారావుగారి కూతురు అనసూయకు మొదట ట్యూషన్ చెప్పడానికి కుదిరి ఆ పిదప ఆమెను ప్రేమించి ఆర్యసమాజం పద్ధతిలో పెళ్లి చేసుకున్నాడు. ఇది కులాంతర వివాహం కనుక అనసూయ తల్లిదండ్రులు దీన్ని అంగీకరించక మధుసూదన్‌గారిపైనా వీళ్ల పెండ్లి జరిపించిన ఆర్యసమాజ్ గురువు చంద్రపాల్‌జీగారిపైనా కేసుపెట్టి జైలుకు పంపినారు. పిదప అనసూయకు వేరే సంబంధం చూసి వివాహం చేసినా ఆమె అతనితో కాపురం చేయలేదు. చివరికి కేసులో మధుసూదన్ గారు నెగ్గినారు. జైలునుంచి విడుదలయివచ్చిన పిదప మధుసూదన్, అనసూయగారలు సుఖంగా కాపురం చేసినారు. ఈ ఇద్దరూ కలిసి సమాజ కార్యక్రమాల్లో పాల్గొన్నారు. బాలికలకోసం ఒక పాఠశాలను కూడా స్థాపించినారు. మధుసూదన్‌గారు ఆ పిదప రెండుసార్లు ఎన్నికల్లో పోటీ చేసి ఎం.పి.గా గెలిచి ఎన్నో ప్రజాకార్యక్రమాల్ని నిర్వహించినారు. కాళోజీ సోదరులు వీళ్ల పెండ్లిని ప్రోత్సహించకున్నా వ్యతిరేకించలేదు. కాని పిదప ఆమోదం తెలిపినారు. అనసూయగారి తల్లిదండ్రులు కాళోజీ సోదరులకు బంధువులు కూడ. ఐనా కాళోజీ ఈ నూతన దంపతులను ఆశీర్వదించినాడు. కాళోజీగారి మాతృమూర్తికూడ విశాలహృదయం కల సాధ్వీమణి. ఆమెకు కులపట్టింపులు లేవు. ఏ కులంవాడైనా ఇంటికి వచ్చిన వ్యక్తిని అందరితో సమంగా కూర్చుండబెట్టి భోజనం వడ్డించేది. అట్లాగే కాళోజీగారి తండ్రిగారు కూడ అన్ని మతస్థులను సమంగా గౌరవించేవాడు. వారు ఒక విధంగా సూఫీమార్గానికి చెందినవారని చెప్పాలి. ఆయనకూడ విశాలహృదయం కలవాడు. ఇట్లా ఇంటి వాతావరణప్రభావంకూడ కాళోజీ మీద కనిపిస్తుంది. అందువల్లనే కాళోజీకి కులంపట్టింపులు లేవు. ఆ రోజుల్లో పైకులాల వాళ్లు కింది కులాలవాళ్ల నీళ్లు తాగడం పెద్ద నేరంగా భావింపబడేది. అట్లాంటి కాలంలో ఆయన చిన్నతనంలోనే తోటి పిల్లలతో కలిసి ఆటలాడుతూవెళ్లి దప్పికైనప్పుడు ఎవరి నీళ్లైనా తాగేవాడు. తోటిపిల్లలు ఆశ్చర్యం ప్రకటించేవాళ్లు. ఆయన ఇంటర్మీడియేట్ పరీక్ష రాస్తున్నప్పుడొకసారి ముస్లింల కూజాలోని నీళ్లు తాగినాడు. అప్పుడు ఆయన సహచ ులు కొందరు ఈయన్ని



తురకోళ్ల నీళ్లు తాగాడంటూ గేలిచేసినారు. కాళోజీ ఇంటికి దసరా వంటి పండుగలకు హిందువులూ, ముస్లింలూ ఇతర కులాల వాళ్లందరూ వచ్చేవాళ్లు. కాళోజీగారి తల్లి అందరినీ సమభావంతో గౌరవించేది. అతిథ్యమిచ్చేది. వాళ్లింటికి విశ్వనాథ సత్యనారాయణగారు వచ్చి భోజనం చేసేవాడు. అట్లాగే జాషువాగారు వచ్చినా తమతో సమంగా కూర్చుండబెట్టుకొని భోజనంచేసేవాళ్లు.

## 7

వరంగల్లులో 1943-44 ప్రాంతంలో శబ్దానుశాసన ఆంధ్రభాషానిలయం వార్షికోత్సవాలు జరిగినాయి. అప్పుడు ఆ భాషానిలయానికి దేవులపల్లి రామానుజరావుగారు కార్యదర్శిగా ఉండేవారు. ఈ ఉత్సవాలకు రాయప్రోలు సుబ్బారావుగారూ, గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారూ, తల్లావఝ్ఝల శివశంకర శాస్త్రిగారూ వంటి పెద్దలెందరో వచ్చి ఉండిరి. ఆ ఉత్సవాల్ని వరంగల్లు స్టేషన్‌దగ్గర వరమ్మసత్రంలో పందిళ్లువేసి జరిపించినారు. అ సభలో కాళోజీగారున్నూ ఆసీనులై ఉండిరి. అక్కడ సాహితీవేత్తలంతా కాళోజీని పలుకరిస్తూ కుశలప్రశ్నలు వేస్తున్నారు. కాని రాయప్రోలు మాత్రం ముభావంగా ఒక పడకకుర్చీలో కూర్చున్నాడు. అప్పుడు గాడిచెర్లవారు రాయప్రోలుగారికి కాళోజీని చూపిస్తూ ఈయన్ని ఎరుగవా అని ప్రశ్నించినాడు. రాయప్రోలువారు ఏమో ఎక్కడో చూసినట్లు గుర్తున్నదని తేలిగ్గా బదులుచెప్పి ఊరుకున్నారు. వెంటనే గాడిచెర్లవారు ఆశ్చర్యం ప్రకటిస్తూ తెలంగాణా ప్రాంతంలోని ప్రముఖులతో పరిచయాలు పెంచుకోలేదా అంటూ రాయప్రోలును నిలదీసినారు. ఇంతకాలంగా తెలంగాణాలో ఉంటూ తెలంగాణలో ఉద్యోగం చేస్తూ తెలంగాణా కవి పండితులెవ్వరితోనూ రాయప్రోలువారు సంబంధాలు పెట్టుకోనందుకు గాడిచెర్లవారు ఆయన్ని గట్టిగానే మందలించినారు. అదేరోజు రాత్రి కాళోజీ "కోకిల" శీర్షికతో ఒక కవిత రచించినాడు. అ మరునాడు రాయప్రోలు అధ్యక్షతన కవిసమ్మేళనం ఏర్పాటు చేసినారు. ఒకరి తరువాత మరొక కవి తమతమ కవితలు వినిపించిన పిదప కాళోజీ వంతు వచ్చింది. అధ్యక్ష స్థానంలో ఉన్న రాయప్రోలువారే కాళోజీ పేరును ప్రకటించి వారు "కోకిల"

కవితను వినిపిస్తారని తెలిపినారు. అప్పుడు కాళోజీ లేచి అంతకుముందు రాత్రి రచించిన ఈ కవితను చదివినాడు--

లే మావి చివురులను లెస్సగా మేసేవు
రుతురాజు వచ్చెనని అతి సంభ్రమముతోడ
మావి కొమ్మలమీద మైమరచిపాడేవు
తిన్న తిండెవ్వారిదే కోకిలా !
పాడు పాటెవ్వారిదే కోకిలా !
ఊరుపేరూ లేని పిచ్చుకవు ! దయదలచి
చేరదీసి నిన్ను గారవము జేసినా
మావిగున్నలమాట మాటవరుసకునైన
ఎన్నడైనను తలచితే కోకిలా !
ఇంపైన 'కూకూ'ల సొంపైనరాగాల
నిండుగా నీ గొంతు నింపిన మామిళ్ల
మాటయే మరచి, మాలోని కొందరు చేరి
ప్రేమ పేరిట కాదటే కోకిలా !
పెత్తనము నిచ్చారహో కోకిలా !
ఏనాటి సుకృతమో ఏ విశ్వకవిచలవో
ఈనాడు నిన్నింతదానిగా చేసినది
లేకున్న నిన్నెవరు అడుగునే కోకిలా !
లేకున్న నీ వేడనుందువో కోకిలా !

ఈ గేయం చదివేసరికల్లా సభికులంతా చప్పట్లతో హర్షధ్వానాలు చేసినారు. కాళోజీ గురువైన గార్లపాటి రాఘవరెడ్డిగారు దీన్ని ఉత్తమ అన్యాపదేశకవితగా కొనియాడినారు. ఇందులోని భావం అటు రాయప్రోలుకూ ఇటు కోకిలకూ అన్వయిస్తాయని వేరే చెప్పనవసరంలేదు. తెలంగాణాలో ఉంటూ వాళ్ల సొమ్ము తింటూ తెలంగాణాప్రజలతో మమేకం కాకుండా తెలంగాణా కవిపండితులతో పరిచయాలు లేకుండా ఉంటున్న రాయప్రోలు ధోరణిని కోకిలపై మోపుతూ చెప్పడం ఈ కవితలో ఉన్న శ్లేష. దీనిలో ఎంతో ధ్వని కూడా ఉన్నది. ఇందులోని "విశ్వకవి" అన్న పదం విశ్వకవి రవీంద్రుని సిఫారసులేఖతో నిజాంప్రభుత్వంలో ఉద్యోగం సంపాదించుకున్నాడని



రాయప్రోలుపరంగానూ; విశ్వకవి అంటే సృష్టికర్త చలువవల్ల కమ్మని కంఠం కలిగి ఉన్నావని కోకిల పరంగానూ అన్వయించుకోవాలి. సాధారణంగా కాళోజీ ఎవరి గురించైనా కవిత రాస్తే దాన్ని ఆ వ్యక్తి ముందే చదువడం వారి అలవాటు. ఐతే దేవులపల్లి రామానుజరావుగారు మాత్రం తనకు గురుతుల్యుడైన రాయప్రోలు గురించి అట్లా రాసినందుకు కాళోజీని మెత్తగా మందలించినాడట. కాని ఆ పిదప రాయప్రోలు కాళోజీ ఎప్పుడు కనిపించినా మర్యాదగా పలుకరించేవాడట. రాయప్రోలువారు తెలంగాణా ప్రజలతో కలిసిపోలేదు. తెలంగాణా కవిపండితులతో ఆయన పరిచయాలేర్పరచుకోలేదు. తెలంగాణాలోని ఏ సాహిత్యసంస్థతోనూ అయనకు అనుబంధం లేదు. ఆయన సహవాసమంతా పెద్దపెద్ద నవాబులతోనే. బ్రిటిషాంధ్రలో ఉన్నప్పుడు మాత్రమే ఆయన తన దేశభక్తి కవితలు చదివి జాతీయవాదకవిగా కనిపించేవాడు. నిజాంరాష్ట్రంలో అడుగిడితేమాత్రం అటువంటివాటి జోలికే పోయేవాడు కాదు. ఆ దేశభక్తిపద్యాలూ చదివేవాడుకాదు. ఇక్కడి విషయాల్ని పట్టించుకునేవాడు కాదు. అట్లాగే సరోజినీనాయుడుగారు కూడ. ఈమె జాతీయవాదకవయిత్రి. కాంగ్రెసు పార్టీలోప్రముఖపాత్ర వహించింది. జాతీయోద్యమంలో ఈమె గాంధీగారితో కలిసి కాంగ్రెసు సభల్లో పాల్గొనేవారు. రాజకీయ ఉద్యమాలకు ఆధిపత్యం వహించేవారు. ఐనా ఆమె హైదరాబాదు రాష్ట్రంలో అడుగుపెడితేమాత్రం అదంతా మరచిపోయేవారు. ఇక్కడ సాగుతున్న ప్రజాఉద్యమాల గురించి పట్టించుకునేవారు కాదు. హైదరాబాదు నగరంలోని ఆమె స్వగృహం - "గోల్డెన్ థ్రెషోల్డ్ "లో కవితాగోష్ఠులతోనే కాలక్షేపం చేసేవారని కాళోజీ చెబుతుండేవారు. వీళ్ల జాతీయవాదం ఈ రకంగా ఉండేది.

ఈ సందర్భంలో కాళోజీ ఒక సంఘటనగూర్చి కూడ గుర్తుచేస్తుండేవాడు. రాయప్రోలువారు ఆంధ్రుల ఔన్నత్యం గూర్చి చెప్పిన సుప్రసిద్ధమైన పద్యం -

అమరావతీపట్టణమున బౌద్ధులు
విశ్వవిద్యాలయములు స్థాపించునాడు
ఓరుగల్లున వీరరాజలాంఛనముగా
పలు శస్త్రశాలలు నిలుపునాడు

ఇది ఎట్లాగో నిజాంప్రభుత్వ దృష్టికి వెళ్లిందట. రెండవ చరణంలోని "శస్త్రశాలలు" అన్న పదం ప్రభుత్వానికి ఆగ్రహం కలిగించిందట. ఇదేదో ప్రజల్ని రెచ్చగొట్టి సాయుధులుగా చేసేదిగా ఉన్నదని భావించి రాయప్రోలు వారికి ప్రభుత్వం ఘాటుగా నోటీసు పంపిందట. అప్పుడాయన ఉస్మానియా విశ్వవిద్యాలయం - తెలుగు శాఖలో ఆచార్యులుగానూ, అధిపతిగానూ ఉన్నారు. వారు గాభరాపడిపోయి అయ్యదేవరకాళేశ్వరరావుగారి నాశ్రయించినారట. కాళేశ్వరరావుగారికి నిజాంప్రభుత్వంలో మంచి పలుకుబడి ఉండేది. అయన "శస్త్రశాలలు" అన్న పదం అచ్చుపొరపాటువల్ల దొర్లిందనీ, అక్కడ నిజంగా "సత్రశాలలు" అనే పదం ఉండవలసిందనీ నిజాంప్రభువ రేణ్యులకు నచ్చజెప్పినారట. అంతటతో అధికారుల ఆగ్రహం చల్లారింది. ఆ కథ ముగిసింది.

కాళోజీ ఇటువంటిదే అడవి బాపిరాజుగారి గురించిన కథ ఒకటి వినిపించేవాడు. వరంగల్లులోని శబ్దానుశాసనఆంధ్రభాషానిలయంలో ఒకసారి జరిగిన వార్షికోత్సవాలకు అడవి బాపిరాజుగారిని ఆహ్వానించినారట. అప్పుడు కూడ దేవులపల్లి రామానుజరావుగారే దానికి కార్యదర్శిగా ఉండిరి. బాపిరాజుగారిని తీసుకరావడంకోసం కాళోజీ తమ గుర్రబ్బండిలో రైల్వేస్టేషన్‌కు వెళ్లి వారిని వెంటబెట్టుకొని నేరుగా తమ ఇంటికి వెళ్లినాడట. బాపిరాజుగా రప్పటికే హైదరాబాదునుండి వెలువడుతున్న తెలుగు "మీజాన్" పత్రికకు సంపాదకులుగా పనిచేస్తున్నారు. మహమ్మద్‌అబ్దుల్లా (కలకత్తావాలా) అనే ఒక ముస్లిం కోటీశ్వరుడు ఇంగ్లీషు, ఉర్దూ, తెలుగుభాషల్లో "మీజాన్" పత్రికను హైదరాబాదు నుంచి ప్రారంభించినాడు. ఆయా భాషల మీజాన్ పత్రికలకు వేరువేరు సంపాదకులుండేవాళ్లు. ఒకసారి నిజాంప్రభువు జన్మదిన వేడుకల సందర్భంలో అన్ని భాషల "మీజాన్" సంపాదకీయాల్లో మందుముల నర్సింగరావుగారి గురించి చెడుగా వ్యాఖ్యానించినారట. నరసింహారావుగారు తను నడుపుతున్న "రయ్యత్" పత్రికద్వారా నిజాంప్రభువ రేణ్యుల పరిపాలనగూర్చి అబద్ధాలు ప్రచారం చేస్తున్నాడనీ, నిజాని కిక్కడ హిందూ ముస్లింలు పాలలో చక్కెరవలె కలిసిమెలిసి సహజీవనం చేస్తున్నారనీ ఆ సంపాదకీయాల్లో వ్యాఖ్యానించినారట. ఈ అంశాన్ని దృష్టిలో పెట్టుకొని, రైల్వేస్టేషన్‌నుండివస్తూ మార్గమధ్యంలో కాళోజీ బాపిరాజుగారిని తెలుగు మీజాన్ పత్రికను నడపడంలో మీకేమైనా స్వేచ్ఛ ఉన్నదా అని ప్రశ్నించినాడట.



దానికి బాపిరాజుగారు తనకు పూర్తి స్వేచ్ఛ ఉన్నదనే సమాధాన మిచ్చినారట. దానిపై మళ్లీ కాళోజీ స్పందించి మీజాన్ పత్రికల్లో మందుములవారి గురించి అట్లా ఎందుకు రాసినారని ఎదురుప్రశ్న వేసేసరికి బాపిరాజుగారు ఖిన్నులైనారట. ఎందుకంటే బాపిరాజు కూడ జాతీయవాది. కాంగ్రెసులో చేరి సర్వమూ పోగొట్టుకున్నాడు. నవలారచయిత, కళాతపస్వి, అంతటివాడై ఉండికూడ బాపిరాజుగారు సంపాదకత్వం వహించిన తెలుగు "మీజాన్" లోనూ మందుములవారి గురించి చెడుగా రాయడం కాళోజీకి కోపకారణమైంది. బాపిరాజుగారు ఖిన్నవదనుడై ఏదో తనకు నెలకు రు. 150/- ఇస్తున్నారు. కనుక రెండు పూటలు భుజించగలుగుతున్నాననీ, లేకుంటే పస్తులుండవలసి వచ్చేదనీ, అదీకాక అదే పత్రిక ప్రెస్సులో తన నవలల్ని ఉచితంగా అచ్చువేసుకోవడానికి అనుమతించినారనీ బదులు పలికినారు. ఆయన దైన్యస్థితిని చూసి కాళోజీ ఇక ప్రశ్నించలేక పోయినాడు. పేదరికంవల్ల గత్యంతరంలేని పరిస్థితుల్లో ఆయన అట్లా పైఅధికారుల ఆజ్ఞానుసారం మెలిగినాడని కాళోజీ అర్థం చేసుకున్నాడు. అన్ని సంపదలూ కలిగిఉండి పై అధికారుల అడుగులకు మడుగులొత్తే దాస్యప్రవృత్తిని క్షమించకూడదు కానీ, ఆర్థిక దుస్థితివల్ల జీవితం దుర్భరంగా మారిన సందర్భంలో ఎవడైనా ఆత్మప్రబోధానికి భిన్నంగా ప్రవర్తించినా మన్నించవచ్చు నన్నది కాళోజీ అభిమతం.

మందుముల నరసింగరావుగారు హైదరాబాదు రాష్ట్రవిమోచనోద్యమంలో చురుగ్గా పాల్గొన్న దేశభక్తుడు. జాతీయవాది. కాంగ్రెసు పార్టీలో ఉండి ప్రజా ఉద్యమాల్ని నడిపినవాడు. ప్రజాసంక్షేమంకోసం పలు కార్యక్రమాల్ని నిర్వహించినవాడు. "రయ్యత్" అనే ఉర్దూ పత్రికను చిరకాలం నడిపి నిజాంప్రభుత్వ దురాగతాలను నిర్భయంగా విమర్శించినవాడు. అలాంటి వ్యక్తి గురించి తెలుగు మీజాన్ పత్రికలోకూడ చెడుగా రాయడం కాళోజీకి ఆగ్రహం కలిగించింది. హైదరాబాదురాష్ట్రవిమోచనానంతరం మందుముల నర్సింగరావుగారు ప్రజాప్రభుత్వంలో మంత్రిగా కూడ పనిచేసినారు. ఇంతకూ మందుములవారప్పుడు తన "రయ్యత్" పత్రికలో - హైదరాబాదు రాష్ట్రంలో రజాకార్ల దురాగతాలు మితిమీరిపోతున్నాయనీ, వాళ్ల మతోన్మాదానికి అడ్డుకట్టలేకుండా పోయిందనీ, వీళ్లను నిజాంప్రభువు అదుపు చేయలేకపోతే,

ఇటలీలో ముస్సోలినీ తన బ్లాక్‌షర్ట్స్ వలంటీర్లతో దాడిచేసి రాజును తరిమి కొట్టినట్లే, ఇక్కడ ఈ రజాకార్లు నిజాంను గద్దెదించి రాజ్యాన్ని హస్తగతం చేసుకుంటారనీ, ఈ రాష్ట్రంలో హిందువుల పరిస్థితి జర్మనీలో యూదుల దుస్థితివలె దయనీయంగా ఉన్నదనీ వరసగా కొన్ని వ్యాసాలు రాసినాడు. దానికి ప్రతిగా నిజాంరాజు జన్మదినవేడుకల సందర్భంలో "మీజాన్" ప్రత్యేక సంచికల సంపాదకీయాల్లో మందుములవారి వ్యాసాల్ని ఖండిస్తూ అదంతా దుష్ప్రచారమంటూ తీవ్రంగా రాసినారట. తెలుగు మీజాన్ పత్రికకు సంపాదకుడుగ ఉన్న బాపిరాజుగారైనా కనీసం తెలుగులో దాన్ని ప్రచురించకుండా ఉండవలసిందని కాళోజీ ఆశించినాడు. కాని బాపిరాజుగారి సమాధానంతో ఇక మారుపలుకలేక పోయినారు.

ఒకనాడు కాళోజీ ఇంటికి బలదేవ్‌పతంగే అనే ఆర్యసమాజ్ కార్యకర్త ఒకరు వచ్చినారు. వారిని కలువడానికి మరికొందరు ఆర్యసమాజ్ అభిమానులు కూడా వచ్చినారు. అప్పుడు వాళ్లంతా ముస్లింలుగా మారిన వాళ్లను శుద్ధ కార్యక్రమంద్వారా మళ్లీ హిందువులుగ మార్చడం గురించి మాట్లాడుతున్నారట. ఈ విషయం ఎట్లాగో పొక్కి "వఖ్త్" అనే ఉర్దూ పత్రికలో - "కాళోజీ సోదరులు రాజ్యాన్ని కూలగొట్టడానికి ఆర్యసమాజికులతో కలిసి పన్నాగం పన్నినారు" అనివార్త వచ్చిందట. ఆనాటి పరిస్థితులు అట్లా ఉండేవని కాళోజీ చెబుతుండేవాడు. చివరికి ఆంధ్రపత్రిక చదువడం కూడా నేరంగా ఉండేది.

## 8

గార్లపాటి రాఘవరెడ్డిగారు గొప్పకవి. పండితుడు. ఆయన వేణుగోపాలశతకం వంటి కొన్ని కావ్యాలు రచించినాడు. పాతిక సంవత్సరాల వయసున్నప్పుడే ఆయనకు భార్యావియోగం జరిగినందువల్ల తన ముగ్గురు పిల్లలతో వచ్చి హనుమకొండలోని సచ్చిదానంద ఆశ్రమంలో ఉండేవాడు. ఆశ్రమంవాళ్లే కాకుండా పట్టణంలోని పలువురాయన్ని గురువుగా సంభావించేవాళ్లు. కొందరాయన్ని రాగన్న అని పిలిచేవాళ్లు. ఆయన అజాతశత్రువు వంటివాడు. అందరితో సౌమ్యంగా మాట్లాడేవాడు. పాములపర్తి



నరసింహారావుగారూ (పి.వి), పాములపర్తి సదాశివరావుగారూ ఆయన్ని గురూజీ అంటుండేవాళ్లు. కాళోజీమాత్రం అయ్యగారు అని పిలిచేవాడు. వీరి ఆశ్రమం దాపునే దూపాటి వెంకటరమణాచార్యులుగారుండేవారు. రాఘవరెడ్డిగారు కాళోజీకి కవిత్వ మల్లడం నేర్పేవాడు. గణయతిప్రాసల గూర్చి తెలియజెప్పేవాడు. తాను చెప్పిన పద్ధతి ప్రకారం కాళోజీ కవితలు రచిస్తే ఆయన వాటిని సరిచేసేవాడు. అవసరమైనచోట మార్పులు చేర్పులు చేసేవాడు. ఒకసారి కాళోజీ, రెడ్డిగారూ కలిసి ఖమ్మం వెళ్లేటప్పుడు కాళోజీ తన కవితల నోటుబుక్కును ఎక్కడో పోగొట్టుకున్నాడు. ఐనా రెడ్డిగారు వాటిని మళ్లీ జ్ఞాపకం చేసుకొని తిరగరాసి శుద్ధప్రతిని తయారుచేసి ఇచ్చినాడు. కాళోజీ దస్తూరి బాగుండేది కాదు. రెడ్డిగారి దస్తూరి ముత్యాలవరుసవలె అందంగా ఉండేది. అందువల్ల కాళోజీ కవితల శుద్ధ ప్రతిని రెడ్డిగారే తయారుచేస్తుండేవారు. అందుకే కాళోజీ తమ గురుశిష్యుల సంబంధం గూర్చి ఒకచోట ఇట్లా చెప్పినాడు -

గురువు విరాగి రాగన్న
లఘువు రాగి కాళన్న
అక్షర జగత్తు సొంతం
గురులఘువుల సొత్తు

ఇది ఆ గురుశిష్యుల అనుబంధాన్ని తెలియజేస్తుంది. ఒకసారి ఆంధ్రమహాసభ స్థాయీసంఘ సమావేశం వరంగల్లులో జరిగినప్పుడు కాళోజీ దానికి "స్వాగతం" పలుకుతూ ఒక గేయం రచించినాడు. అందులోని కొన్ని పంక్తులు -

నిత్యమేమొ మనకీ దుర్దశయని భయము చెందువేళ
ఆంధ్రపితామహు లాంధ్రోద్యమము నంకురింపజేసె
అది ఆంధ్రమహాసభ పేర అందరికి అమరతరువాయె

ఇందులో మొదటి చరణములోని "భయము చెందువేళ" అన్నచోట రెడ్డిగారు "నెవ్వను కనువేళ" అంటూ యతికోసం మార్చినారట. ఈ గణయతి ప్రాసల గొడవ కాళోజీకి పట్టదు. కాళోజీ ఏదిరాసినా నిత్యవ్యవహారభాషలోనే రాసేవాడుతప్ప వ్యాకరణఛందోలంకారాలగూర్చి పట్టించుకునేవాడు కాదు. వాటిగూర్చిన అవగాహనకూడ ఆయనకు లేదు. తన సందేశాన్ని ప్రజలకు

తెలియజెప్పాలన్న తపనతప్ప తాను కవిగా పేరు గడించాలన్న ఉద్దేశం ఆయనకు లేదు. ప్రజలకు ప్రజలభాషలో సూటిగా చెప్పడమే ఆయన కవితాలక్షణం. తాను రాసింది ప్రజలకు నేరుగా చేరుతున్నదా లేదా అన్నదే తనకు ముఖ్యం కాని అది కవిత్వం కావాలని ఆయన కోరుకునేవాడు కాదు. కాళోజీ కవితల్లో శబ్దదోషాలు జరిగిన సందర్భాలుకూడ చాలాఉన్నాయి. ఉదాహరణకు ఆయన ఒకచోట 'నృతం' అనే పదాన్ని 'సత్యం' అనే అర్థంలో పొరపాటున వాడినాడు. అట్లాగే మరొకచోట 'తిమిరం' అనే పదానికి బదులు 'తిమి' అని కూడ తప్పుగ వాడినాడు. ఐతే మిత్రులు వాటిని సహృదయంతో ముందే తెలిపితే ఆయన సరిదిద్దుకునేవాడు. కాని కొందరు సాహితీ మిత్రులు కాళోజీ చదివి వినిపిస్తున్నప్పుడు తలూపి, అది ప్రచురింపబడినపిదప శబ్దదోషాలగూర్చి విమర్శిస్తేమాత్రం కాళోజీ నొచ్చుకునేవాడు. నిజమైన స్నేహితుడు దోషాలేమైనా ఉంటే సహృదయంతో వాటినిముందే తెలియజెప్పాలి. కాని అతనివెనకాల విమర్శించడం మంచిలక్షణం కాదనిచెబుతూ ఆయన ఒకచోట -

నచ్చజెప్పుటెకాని
రచ్చకీడ్చుటలేదు

అంటూ సహృదయుడైన మిత్రుడెట్లా ఉండాలో సూచించినాడు. ఒకవేళ గార్లపాటి రాఘవరెడ్డిగారే కనుక బ్రతికి ఉంటే తానీ పొరపాట్లు చేసి ఉండేవాడిని కాదంటూ కాళోజీ బాధపడుతుండేవాడు. గార్లపాటి రాఘవరెడ్డిగారి పాండిత్యాన్ని తెలిపే ఒక సంఘటన గూర్చి కాళోజీ గుర్తు చేస్తుండేవాడు. ఒకప్పుడు పిల్లా వెంకటరత్నంగారనే ఒక కవి విజయువాడనుంచి వచ్చి కాళోజీ ఇంట్లో దిగినాడట. ఆయన ఎప్పుడు వరంగల్లు వచ్చినా కాళోజీ ఇంట్లోనే దిగేవాడు. ఈయనే కాదు ఆంధ్రదేశంలో ఉన్న సుప్రసిద్ధ కవిపండితు లెందరు వరంగల్లు వచ్చినా కాళోజీ ఇంట్లోనే దిగేవాళ్లు. ఆ ఇల్లొక సాహిత్యనిలయంగా భాసిల్లెడిది. అందుకు కాళోజీ రామేశ్వరరావుగారి ఔదార్యమే కారణం. వారి ఇల్లాలి ఓర్పూ నేర్పూ దొడ్డది. పిల్లా వెంకటరత్నంగారు పువ్వాడ శేషగిరిరావుగారి శిష్యులు. శేషగిరిరావుగారు పింగళి లక్ష్మీకాంతంగారి శిష్యులు. లక్ష్మీకాంతంగారు చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారి శిష్యులు. ఇట్లా వెంకటరత్నంగారు గొప్ప శిష్యపరంపరకు చెందినవాడు. ఆయన ఒకనాడు కాళోజీ ఇంట్లో



తన "బోసుచరిత" కావ్యంలోని పద్యాలు కొన్ని వినిపిస్తున్నాడట. అక్కడే కూర్చుండి పద్యాలు వింటున్న రాఘవరెడ్డిగారు మధ్యలో ఆపి పద్యంలో యతి తప్పిందని చెప్పినాడు. వెంకటరత్నంగారు అందుకు అంగీకరంచక, ఇట్లా చెళ్లపిళ్లవారి ప్రయోగంకూడ ఉన్నదని ఆ పద్యాన్ని చూపించినాడు. ఎవ్వరెట్లావాడినా తప్పు తప్పేనంటూ మళ్లీ రెడ్డిగారు వాదించినారు. అప్పుడు వెంకటరత్నంగారు వెంటనే చెళ్లపిళ్లవారికి ఒక లేఖరాస్తూ యతి దోషాన్ని గూర్చి వివరించవలసిందని కోరినాడు. చెళ్లపిళ్లవారు దానికి సమాధానంరాస్తూ తన పద్యంలో యతిదోషం జరిగినమాట వాస్తవమేనంటూ ఒప్పుకున్నాడట. ఇక వెంకటరత్నంగారు మారుమాట్లాడలేక పోయినాడు.

ఇట్లా కాళోజీ రాఘవరెడ్డిగారి ప్రతిభాపాటవాల గూర్చి చెబుతుండేవాడు. ఐతే పిల్లా వెంకటరత్నంగారు కూడా తక్కువేమీకాదు. ఆయనకూడ గొప్పకవే. వారు కావ్యగానం చేస్తుంటే విని పాములపర్తి నరసింహారావుగారూ, పాములపర్తి సదాశివరావుగారూ, వానమామలై వరదాచార్యులుగారూ ఆయన రచన భారతంను పోలిఉన్నదని మెచ్చుకున్నారట. కాళోజీ ఇంట్లోనే ఒకసారి రాఘవరెడ్డిగారి పద్యాల్ని విన్న విశ్వనాథ సత్యనారాయణగారు మంచంలో నుంచి దిగ్గునలేచివచ్చి రెడ్డిగారిని ఆలింగనం చేసుకున్నారట. అంతేకాక వానమామలై వరదాచార్యులుగారి "మణిమాల" కావ్యానికి విశ్వనాథ వారు పీఠికరాస్తూ రాఘవరెడ్డిగారి కవితాశక్తి గూర్చీ, కాళోజీసోదరుల ఆతిథ్యంగూర్చీ కొనియాడినారట. అట్లాగే ఒకప్పుడు విశ్వనాథవారు చిలుకమర్తి రామానుజాచార్యులుగారి "కళ్యాణ రాఘవము"లోని పద్యాలు విని లేచివచ్చి ఆతని చేయిపట్టుకొని ఈ మహానుభావుడు రామాయణకల్పవృక్షం రాస్తే తన కావ్యాన్ని అవతలపారేసి ఉందునని ప్రశంసించినారట. ఐతే విశ్వనాథవారు వైయక్తికంగా కవుల్ని ప్రశంసించడం, వేదికలెక్కినప్పుడుమాత్రం వాళ్లను హేళన చేయడం వంటి ప్రవృత్తి వారిలో ఉండేదని కాళోజీ అంటుండేవాడు. దీనికి కాళోజీ ఒక ఉదాహరణకూడా చెప్పినాడు. విశ్వనాథ తన "ఆంధ్రప్రశస్తి"ని మల్లంపల్లి సోమశేఖరశర్మగారికి అంకితమిస్తూ -

డిగ్రీలులేని పాండిత్యంబు వన్నెకు
రాని పాడు కాలానబుట్టి

అంటూ శర్మగారిని కీర్తిస్తూ చక్కని పద్యం రాసినాడు. అదే విశ్వనాథ మళ్లీ తన "పులుల సత్యాగ్రహం" అనే నవలలో ఒక పాత్రను చిత్రిస్తూ ఆ పాత్రలో మల్లంపల్లివారు స్ఫురించేవిధంగా హేళనగా వర్ణించినారట. ఈ విషయంగూర్చి మొహమాటంలేకుండా కాళోజీ విశ్వనాథను నిలదీసి అట్లా ఎందుకు రాయవలసి వచ్చిందని అడిగినాడట. కాని విశ్వనాథ మాత్రం తనకా ఉద్దేశం లేదని ఖరాఖండిగ చెప్పినారట. ఐనా కాళోజీ వారి సమాధానంతో తృప్తిపడలేదు. ఇట్లా కాళోజీ ఏ విషయం గురించైనా ఎవరినైనా సరే నిర్భయంగ మొహమాటంలేకుండా ప్రశ్నించేవాడు. కాని కడుపులో కల్మషం పెంచుకునేవాడు కాదు. కనుకనే ఆయన నిక్కచ్చిగా మాట్లాడినా అందరూ ఆయన్ని ప్రేమిస్తుండేవారు, గౌరవిస్తుండేవారు.

వట్టికోట ఆళ్వారుస్వామిగారి గురించి కూడ కాళోజీ అనేక సందర్భాల్లో చెబుతుండేవాడు. ఆళ్వారుస్వామిగారు గొప్ప దేశభక్తుడు. సేవాతత్పరుడు. ఆయన ఆంధ్రమహాసభలోనూ, కమ్యూనిస్టుపార్టీలోనూ, చేరి చురుకుగా పనిచేసిన కార్యకర్త, చిత్త శుద్ధికలవాడు. కొంతమంది కమ్యూనిస్టుల్లా ఆయన వీరాభిమాని కాదు. పిడివాదం చేసేవాడుకాదు. నెమ్మదిగా ఆలోచించి ఎదుటివానికి నొప్పి కలుగకుండా మాట్లాడేవాడు. సౌజన్యమూర్తి. ఆయన మొదట్లో హోటల్ సర్వర్‌గాకూడ పనిచేసినాడు. చాలా కష్టపడి పైకివచ్చినాడు. ఆయన చదివిన బడిచదువు రెండోతరగతి వరకే. ఐనా స్వయంకృషితో తెలుగు ఉర్దూ ఇంగ్లీషు భాషల్లో మంచి ప్రావీణ్యం సంపాదించినాడు. 1938 ప్రాంతంలో దేశోద్ధారకగ్రంథమాలను స్థాపించి విజ్ఞానదాయకమైన పలు గ్రంథాల్ని ప్రచురించినాడు. సురవరం ప్రతాపరెడ్డిగారి "ప్రజలు - ప్రభుత్వం" "పౌరసత్వాలు" అనే పుస్తకాల్ని ఈ గ్రంథమాల తరపున ప్రచురించినాడు. ఊరూరు తిరిగి చందాదారులను చేర్పించి పుస్తకాల్ని ప్రచురించేవాడు. వాటిని మళ్లీ చందాదారులకు కడు శ్రద్ధతో పంపేవాడు. గ్రంథప్రచురణను ఒక ఉద్యమంగా నడిపించినాడు. అయన గోలకొండ పత్రికలోనూ పాత్రికేయునిగ పనిచేసినాడు. పలుసార్లు జైలుకు వెళ్లినాడు. ఒకసారి జైలునుంచి విడుదలై వచ్చినపిదప ఏం చేయాలని కాళోజీని అడిగితే ప్రజలకు విజ్ఞానదాయకమైన పుస్తకాల్ని ప్రచురించవలసిందిగా ఆయన సలహా ఇచ్చినాడట. ఈ మాటల్ని ఆళ్వారుస్వామిగారు పలుచోట్ల ఉటంకించినాడు. ఆళ్వారుస్వామిగారు ఏ ఉద్యమంలో ఎటువెళ్లినా తన భార్యనుకూడ వెంటతీసుకవెళ్లేవాడు.



నిజామాబాదులో 1937లో జరిగిన 6వ ఆంధ్రమహాసభలో కాళోజీకి ఆళ్వారుస్వామిగారితో మొట్టమొదటిసారిగా పరిచయమైంది. కాళోజీ 1930లో బ్రేల్స్‌ఫర్డ్ రాసిన "రెబెల్ ఇండియా"ను "నాభారతదేశ యాత్ర" పేరుతో అనువదించిన గ్రంథాన్ని ఆళ్వారుస్వామిగారు 1940లో అచ్చువేసినాడు. కాళోజీ 'నా గొడవ' మొదటి కవితాసంపుటినికూడ అచ్చువేసినాడు. ఆళ్వారుస్వామిగారు రచించిన "ప్రజలమనిషి", "గంగు" అనే నవలలు సుప్రసిద్ధములైనవి. "గంగు" నవలకు కాళోజీ పీఠిక రాసినాడు. ఇట్లా ఈ ఇద్దరి అనుబంధం దినదిన ప్రవర్ధమానమైంది. ఆళ్వారుస్వామిగారు చిన్నవయసులోనే 1961లో పరమపదించినాడు.

## 9

కాళోజీ "నా గొడవ" మొదటిభాగాన్ని వట్టికోట ఆళ్వారుస్వామిగారు తన దేశోద్ధారక గ్రంథమాల పక్షాన మొదటిసారిగా 1953లో ప్రచురించినాడు. అంతకుముందు ఇందులోని గేయాలు చాలావరకు సురవరం ప్రతాపరెడ్డిగారు తమ గోల్కొండపత్రికలో ప్రచురించినారు. అందుకే కాళోజీ సురవరం ప్రతాపరెడ్డిగారిని -

నాగొడవ ప్రకటింప నాంది యైనవాడు
అక్షరాల గోల్కొండ కట్టినవాడు

అంటూ ప్రశంసించినాడు. కొన్ని గేయాలు "తెలుగు స్వతంత్ర"లోనూ అచ్చైనాయి. అట్లా కాళోజీ కవితలు పత్రికలద్వారా బాగా ప్రచారం పొందినాయి. దాశరథిగారు వీటిని భాషాపరంగా కొంతవరకు సరిదిద్ది పత్రికలకు పంపేవాడు. లేదా సి.నారాయణరెడ్డిగారైనా పత్రికలకు పంపుతుండేవాడు. కాని కాళోజీ మాత్రం స్వయంగా ఏ పత్రికకూ పంపకపోయేవాడు. ఆయన దస్తూరికూడ బాగుండేది కాదు. "నా గొడవ" కవితాసంపుటిని 1953లో అలంపూర్‌లో జరిగిన ఆంధ్రసారస్వతపరిషత్తు వార్షికోత్సవాల్లో శ్రీశ్రీ ఆవిష్కరించినాడు. ఆయన దాన్ని ఆవిష్కరిస్తూ కాళోజీ ఫ్రెంచికవి లూయీ ఆర్గాన్ వంటివాడని ప్రశంసించినాడు. ఐతే "నా గొడవ" కావ్యావిష్కరణ అలంపూర్‌సభల్లో జరుగుతుందని ఏవో కారణాలవల్ల కార్యక్రమంలో

ప్రకటించలేదు. అందువల్ల కాళోజీ అలంపూర్‌కు వెళ్లలేదు. అంటే ఆయన పరోక్షంలోనే కావ్యావిష్కరణ జరిగిందన్నమాట. అలంపూర్‌లో జరిగిన ఆంధ్రసారస్వతపరిషత్తు వార్షికోత్సవాలకు సర్వేపల్లి రాధాకృష్ణ, విశ్వనాథ సత్యనారాయణ వంటి మహామహులంతా హాజరైనారు.

ఉద్యమాలులేని కాలంలో కాళోజీ తాండ్ర వెంకట్రామనర్సయ్యగారివద్ద జూనియర్ లాయర్ గా పనిచేసేవాడు. కాళోజీకి లాయర్ అన్న పేరే కాని ప్రాక్టీసు అంతగా ఉండకపోయేది. ఎందుకంటే ఆయన ముక్కుసూటిగా వెళ్లేవాడేకాని మెలికలు వేయడం చేతకానివాడు. కల్లబొల్లి మాటలు మాట్లాడలేడు. తిమ్మిని బమ్మి బమ్మిని తిమ్మి చేయలేడు. అందుకే తరువాత కాలంలో ఆయన ప్రాక్టీసును మానుకున్నాడు. ఒకసారి కాళోజీ 1943 ప్రాంతంలో వెంకట్రామనర్సయ్యగారివద్ద జూనియర్‌గా పనిచేస్తున్న కాలంలో కాంగ్రెసు పార్టీకి సంబంధించిన కరపత్రాలు కొన్ని పంచిపెట్టినందుల కాయనకు రెండు సంవత్సరాల జైలుశిక్ష, రెండువేల రూపాయల జరిమానా విధించినారు. జరిమానా కట్టనందుకు కాళోజీ ఇంటిలోని బల్లలు కుర్చీలు వగైరా సామానునంతా జప్తుచేసి వేలంవేయడం కోసం కోర్టులో ఉంచినారు. అప్పుడు కొందరు పురప్రముఖులు కాళోజీ రామేశ్వరరావుగారివద్దకు వెళ్లి జప్తుచేసిన సామానంతా నారాయణరావుది కాదనీ, తన సొంత సామాననీ కోర్టులో దరఖాస్తు పెట్టవలసిందిగా సలహా ఇచ్చినారట. కాని రామేశ్వరరావుగారకి ఆ సలహా నచ్చలేదు. చిన్ననాటి నుంచి పెంచిపోషించిన నారాయణరావుకు ఆస్తిలో హక్కులేదనడం రామేశ్వరరావుగారికి బాధాకరమనిపించింది. తమ్మునిమీద ఆయనకంతటి ప్రేమ. ఐనా కొందరు మిత్రులు బలవంతపెట్టి రామేశ్వరరావుగారి చేత ఆ విధంగా రాయించుకొని కోర్టులో దాఖలుచేసినారట. అప్పుడా సామానునంతా తిరిగి రామేశ్వరరావుగారి కప్పగించినారు. ఐతే నారాయణరావుగారికి ఆస్తిలో హక్కులేదని కోర్టులో ప్రకటించినందులకు రామేశ్వరరావుగారు మూడురోజులు అన్నం ముట్టలేదట. కాళోజీ జైలుశిక్షను మాత్రం అనుభవించినాడు.

స్థానిక రాజరాజనరేంద్రఆంధ్రభాషానిలయంలో ఆంజనేయులు అనే విద్యార్థి గ్రంథపాలకుడుగా పనిచేస్తుండేవాడు. ఒకసారి ఆయనకు పోస్టులో ఒక ఉత్తరం వచ్చింది. అడ్రసుమాత్రం ఆంజనేయులుదే కాని రావి నారాయణరెడ్డిగారు కాళోజికి రాసిన ఉత్తరమది. ఇదెట్లాగో పోలీసులకు



తెలిసింది. వాళ్లు ఆంజనేయులునుండి ఆ లేఖను స్వాధీనపరచుకొని తెరచిచూస్తే అది రావినారాయణరెడ్డిగారు కాళోజీకి రాసిన ఉత్తరమని తెలిసింది. వెంటనే ఆంజనేయులునూ, కాళోజీని అరెస్టుచేసి పోలీసులు లాకప్‌లో పెట్టినారు. ఒకరోజంతా ఆయన అందులోనే ఉన్నాడు. అదే లాకప్‌లో ఒక కరడుగట్టిన నేరస్థున్నికూడా వేసినారు. అతడు చుట్టతాగుతూ ప్రక్కనే ఉమ్మివేయడం వంటి పనులు చేస్తుంటే కాళోజీ అసహ్యించుకున్నాడు. అంతేకాక ఆతడు కాళోజీ నుద్దేశించి ఎక్కడైనా దొంగతనం చేసినావా లేక ఎవరినైనా చంపినావా లేక ఏ ఆడదాన్నైనా లేపుకొని వచ్చినావా వంటి ప్రశ్నలు వేయనారంభించినాడట. దానితో కాళోజీకి మరీ చీకాకు కలిగింది. ఇది గమనించి ఆ నేరస్థుడు గాంధీమహరాజ్‌కూ హుజూర్ నైజాంకు లడాయి అవుతున్నదట, అందులో కనుక నీవిక్కడికి రాలేదుకదా అంటూ మళ్లీ ప్రశ్నలడగడం ప్రారంభించినాడట. ఈ ప్రశ్నవేయగానే కాళోజీ నివ్వెరపోయినాడట. చదువు సంధ్యలులేని కరడుగట్టన ఒక నేరస్థుడికి కొంతలోకొంతైనా గాంధీగారి పోరాటం గూర్చిన అవగాహన ఉన్నందుకు సంభ్రమాశ్చర్యాలు కలిగి, కన్నీళ్లతో వెళ్లి ఆతన్ని కౌగిలించుకున్నాడట. ఈ ప్రశ్న తనకు గర్వభంగం కలిగించిన సంఘటనల్లో మొదటిదని కాళోజీ భావిస్తుండేవాడు. ఎందుకంటే చదువూసంధ్యలు లేని వట్టి పామరులు అజ్ఞానులనీ తావే విజ్ఞానవంతులమనీ విద్యావంతులూ మేథావులూ భావిస్తుంటారు. గాంధీగారు నిర్వహిస్తున్న స్వాతంత్ర్యసంగ్రామం గూర్చిన పరిజ్ఞానం స్థూలంగానైనా ఆ నేరస్థుడు కలిగిఉండడం కాళోజీకి ఆశ్చర్యం కలిగించింది. అంతేకాక సర్వమానవసమానత్వాన్ని బోధించి, దీన జనోద్ధరణకోసం పాటుపడిన గాంధీగారి బోధనల్ని, గాంధీవాదులమని చెప్పుకుంటున్న తనలాంటివాళ్లు నిత్యజీవితంలో పాటించకపోవడాన్ని గమనించి కాళోజీ ఒకింత సిగ్గుపడినాడు. తనతోపాటు లాకప్‌లో ఉన్న తోటిమానవున్ని చూసి సానుభూతి ప్రకటించకుండా అసహ్యించుకున్నందులకు కాళోజీ బాధపడినాడు. ఈ సంఘటన నొక గుణపాఠంగా కాళోజీ భావించినాడు.

మరునాడు పోలీసులు కాళోజీని కోర్టులో హాజరుపరచినారు. కాళోజీ బెయిల్ కోసం దరఖాస్తుపెట్ట నిరాకరించినందువల్ల విచారణజరిపేవరకు ఆయన్ను జైలుకు పంపంచినారు. కాళోజీని మామూలు జైలుగదిలో కాకుండా డబుల్‌గంజ్‌లో వేసినారు. గంజ్ అంటే సెల్లార్ అన్నమాట. అందులో

కాళోజీ యమయాతన లనుభవించినాడు. కాలకృత్యాలూ, భోజనం చేయడం, పడుకోవడం వంటి పనులన్నీ ఒక్క చిన్నగదిలోనే చేయాలి. అదొక నరకకూపం లాంటిది. అదే జైలులో శిక్ష అనుభవిస్తున్న మంగళ్‌సింగ్ అనే ఒక తీవ్రవాదికూడ ఉండేవాడు. ఈతడు స్వాతంత్ర్యోద్యమంలో తీవ్రవాద కార్యకలాపాల్లో పాల్గొన్నందున జైలులో కఠినశిక్ష అనుభవిస్తున్నాడు. ఈతనితోపాటు మరికొందరు సర్దారులుకూడా ఇలాంటి శిక్షలే వేరువేరు జైళ్లలో అనుభవిస్తున్నారు. గాంధిగారు చేపట్టన సత్యాగ్రహాలూ, సహాయ నిరాకరణలవంటి ఉద్యమాలతో స్వాతంత్ర్యంరాదని భావించిన కొందరు యువకులానాడు తీవ్రవాదకార్యకలాపాలవైపు మొగ్గినారు. అట్లాంటి మంగళ్‌సింగ్, ఈ సెల్లార్‌లో కాళోజీ ఎట్లా మనగలుగుతాడోనని జాలిగొని, రహస్యంగా ఉదయాన్నే ఏదో సందులో నుంచి వేడివేడి రొట్టెల్ని కాళోజీ ఉంటున్న సెల్లార్‌లో పడవేసేవాడట. ఈ సంఘటన కాళోజీలో కొన్ని ప్రశ్నల్ని రేకెత్తించింది. స్వాతంత్ర్యోద్యమంలో ఇలాంటి తీవ్రవాదుల్ని గాంధీగారి అహింసావాదులు పట్టించుకునేవాళ్లు కాదు. వాళ్లను దూరంగా ఉంచేవాళ్లు. వాళ్లెలాంటి కఠినశిక్షలనుభవిస్తున్నా సానుభూతికూడ చూపించేవాళ్లుకాదు. ఐతే తీవ్రవాదియైన ఈ మంగళ్‌సింగ్ మాత్రం అందుకు భిన్నంగా అహింసావాదియైన కాళోజీని కష్టసమయంలో మానవతాస్ఫూర్తితో ఆదుకున్నాడు. అప్పుడు గాంధేయవాదియైన కాళోజీ ఆనాటి ఉద్యమనాయకుల భిన్నప్రవృత్తుల గురించీ, మానవమనస్తత్వంగురించీ విశ్లేషించి ఆత్మవిమర్శన చేసుకున్నాడు. ఆయన కిదొక గుణపాఠమైంది. ఈ సంఘటనగురించి చెబుతూ కాళోజీ కన్నీళ్లు కార్చేవాడు.

ఐతే మూడునాలుగు రోజుల పిదప కాళోజీనీ, ఆంజనేయుల్ని పోలీసులు కోర్టులో హాజరుపరచినారు. పబ్లిక్‌ప్రాసిక్యూటర్ వీళ్లపై నేరంమోపుతూ న్యాయమూర్తి ముందు చాలాసేపు వాదించినాడు. ఆంజనేయులుపై పెట్టినకేసు చిన్నది. కాళోజీపై పెట్టిన కేసు పెద్దది. దాని ప్రకారం నాలుగైదుసంవత్సరాలు కఠినశిక్ష పడవచ్చు. కాళోజీ కాంగ్రెసు పార్టీ కార్యకలాపాల్ని చురుగ్గా నిర్వహిస్తుంటాడనీ, సత్యాగ్రహాలు చేయిస్తుంటాడనీ అదే వరుసలో ఈ ఉత్తర మాతనికి వచ్చిందనీ, కాంగ్రెసుపార్టీ చేపట్టే కార్యక్రమాలన్నింటికీ కాళోజీనే బాధ్యున్నిచేసి న్యాయమూర్తిముందు పబ్లిక్‌ప్రాసిక్యూటర్ వాదించినాడు. ఈ వాదనలన్ని విన్నపిదప న్యాయమూర్తి



ఉత్తరం రాసినవాడిపై నేరంమోపాలి కాని వీళ్లపై ఎట్లా నేరంమోపుతారని పబ్లిక్‌ప్రాసిక్యూటర్‌ను ప్రశ్నించినాడు. అంతేకాక ఇలాంటి ఉత్తరమే ఎవరైనా తనకుగానీ, నిజాంప్రభువుకుగానీ రాస్తే తనపైగానీ, నిజాంప్రభువుపైగానీ నేరంమోపి కేసుపెడుతారా అంటూ కూడ న్యాయమూర్తి పబ్లిక్‌ప్రాజిక్యూటర్‌పై ఎదురుప్రశ్న వేసినాడు. ఈ ప్రశ్నలకు పోలీసువాళ్ల తరపున సమాధానాలు రాలేదు. అప్పుడా న్యాయమూర్తి ఆ కేసును కొట్టివేస్తూ అంజనేయులునూ కాళోజీని విడుదల చేసినాడు. ఇక్కడ మరో విచిత్రమేమిటంటే ఆ న్యాయమూర్తి ఒక ముస్లింవాడు కావడం గమనార్హం. ఆ రోజుల్లో ఇలాంటి సజ్జనులుకూడ ముస్లింలలో ఉండేవాళ్లు. కొందరు ముస్లిం ప్రభుత్వోద్యోగులు నిష్పక్షపాతంగా వ్యవహరించేవాళ్లు. న్యాయాన్ని సమర్థించేవాళ్లు.

## 10

కాళోజీ రెండవసారి 1942 ప్రాంతంలో జైలుకు వెళ్లినప్పుడు ఆయనకు కొన్ని అనుభవాలు కలిగినాయి. ఈసారి సుమారు 60 మంది పట్టే పెద్ద బారక్‌లో ఒక్క కాళోజీని మాత్రమే వేసినారు. ఇది చాలాపెద్ద హాలు వంటిది. వరంగల్లు జైలుసూపర్నెంట్ ఖమ్రుద్దీన్‌ఖాన్ చాలా ఉత్తముడు. ఆయనకు హిందూముస్లిం భేదభావాలుండేవి కావు. తనకన్న చిన్న ఉద్యోగులతోనూ చాలా సౌమ్యంగా ఉండేవాడు. జైలులో నిష్పక్షపాతంగా వ్యవహరించేవాడు. ఈయనకు కాళోజీ ఆరోగ్యపరిస్థితి గురించి అంతా తెలుసు. కనుకనే ఆయనపై ఉన్న సానుభూతితో గాలీవెలుతురు చక్కగా వచ్చే బారక్‌లో వేసినాడు. కాళోజీ 1935 ప్రాంతంలో క్షయవ్యాధికి గురై ఒక ఊపిరితిత్తిని కోల్పోయినాడు. ఒకే ఊపిరితిత్తితో ఆయన జీవితాంతం గడిపినాడు. ఆయనది చాలా దుర్బలమైన శరీరం. ఎండను భరించలేడు. ఐతే ఈ బారక్‌లో తోడుగా ఇతర ఖైదీలెవ్వరూ లేనందున ఆయనకెటూ తోచకుండా ఉండేది. ఒంటరిగానే కాలం గడుపాలి. ఆయనకెప్పుడూ స్నేహితులతో మాట్లాడుతుండడం అలవాటు. ఇక్కడ ఏకాంతంగా కాలం గడుపడం కాళోజీకి దుర్భరంగా ఉండేది. అందువల్ల ఆయన తనముందు కొంత ఇసుక నెరిపి అందులో పుల్లలతో రాయడం, అక్కడున్న పెద్ద నిమ్మచెట్టు

కింద కూర్చోని ఏవేవో ఆలోచించడం, నడుస్తూ తనలో తానే ఏదేదో గొణగడం వంటి పనులు చేసేవాడు. జిల్లా అధికారులు డాక్టరుతోసహా నేరుగా కాళోజీ ఉన్న చోటికి వెళ్లి పరీక్షలు నిర్వహించేవాళ్లు. ఐనా ఆయన ఆరోగ్యం అంతంత మాత్రంగానే ఉండింది. ఒకసారి తన అన్నగారైన రామేశ్వరరావుగారు కాళోజీని చూడడానికి జైలుకువచ్చి ఆయన ఆరోగ్యపరిస్థితిని చూసి చాలా బాధపడినాడు. పిదప వారు జిల్లాఅధికారులతో ఏమి మాట్లాడినారో కాని కాళోజీని వరంగల్లు జైలునుండి హైదరాబాదు చంచల్‌గూడ జైలుకు మార్చినారు. అక్కడ పరిస్థితి మరీ అధ్వాన్నంగా ఉండింది. గదుల్లో ఖైదీలను రెండింతలుగా కుక్కినారు. చుట్టూ అనారోగ్యంతో బాధపడుతున్న మరికొందరు ఖైదీలనుంచినారు. వాళ్లు దగ్గడం, తుమ్మడం, ఉమ్మివేయడం, వాంతులుచేయడం వంటివి చేస్తుండిరి. పరిసరాలన్నీ అపరిశుభ్రంగా ఉండి దుర్వాసన వస్తుండేది. డాక్టర్లు అప్పుడప్పుడువచ్చి కాళోజీని పరీక్షించి వెళ్లేవాళ్లు. ఐతే ఇక్కడ కరంసింగ్ అనే ఒక ఖైదీ కాళోజీకి మంచి స్నేహితుడైనాడు. కరంసింగ్ గతంలో కాళోజీకి సహకరించిన మంగళ్‌సింగ్‌కు అనుచరుడు. వీళ్లు తీవ్రవాదకార్యకలాపాల్లో పాల్గొనినందున కఠినశిక్షలనుభవిస్తున్నారు. కరంసింగ్ మంగళ్‌సింగ్ మాదిరిగానే కాళోజీకి సహకరిస్తుండేవాడు. కొద్దిరోజుల పిదప కాళోజీని చెంచల్‌గూడ జైలునుంచి ఉస్మానియా ఆసుపత్రికి మార్చినారు. ఇక్కడ కూడ డాక్టర్లు వచ్చి మామూలుగా కాళోజీని పరీక్షించి వెళ్లేవాళ్లు. ఇక్కడున్నంతకాలం చాలామంది మిత్రులువచ్చి కాళోజీని చూసివెళ్లేవాళ్లు. వాళ్లలో లక్ష్మణరావు బగాడే అనేవాడు కాళోజీకి చిన్ననాటి మిత్రుడు. ఈయన తరచుగా వచ్చి చూసి వెళ్లేవాడు. మళ్లీ కొన్నాళ్లకు కాళోజీని చంచల్‌గూడ జైలు ఆసుపత్రికి మార్చినారు. అక్కడ జైలు సూపరెన్టెంట్‌గా ఖాన్‌బహాదూర్ అనేవాడుండేవాడు. ఈతడొక కర్కోటకుడు. ఖైదీలను నానాహింసలు పెట్టేవాడు. ఈతడు గతంలో ఉత్తరప్రదేశ్‌లోన ఒకజైలుకు సూపరెన్టెంట్‌గా ఉన్నప్పుడు, అక్కడ ఖైదిగా ఉన్న జవహర్లాల్‌నెహ్రూవంటి ఉద్దండనాయకులనుసైతం హడలగొట్టించానని తనకుతాను చెప్పుకునేవాడు. ఆతడు జైలును తనిఖీ చేయడానికి బయలుదేరితే ఛత్రచామరాలతో పరిచారకులను వెంటబెట్టుకొని రాజుగారు వెళ్లినట్లుండేది. స్వామిరామానందతీర్థ, కాశీనాథరావువైద్య, డా॥ మేల్కోటే వంటి నాయకులతోనూ కఠినమైన పనులు చేయించేవాడట. మండుటెండల్లో



వాళ్లతో బండలు పగులకొట్టించేవాడట. నేరస్థులకు తొడిగే మొండిలాగులు, మొండిచొక్కాలను వీళ్లతో తొడిగించేవాడట. శిక్షపడిన ఖైదీలకు మెడకొక బిల్లను తగిలించేవాళ్లు. ఏ కారణంచేతనైనా ఖైదీలు ఆ బిల్లను వేసుకోకపోతే ఈ ఖాన్‌బహదూర్ వాళ్లను చితకబాదేవాడట.

ఆ కాలంలో యావజ్జీవశిక్ష పడినవాళ్లను జైలుసిబ్బందిగా మార్చి వాళ్లతో పనులు చేయించుకునే పద్ధతొకటుండింది. ఐతే రెండవ ప్రపంచయుద్ధకాలంలో ఆంగ్లేయులొక పథకం రూపొందించినారు. జీవిత ఖైదీల్లోంచి యువకుల్ని ఎంపికచేసి, వాళ్లకు శిక్షణఇచ్చి యుద్ధానికి పంపేవాళ్లట. చెంచల్‌గూడ జైలునుంచికూడ కొందరిని ఎంపికచేసి పంపవలసిందిగా ప్రభుత్వంనుండి ఖాన్‌బహదూర్ కొకలేఖ వచ్చింది. ఈ ఖాన్‌బహదూర్ పెట్టే హింసలను భరించలేక చాలామంది ఖైదీలు యుద్ధానికి వెళ్లడానికి సిద్ధమైనారు. ఇది తనను అప్రతిష్ఠ పాల్జేస్తుందని గ్రహించిన ఖాన్‌బహదూర్ దానికి ప్రత్యామ్నాయంగా మరొక పథకం సిద్ధం చేసినాడు. యుద్ధానికి సిద్ధమైన ఖైదీలతో యుద్ధసైనికులకు కావలసిన యూనిఫాం దుస్తుల్ని కుట్టించిపెడుతానని ప్రభుత్వంతో ఒప్పందం కుదుర్చుకున్నాడు. అట్లా తన అధీనంలోఉన్న ఖైదీలు బయటికి వెళ్లకుండా చాకచక్యంగా వాళ్లను బంధించుకున్నాడు. ఇటువంటి చండశాసనుడివల్ల కాళోజీ ఆరోగ్యం మరింత క్షీణింపసాగింది. ఒక సందర్భంలో కాళోజికి పరిచయమున్న ఒక డాక్టరువచ్చి కాళోజీని పరామర్శించిన విషయం ఖాన్‌బహదూర్‌కు తెలిసి కాళోజీని రేకులషెడ్డులోనికి మార్పించినాడు. అసలే ఒకే ఊపిరితిత్తితో బ్రతుకుతున్నవాడు, ఇట్లాంటి కఠినశిక్షలను ఆయన భరించలేకపోయినాడు. ఈ సందర్భంలో కొందరు కాంగ్రెసుపార్టీ పెద్దలూ, మిత్రులూకలిసి కాళోజీని కొన్ని షరతులతోనైనా వదిలిపెట్టించేందుకు ప్రయత్నం చేసినారట. అందుకు ప్రభుత్వం అంగీకరిస్తూ, ఇకముందెన్నడూ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాగే ఎలాంటి కార్యకలాపాల్లో పాల్గొనబోనని కాళోజీ రాసివ్వాలని షరతు విధించిందట. దాని ప్రకారం ఖాన్‌బహదూర్ కాళోజీని తన కార్యాలయానికి పిలిపించుకొని ప్రభుత్వం ఆదేశించిన ప్రకారం సంతకం పెట్టి జైలునుంచి విడుదలై వెళ్ళవచ్చునని చెప్పినాడు. అక్కడ కాళోజీ అన్నగారైన రామేశ్వరరావుగారున్నూ ఉండిరట. కాని కాళోజీ అందుకు ససేమిరా అంగీకరించలేదు. అప్పటికే కాళోజీకి విధించిన రెండున్నరసంవత్సరాల

శిక్షలో ఆరుమాసాలు గడిచిపోయినాయి. మిగతా రెండుసంవత్సరాలు జైలులోనే ఉంటే కాళోజీ బ్రతుకడం కష్టమని ఆత్మీయులంతా భావించినారు. ఐతే ప్రభుత్వం విధించిన షరతుకు ప్రత్యామ్నాయంగా కాళోజీ మరొక ప్రతిపాదన ముందుంచినాడు. ఎల్లకాలమూ కాదుకానీ, జైల్లో ఉండవలసిన ఈ రెండుసంవత్సరాల కాలంవరకు మాత్రం జైలునుంచి బయటికివెళ్లిన పిదప ఎలాంటి ప్రభుత్వవ్యతిరేక కార్యకలాపాల్లో పాల్గొనబోననిమాత్రం రాసివ్వడానికి సిద్ధమంటూ ఖాన్‌బహదూర్‌కు తెలిపి ఆయన తన బారక్‌లోకి వెళ్లిపోయనాడు. ఇది విన్న ఖాన్‌బహదూర్ ఈయన ప్రభుత్వానికే షరతు విధిస్తున్నాడే అంటూ విస్తుపోయినాడట. కాళోజీ ఇట్లా ఎందుకంగీకరించినాడంటే ఈ జైల్లో ఉండి ఈ రెండేండ్లు ఎటూ ప్రజాఉద్యమాల్లో పాల్గొనలేడు. ఆరోగ్యం మరీ క్షీణిస్తుంది. విడుదలై బయటకివెళ్లితే ఈ రెండేండ్లకాలంలో మందులువాడుతూ విశ్రాంతి తీసుకొని ఆరోగ్యం బాగుపరచుకోవచ్చు. ఈ రెండేండ్లు ఎక్కడున్నా ప్రజాఉద్యమాల్లో పాల్గొనలేడు. ఈ ప్రతిపాదనను ఖాన్‌బహదూర్ ప్రభుత్వానికి పంపినాడు. ఈ సంఘటన జరిగిన పిదప కొందరు కాళోజీ సంతకం పెట్టనందుకు మెచ్చుకున్నారు. మరికొందరేమో సంతకం పెడితే విడుదలై ఆరోగ్యం కాపాడుకొని ఉండేవాడుకదా అంటూ విచారం వ్యక్తం చేసినారట. ఆయతే ఇది జరిగిన కొద్దిరోజులకే మళ్లీ ఖాన్‌బహదూర్ కాళోజీని పిలిపించుకొని తాను కోరినట్లుగానే ప్రభుత్వం అంగీకరించిందని తెలిపినాడు. దానిపై కాళోజీ వాళ్లిచ్చిన కాగితంపై సంతకం పెట్టి విడుదలై వచ్చినాడు. ఇది తెలిసికున్న గోరే అనే తోటిఖైది తింటున్న అన్నం అవతలపారేసి మహారాష్ట్రుడవైఉండి కూడ ఎంత ఘోరమైన పని చేసినావంటూ కాళోజీని నిందించినాడట. ఈ గోరే కూడ మహారాష్ట్రుడే. కాళోజీకి మరాఠీ బాగా వచ్చుకనుక ఈ గోరే ఆయన్ని కూడ మహరాష్ట్రుడే అనుకున్నాడు. ఐతే ఈ సందర్భంలో కాళోజీ చెప్పేతర్కం వేరే విధంగా ఉన్నది. ఈ రెండు సంవత్సరాలు జైల్లోగడిపినా ఆయన ప్రజా ఉద్యమాల్లో ఎటూ పాల్గొనలేడు. ఇవతలకివస్తే ఈ రెండుసంవత్సరాల కాలాన్ని తన ఆరోగ్యం మెరుగుపరచుకోవడానికి ఉపయోగించుకోవచ్చునన్నది కాళోజీవాదం.

ఇట్లా విడుదలైన పిదప ఇంటకివచ్చి కాళోజీ వకాలతు చేయాలని భావించినాడు. కాని ఇక్కడ మళ్లీ చట్టం అడ్డు తగిలింది. శిక్ష అనుభవిస్తున్నవాడు వకాలతు చేయడానికి చట్టం ఒప్పుకోదు. పైగా వకాలతు చేయకుండా



ఉండడానికి తన పట్టానెందుకు రద్దుచేయకూడదో తెలుపవలసిందంటూ ప్రభుత్వంనుండి కాళోజీకి సంజాయిషీ నోటీసుకూడ వచ్చింది. దాని గురించి ఏమి చేయాలో తోచక కాళోజీ హైదరాబాదుకు వెళ్లి కాశీనాథరావువైద్య, మందుముల రామచంద్రరావు, నందగిరివెంకటరావువంటి సీనియర్ వకీళ్ల సలహా కోరినాడు. వకాలతు చేయకుండా ఉంటే ప్రభుత్వానికేమీ అభ్యంతరం లేదు. కానీ వకాలతు చేయదలచుకుంటే మాత్రం ప్రభుత్వానికి క్షమాపణ రాసివ్వవలసిందే నంటూ వాళ్లు సలహా ఇచ్చినారు. దానిమీద కాళోజీ ప్రభుత్వానికి అట్లాగే క్షమాపణ తెలిపి మళ్లీ వకాలతు చేయనారంభించినాడు. వద్దిరాజు రాజేశ్వరరావుగారనే సీనియర్ వకీలు ఇంట్లోనే ఒక సంవత్సరముండి వకాలతు చేసినాడు. ఆ పిదప ఒక అద్దె ఇంట్లో ఉంటూ తన వకాలతును కొనసాగించినాడు.

కాళోజీ జైల్లో ఉన్నప్పుడు మరొక సంఘటన జరిగింది. కాళోజీని వరంగల్లు జైలునుండి గుల్బర్గా జైలుకు మార్చినారు. వెంట ఇద్దరు పోలీసు కానిస్టేబుళ్లు ఉండి కాళోజీని రైలుబండిలో తీసుకవెళ్లినారు. ఆయన్ని ఒక పెట్టెలో ఎక్కించి పోలీసులు మరో పెట్టెలో ఎక్కినారు. ఈ అదను కనిపెట్టి కాళోజీ పారిపోయే అవకాశముండెను. కాని ఆయన తనపై విశ్వాసముంచిన పోలీసులను మోసం చేయతలచుకోలదు. కనుక కాళోజీ పారిపోలేదు. ఆ తరువాత కాళోజీని గుల్బర్గాకు తీసుకవెళ్లేసరికి రాత్రైంది. రాత్రివేళలో ఖైదీలను స్వీకరించడానికి జైలుఅధికారులు అంగీకరించరు. అందువల్ల కాళోజీని ఒక పోలీసుస్టేషన్‌కు తీసుకవెళ్లి అందులో పడుకోబెట్టి, వాళ్లూ మరొకపక్క పడుకున్నారు. తెల్లవారి పోలీసులు కాళోజీ నక్కడే వదిలి, తాము కాలకృత్యములు తీర్చుకోవడాని కెక్కడికో వెళ్లి వచ్చినారు. ఈ సందర్భంలో కూడా కాళోజీ పారిపోయే అవకాశముండెను. కాని ఆయన అట్లా చేయలేదు. అట్లా చేసిఉంటే పోలీసుల ఉద్యోగాలూడి ఉండేవి. ఇది కాళోజీ చిత్తశుద్ధికీ నిజాయితీకి నిదర్శనం. ఈ సందర్భంలో పోలీసులు కాళోజీ వంటి ఒక ఖైదీని విశ్వసించడాన్ని కూడా మనం హర్షించవచ్చు.

కాళోజీకి జైలులో మరొక అనుభవం కూడా జరిగింది. ఒకనాడు ఏదో సందర్భంలో జైలు సిబ్బంది ఒక ఖైదీని సెల్‌లో వేసి హింసించినారట. అప్పుడు జైలులోని ఖైదీలంతా దీన్ని నిరసిస్తూ ఒక్కుమ్మడిగా భారతమాతకీ జై, వందేమాతరం అంటూ జైలు అధికారులకు వ్యతిరేకంగా

నినాదాలివ్వసాగినారట. అప్పుడు డ్యూటీలో ఉన్న సెంట్రీలు తుపాకులెక్కు పెట్టినారట. సుమారు 1600 ఉన్న ఖైదీలంతా ఒక్కసారే నినాదాలిస్తుండడంతో సెంట్రీలుకూడ గాభరా పడినారట. కొద్దిసేపు పెద్ద అల్లరే జరిగింది. అప్పటిదాకా ఊరుకున్న కాళోజీ లేచివచ్చి తుపాకి నెక్కుపెట్టి ఉన్న ఒక సెంట్రీ ముందుకు వెళ్లి ధైర్యంగా తానూ నినాదాలివ్వసాగినాడు. సెంట్రీ రెచ్చిపోయేటట్లుగా గట్టిగా అరచినాడు. కాని సెంట్రీలు ఖైదీల అల్లరికి భయపడి ఏమీ చేయలేక పోయినారు. ఆట్లా సెంట్రీ మీదికి దూకుడుగా వెళ్లడం అతిసాహసమనీ, అతడు కాల్చివేస్తే ఏమి చేసేవాడవనీ కొందరు తోటి ఖైదీలు కాళోజీని హెచ్చరించినారట. కాని కాళోజీది ధర్మాగ్రహం. ఎవడైనా అన్యాయం చేస్తే ఆతడెంతటివాడైనా లెక్కచేసేవాడు కాదు.

కాళోజీకి జైల్లో రకరకాల వ్యక్తులతో పరిచయాలవుతుండేవి. వాళ్లూ కాళోజీని అమితంగా గౌరవించేవాళ్లు. అయనకు సహాయం చేసేవాళ్లు కొందరైతే మరికొందరు. సేవచేసేవాళ్లు, వాళ్లలో బాడబా అనే ఒక కన్నడిగుడున్నాడు. ఈతడొక హత్యానేరంలో ఉరిశిక్షకు గురైనాడు. ఐతే ఏడవనిజాం మానవతాదృక్పథంతో ఉరిశిక్షను అమలు పరచేవాడుకాదు. అందువల్ల ఈతడు జీవితఖైదీగా మారినాడు. పిదప ఈతన్ని అధికారులు జైలుసిబ్బందిగా మార్చి పనులు చేయించుకునే వాళ్లు. ఈతడు ప్రతినిత్యం పాలకాంట్రాక్టరు వద్దనుండి అదనంగా పాలు అడుక్కవచ్చి కాళోజీకి పోసేవాడట. పోస్టాఫీసులోని డబ్బును సొంతానికి వాడుకున్న నేరానికి జైలుశిక్ష అనుభవిస్తున్న ఒక ముస్లింఖైదీకూడ ఉండేవాడట. ఈతన్ని జైలుఅధికారులు వంట సామానులు తేవడానికి వాడుకునేవాళ్లు. సామానుకు పోయినప్పుడల్లా కాళోజీకోసం ఈతడు చాటుగా పాన్‌లు కట్టించుకొని తెచ్చేవాడట.

ఔరంగబాదుకు చెందిన మోహతాబ్ అనే ఒక పహిల్వాన్‌కూడ కాళోజీకి జైల్లో అతి సన్నిహితుడైనాడు. ఇతడొక అత్యాచారం కేసులో పట్టుబడి జైల్లో శిక్ష అనుభవిస్తున్నాడు. ఈతనిది చాలా దృఢకాయం ఈతడెట్లాగో జైలు వంటగదినుంచి నూనెతెచ్చి కాళోజీ శరీరానికి మాలిష్ చేసేవాడట. దీనితో కాళోజీ శరీరం నున్నబడి నిగనిగలాడేవాడట. కాళోజీకి చాల భాషలు వచ్చు. కన్నడం, మరాఠీ, తెలుగు, హిందీ, ఉర్దూ, ఇంగ్లీషు భాషల్లో బాగా మాట్లాడగలిగేవాడు. కనుకనే కాళోజీకి జైల్లో అన్ని ప్రాంతాల



వాళ్లతోనూ, అన్ని వర్గాలవాళ్లతోనూ సత్సంబంధా లేర్పడినాయి. వాళ్లు ఈయన్ని బాగా అభిమానించేవాళ్లు. వాళ్లవాళ్ల మాతృభాషల్లో మాట్లాడినందువల్ల వాళ్లతో కాళోజీకి అనుబంధాలు పెరిగేవి. వాళ్లవాళ్ల జీవనవిధానాలతో పరిచయాలేర్పడేవి. ఆత్మీయతలు కలిగేవి.

జైల్లోకూడ రకరకాల మనస్తత్వాలు కలిగినవాళ్లుంటారని కాళోజీ ఒక ఉదాహరణ చెబుతుండేవాడు. జైల్లో దోమలధికంగా ఉండేవి. ఖైదీలకు నిద్రపట్టక బాధపడేవాళ్లు. కొందరు ఖైదీలు మచ్ఛర్‌దాన్‌లు వేసుకొని పడుకునేవాళ్లు. కొందరికవి ఉండకపోయేవి. మచ్ఛర్‌దాన్‌లు వేసుకున్నవాళ్లకు కుట్టవలసిన దోమలుకూడ అదనంగావచ్చి లేనివాళ్లను కుడుతున్నాయంటూ కొందరు వాదన లేవదీసినారట. ఇటువంటి విచిత్రమైన మనస్తత్వాలు కలవాళ్లు జైల్లో ఉండేవాళ్లు. అందువల్ల బయటి ప్రపంచంలో కొన్ని సంవత్సరాలలో నేర్చుకోగలిగిన అనుభవం జైల్లో ఒక్కరోజులోనే నేర్చుకోవచ్చునని కాళోజీ ఉదాహరిస్తుండేవాడు. కాళోజీ తనకోసం ఎప్పుడూ జైలు అధికారులతో దెబ్బలాడకపోయేవాడు. తోటి ఖైదీల కేమైనా ఇబ్బందులు జరుగుతుంటే వాళ్లకోసం అధికారులతో పోట్లాడేవాడు. వాళ్లకు కావలసిన సౌకర్యాలు లభించేదాకా అధికారులతో వాదించి సాధించేవాడు. అట్లాంటి సందర్భాలనేకమున్నాయి.

## 11

భారతదేశానికి 15 ఆగస్టు 1947నాడు స్వాతంత్ర్యం వచ్చినా హైదరాబాదురాష్ట్రానికి మాత్రం ఆ అదృష్టం దక్కలేదు. అనేక స్వదేశీ సంస్థానాలు సర్దార్ వల్లభాయిపటేల్ కృషి కారణంగా భారతసమాఖ్యలో కలిసిపోయినాయి. కాని ఏడవనిజాం ఉస్మానలీఖాన్ భారతసమాఖ్యలో కలువడానికి నిరాకరించినాడు. అందువల్ల ఇక్కడ హైదరాబాదురాష్ట్ర విమోచనోద్యమం తీవ్రతరమైంది. అంతదాకా నిజాంప్రభువు ఛత్రచ్ఛాయలోనే బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పడాలన్న నినాదం స్థానంలో, హైదరాబాదు రాష్ట్రం ఇండియన్‌యూనియన్‌లో కలువాలీ, బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పడాలీ అన్న నినాదాలు ముందుకు వచ్చినాయి. రైతులు ప్రభుత్వ

నిర్బంధవసూళ్లకు వ్యతిరేకంగా పోరాడినారు. విద్యార్థులు వందేమాతరం ఉద్యమంలో పాల్గొని కాలేజీలను బహిష్కరించినారు. కమ్యూనిస్టు లొకవైపు తెలంగాణారైతాంగసాయుధ పోరాటాన్ని చేపట్టినారు. కాంగ్రెసువాళ్ళేమో ఒకవైపు సత్యాగ్రహాలు చేస్తూ మరొకవైపు రాష్ట్రానికి వెలుపల సరిహద్దు క్యాంపులుపెట్టి నిజాంపోలీసులపై,రజాకార్లపై దాడులు చేయనారంభించినారు. ప్రజాఉద్యమాలు ఇట్లా సాగుతున్న కాలంలోనే రజాకార్ల దౌర్జన్యాలు మితిమీరి పోయినాయి. ఊర్లకు ఊర్లనే తగులబెట్టడం, స్త్రీలపై మానభంగాలు చేయడం, పిట్టల్ని కాల్చినట్లు మనుషుల్ని కాల్చివేయడం వంటి కిరాతకచర్యలు నిత్యకృత్యమైనాయి. ప్రజల ధనమానప్రాణాలకు భద్రతలేకుండా పోయింది. దేశానికంతా స్వాతంత్ర్యం వచ్చినా హైదరాబాదురాష్ట్రప్రజలకు మాత్రం స్వాతంత్ర్యం లభించనందున ప్రజల్లో అసహనం పెరిగింది. విమోచనోద్యమంలో భాగంగా ప్రజలు త్రివర్ణపతాకావిష్కరణలూ, జండావందనాలూ నేయనారంభించినారు. త్రివర్ణపతాకం కలిగి ఉండడమైనా జండావందనం చేయడమైనా నేరంగా భావించి పోలీసులు ఉద్యమనాయకులపై కేసులుపెట్టి జైలుకు పంపేవాళ్లు. జైల్లన్నీ సత్యాగ్రహ కార్యకర్తలతో నిండిపోయేవి. సాధారణంగా సత్యాగ్రహాలు కాంగ్రెసుపార్టీ చేపడుతూఉండేది. ఈ సందర్భంలో స్వామి రామానందతీర్థగారు మధిరలో సత్యాగ్రహం తలపెట్టి రైలులో హైదరాబాదునుండి బయలుదేరినారు. మధిర ప్రస్తుతం ఖమ్మం జిల్లాలో ఉన్నది. ఆ రోజుల్లో ఖమ్మంజిల్లా వేరుగా లేదు. అది వరంగల్లు జిల్లాలో ఒక తాలూకా మాత్రమే. తీర్థగారు వస్తున్నారన్న వార్త తెలియగానే, కాళోజీ తన తోటి వకీళ్ల కీవార్త తెలిపి, రైలు ఖాజీపేటలో ఆగినప్పుడు తీర్థగారిని పూలమాలలతో సత్కరించాలని చెప్పినాడు. కాళోజీ తీర్థగారితో కలిసి మధిరకు వెళ్లడానికి సిద్ధమై ఖాజీపేటలోనే రైలెక్కినాడు. కాళోజీ కోరినట్లుగానే కొందరు వకీళ్లు వచ్చి ఖాజీపేట రైల్వేస్టేషన్‌లో తీర్థగారిని పూలమాలలతో సత్కరించినారు. ఈ కార్యక్రమానికి ముస్లిం వకీళ్లెవరూ రాలేదు. తీర్థగారివెంట ఉండి వారికి సహకరించాలన్న ఉద్దేశంతో కాళోజీ వారిని మధిరదాకా అనుసరించినాడు. మధిరలో రైలు దిగి ప్లాటుఫారం దాటగానే తీర్థగారు సత్యాగ్రహం చేస్తున్నట్లు ప్రకటించినారు. వెంటనే పోలీసులు వారిని అరెస్టుచేసినారు.

కాళోజీ అక్కడినుండి విజయవాడ వెళ్లి అక్కడి సరిహద్దు క్యాంపులో



ఉన్న కాంగ్రెసు ముఖ్యనాయకులకీ సంగతి తెలిపినాడు. ఆ క్యాంపులో టి. హయగ్రీవాచార్యుల వంటి నాయకులుండిరి. ఆ నాయకులందరూ ఇదే 15 ఆగస్టు 1947 నాడే నిజాంరాజు లొంగిపోయి తమకూ స్వాతంత్ర్యం వస్తుందని ఆశతో ఉండిరి. కాళోజీ ఈ సమయంలో జ్వరంతో బాధపడుతున్నా, 15 ఆగస్టునాడు వరంగల్లులో జండావందన కార్యక్రమంలో పాల్గొనాలన్న ఉద్దేశంతో విజయవాడనుండి బయలుదేరివచ్చినాడు. కాని జ్వరం తీవ్రతవల్ల ఆయన ఆ రోజు జండావందన కార్యక్రమంలో పాల్గొనలేదు. కాని 2 సెప్టెంబరునాడు తాండ్ర వెంకట్రామనర్సయ్యగారనే న్యాయవాది హనుమకొండ కాంగ్రెసు ఆఫీసులో నిర్వహించిన జండావందన కార్యక్రమంలో కాళోజీ పాల్గొనినాడు. ఐతే జండావందన కార్యక్రమంలో పాల్గొన్న కాళోజీపై పోలీసులు కేసు పెట్టకుండా వదిలివేద్దామనుకున్నారు. కాని కాళోజీ నిర్భయంగా సబినిస్పెక్టరుతో వాదించి తనపై కేసు రాయించుకున్నాడు. తత్ఫలితంగా కాళోజీని అరెస్టుచేసి జైలుకు పంపించినారు. కాళోజీ జైల్లో ఉన్నప్పుడే పరకాలలో సత్యాగ్రహఉద్యమం ఉధృతమైంది. అక్కడి ప్రజలుకూడ జండావందన కార్యక్రమాల్లో ఎక్కువ సంఖ్యలో పాల్గొన్నారు. సత్యాగ్రహాలు చేసినారు. నడిబజారులో గుమిగూడిన ప్రజలపై పోలీసులు నిర్దాక్షిణ్యంగా విచక్షణారహితంగా కాల్పులు జరిపి చాలామందిని పొట్టన బెట్టుకున్నారు. పరకాల పట్టణం మరో జలియన్‌వాలాబాగ్ వలె రక్తసిక్తమైంది. పరకాల ప్రజల ఈ వీరోచిత పోరాటం స్వాతంత్ర్యచరిత్రలో రక్తాక్షరాలతో లిఖింపబడింది. ఇటువంటి వార్తలు జైలులో ఉన్న కాళోజీకి అందినప్పుడల్లా ఆందోళన చెందుతుండేవాడు. అట్లాగే మరొక దారుణ సంఘటన వరంగల్లుజిల్లా జనగామ తాలూకాలోని బహిరాన్‌పల్లిలో జరిగింది. బహిరాన్‌పల్లి ప్రజలు వీరోచితంగా రజాకార్లతో పోరాడి వాళ్ళను తమ గ్రామంలోకి అడుగుపెట్టకుండా నిరోధించినారు. నిజాం పోలీసుల దుష్కృత్యాల నెదిరించినారు. అందుకు కసి తీర్చుకోవడం కోసం కరడుగట్టిన రజాకార్ రాక్షసమూకలూ, నిజాంపోలీసులూ ఏకమై మిడతలదండుల్లా బహిరాన్‌పల్లిమీదబడి 90 మందిని కాల్చి చంపినారు. ఎందరో స్త్రీలను మానభంగంచేసి పశువుల్లా ప్రవర్తించినారు. ఆ పిదప దాని ప్రక్కనే ఉన్న కూటిగల్లు గ్రామంపై కూడ దాడిచేసి 20 మందిని పొట్టన బెట్టుకున్నారు. ఈ రెండు గ్రామాలూ రెండుమూడు గంటల్లో వల్లకాడులుగా మారినాయి. అక్కడి అమరవీరుల ఆత్మీయుల ఆర్తనాదాలు

ఆకాశాన్ని బ్రద్దలు చేసినాయి. ఈ వార్త తెలియగానే కాళోజీ ఎంతో ఆవేదనకు గురైనాడు. కన్నీరు కార్చిచ్చులా మారింది. అప్పుడాయన -

మన కొంపలార్చిన మన స్త్రీల చెరచిన
మన పిల్లలను చంపి మనల బంధించిన
మానవాధములను మండలాధీశులను
మరచిపోకుండ గురుతుంచుకోవాలె
కసి ఆరిపోకుండ బుసకొట్టుచుండాలె
కాలంబు రాగానే కాటేసి తీరాలె
తిట్టిన నాల్కలను చేపట్టికొయ్యాలె
కొంగులాగిన వేళ్ల కొలిమిలో పెట్టాలె
కన్నుగీటిన కళ్ల కారాలు చల్లాలె
తన్నిన కాళ్లను డాకలిగ వాడాలె
కండ కండగ కోసి కాకులకు వెయ్యాలె
కాలంబురాగానే కాటేసి తీరాలె

అంటూ ఒక గేయం రచించినాడు. ఇందులో ఎంతటి ఉద్వేగమున్నదో పాఠకులూహించ గలుగుతారు. కాళోజీది అంతటి ధర్మాగ్రహం. దీన్ని విన్న తోటి ఖైదీలు వీరావేశంతో ఊగిపోయినారు.

కాళోజీ జైల్లో ఉన్నప్పుడే హైదరాబాదుపై పోలీసుయాక్షన్ ఇక కొద్దిరోజుల్లో జరుగుతుందనగా రజాకార్లనాయకుడైన ఖాశింరజ్వీకి హైదరాబాదులో ఘనంగా సన్మానం జరిగింది. ఈ సన్మానకార్యక్రమాన్ని నిర్వహించిన వాళ్లు మరెవరో ముస్లింలుకాదు. ముస్లిమేతరులైన హిందువులూ, క్రైస్తవులూ, సిక్కులూ, పారసీలూ, ఇంకా హరిజనులూ మొదలైనవాళ్లంతా నాయకత్వం వహించి కాశింరజ్వీని పూలమాలలతో ముంచేసి, ఆయన్ని హైదరాబాదు ప్రజల రక్షకుడంటూ ప్రశంసించినారు. సిక్కులు ఖడ్గాన్ని బహూకరించినారు. ఈ వార్తవిన్న కాళోజీ ఎంతగానో కుమిలిపోయినాడు. జాతి ప్రయోజనాలను కాలరాచి, కేవలం స్వప్రయోజనంకోసం ఆత్మాభిమానం చంపుకొని కొందరు ఇట్లా నీచంగా దిగజారిపోయి, ఒక కిరాతకునికి సన్మానం చేసినందులకు కాళోజీ ఎంతగానో నొచ్చుకున్నాడు. ఖాశింరజ్వీ ముస్లింలను రెచ్చగొడుతూ ఉద్రేకపూరిత ప్రసంగాలు చేసేవాడు. భారతప్రభుత్వాన్ని



కూలద్రోసి బందరురేవులో నిజాంప్రభువు కాళ్లు కడుగుతాననీ, బంగాళాఖాతంలో కత్తి కడుగుతాననీ, ఢిల్లీ ఎర్రకోటపై నిజాంజండా నెగురవేస్తాననీ ఇట్లా ఏవేవో బీరాలు పలుకుతుండేవాడు. ఇట్లాంటి దుందుడుకు మాటలు విన్నప్పుడల్లా కాళోజీ రక్తం సలసల కాగుతుండేది. మరొకవైపు క్రమంగా ఖైదీలు సహనం కోల్పోసాగినారు. చాలామంది ఒకటిరెండు రోజుల్లో నిజాం లొంగిపోతాడని భావించి సత్యాగ్రహాలు చేసి జైలుకు వచ్చినారు. వీళ్లలో సంపన్నులున్నారు. సుఖజీవితానికి అలవాటు పడిన ఉన్నత కుటుంబాలవాళ్లున్నారు. వాళ్లంతా జైళ్లలో కఠినశిక్షలనుభవించినారు.

ఇట్లా ఖాశింరజ్వీ చేసే దురాగతాలనూ హత్యాకాండలనూ చూసి మందుముల నరసింగరావుగారు తన రయ్యత్ పత్రికలో నిజాంరాజు నుద్దేశించి కొన్ని వ్యాసాలు రాసినాడు. ఖాశింరజ్వీని అదుపులో పెట్టకపోతే చివరికి నిజాంప్రభువరేణ్యుల సింహాసనానికే ముప్పువాటిల్లుతుందని హెచ్చరించినాడు. నిజాం ప్రభువుకు అత్యంత ఆత్మీయుడైన బారిష్టర్ శ్రీ కిషన్ కూడ నిజాంకొక బహిరంగలేఖ రాస్తూ ఖాశింరజ్వీవల్ల ప్రజలకెంతో కీడు వాటిల్లుతున్నదనీ, దాన్ని తొందరగా సవరించుకోవలసిందనీ కోరినాడు. ఈయన నిజాంకు బాల్యమిత్రుడు. వీరసావర్కర్‌తో కలిసి ఇంగ్లాండులో లా చదివినవాడు. అట్లాగే షోయబుల్లాఖాన్ తన ఇమ్రోజ్ పత్రికలో రజాకార్ల దుండగాలను ఖండిస్తూ నిజాంను మందలిస్తూ కొన్ని వ్యాసాలు రాసినాడు. ఇట్లా రాసినందుకు షోయబుల్లాఖాన్‌ను కాచీగూడ చౌరస్తావద్ద రజాకార్లు దారుణంగా నరికి చంపినారు. ఇంతచేసినా నిజాంప్రభువుకు జ్ఞానోదయం కాలేదు. రజాకార్లుకానీ, ఖాశింరజ్వీకానీ వెనక్కు తగ్గలేదు, సరికదా పెచ్చరిల్లినారు.

ఐతే నాటి ఉపప్రధాని సర్దార్ వల్లభాయిపటేలు 25 ఆగస్టు 1948 నాడు చండీగఢ్‌లో ప్రసంగిస్తూ హైదరాబాదురాష్ట్ర భవిష్యత్తుగూర్చి చెప్పిన మాటలు ప్రజలకెంతో ఊరట కలిగించినాయి. ఆయన చొరవవల్లనే భారతప్రభుత్వం హైదరాబాదురాష్ట్రంపైపోలీసు యాక్షన్ చేపట్టింది. అది 13 సెప్టెంబరు 1948నాడు ప్రారంభమై 17 సెప్టెంబరుతో ముగిసింది. నిజాం భారతప్రభుత్వానికి లొంగిపోయినాడు. హైదరాబాదురాష్ట్రం భారతసమాఖ్యలో విలీనమైంది. దీనితో ఆసఫ్జాహీల పాలన అంతరించింది. ఇది జరిగిన వారంరోజులకు రాజకీయ ఖైదీలను వదిలిపెట్టినారు. అట్లా కాళోజీ 28 సెప్టెంబరు 1948నాడు జైలు నుండి విడుదలై వచ్చినాడు.

## 12

స్వాతంత్ర్యానంతరం భారతదేశమంతటా 1952లో తొలిసారిగా సాధారణఎన్నికలు జరిగినాయి. కాళోజీ అప్పుడూ ఇప్పుడూ కూడ కాంగ్రెసు పార్టీలోకానీ, మరే పార్టీలోకానీ సభ్యుడుగా లేడు. ఆయనది స్వతంత్రమైన ధోరణి. ఏ పార్టీకి అనుచరుడుగా ఉండడం ఆయన కిష్టముండదు. పార్టీ కట్టుబాట్లకు లొంగే మనస్తత్వం కాదాయనది. దాన్ని కాళోజీ "పార్టీవ్రత్య" మంటాడు. ఈ "పార్టీవ్రత్య"మన్న పదాన్ని కూడ ఆయనే సృష్టించినాడు. ఐతే ఆయన కాంగ్రెసుపార్టీ చేపట్టిన ఉద్యమాల్లో పాల్గొనేవాడు. ఒక విధంగా కాంగ్రెసుపార్టీ వ్యక్తిగానే పని చేసేవాడు. అధికారులతో మాట్లాడినప్పుడుకూడ కాంగ్రెసుపార్టీతో మమేకమైనట్లుగానే 'మా కాంగ్రెసువాళ్లు' అంటుండేవాడు. కానీ కాళోజీకి కాంగ్రెసులో మాత్రం ఎన్నడూ సభ్యత్వం లేదు. తనకు అన్యాయంగా కనిపించినదాన్ని కాంగ్రెసుపార్టీ చేసినా మరేపార్టీ చేసినా నిష్పక్షపాతంగా ఖండిస్తాడు.

మొదటిసారి జరిగిన ఈ ఎన్నికల సందర్భంలో కాంగ్రెసుపార్టీలో లేకున్నాకూడ, సేవాభావంకల సమున్నత వ్యక్తులకు పార్టీటిక్కెటిచ్చి కాంగ్రెసుపార్టీ ఎన్నికల్లో నిలబెట్టింది. ఈ విధానాన్ని అప్పట్లో జవహర్లాల్ నెహ్రూగారు ప్రవేశపెట్టినారు. ఆ విధంగా కాళోజీని వరంగల్లు లోకసభ సీటుకు కాంగ్రెసు తరపున పోటీకి నిలబెట్టినారు. ఐతే కాంగ్రెసుపార్టీలోని కుళ్లు రాజకీయాలవల్ల కాళోజీ గెలువలేక పోయినాడు. ఈయనతో పోటీచేసిన కమ్యూనిస్టు అభ్యర్థి పెండ్యాల రాఘవరావుగారు గెలుపొందినారు. ఐతే అంతకు ముందు కమ్యూనిస్టుపార్టీ నిర్వహించిన తెలంగాణాసాయుధ పోరాటప్రభావం కూడ ప్రజలపై లేకపోలేదు. అప్పుడు కాళోజీ గనుక స్వతంత్ర అభ్యర్థిగా పోటీచేస్తే తాము బలపరుస్తామని కమ్యూనిస్టులు ఆయన్ని అభ్యర్థించినారు. కాని కాళోజీ అందుల కంగీకరించలేదు. ఎందుకంటే నిజాంరాష్ట్రంపై 1948లో పోలీసు యాక్షన్ జరిగిన పిదపకూడ కమ్యూనిష్టులు నెహ్రూ ప్రభుత్వాన్ని కూలగొట్టాలని తమ సాయుధ పోరాటాన్ని కొనసాగించి భంగపడినారు. సాయుధ పోరాటాన్ని అనవసరంగా 1951 దాక కొనసాగించి బేషరతుగా విరమించుకున్నారు. ఈ కారణంగా కాళోజీ కమ్యూనిస్టుపార్టీ



సహాయంతో పోటీచేయడాని కంగీకరించలేదు. కాంగ్రెసుపార్టీలోని కుళ్లు రాజకీయాలూ, కుట్రలవల్ల సర్దార్ జమలాపురం కేశవరావుగారంతటి త్యాగశీలీ, దేశభక్తుడూ, నిస్వార్థసేవాపరాయణుడు కూడ వర్దన్నపేట నియోజకవర్గం నుండి విధానసభకు కాంగ్రెసుపార్టీ తరపున పోటీచేసి ఓడిపోయినాడు. అక్కడకూడ పెండ్యాల రాఘవరావుగారే గెలిచినారు. కేశవరావుగారిని మధిరనుంచి పోటీకి పెడితే గెలిచిఉండేవాడు. కాని ఆయన్ని కావాలని ఓడించాలన్న కుట్రతోనే వర్దన్నపేటనుంచి పోటీలోకి దింపినారు. ఇట్లాంటి కుట్రలవల్లనే స్వాతంత్ర్యసమరయోధులైన టి.హయగ్రీవాచార్యులుగారికీ ఇంకా తదితర సేవాపరాయణులకూ ఎన్నికల్లో కాంగ్రెసుపార్టీ టికెట్టు దక్కలేదు.

ఆ తరువాత కాళోజీ 1978లో జరిగిన సాధారణ ఎన్నికల్లో పోటీ చేసినాడు. ఇందిరాగాంధీ విధించిన ఆత్యయిక పరిస్థితిని ఎత్తివేసిన పిదప 1978లో జరిగిన ఎన్నికల్లో కాళోజీ ఖమ్మంజిల్లాలోని సత్తుపల్లి విధానసభ నియోజకవర్గం నుంచి స్వతంత్ర అభ్యర్థిగా పోటీ చేసినాడు. అప్పుడు అదే నియోజకవర్గం నుంచి అప్పటి కాంగ్రెసు ముఖ్యమంత్రి జలగం వెంగళరావుగారు పోటీ చేసినారు. ఐతే అప్పుడు కూడ జనతాపార్టీనేతలు తమ పార్టీ తరపున పోటీ చేయవలసిందిగా కాళోజీని అభ్యర్థించినారు. ఐనా ఆయన ససేమిరా అంగీకరంచలేదు. ఒకపార్టీకి కట్టుబడి ఉండడం కాళోజీకి గిట్టదు. ఐతే ఈ ఎన్నికల్లోనూ కాళోజీకి ఓటమి తప్పలేదు. ఇతరుల మాదిరిగా కాళోజీ ఓటర్లకు డబ్బు గుప్పించలేదు. కల్లబొల్లి వాగ్దానాలు చేసి ప్రజల్లో ఆశలు మొలిపించలేడు. అవకతవక వ్యవహారాలు చేసి ప్రజల్ని ఆకర్షించడం ఆయనకు మనస్కరించదు.

కాళోజీ మరొకసారి అధ్యాపకుల నియోజకవర్గం నుంచి రాష్ట్ర విధానమండలికి (లెజిస్లేటివ్ కౌన్సిల్) పోటీచేసి గెలిచినాడు. ఐతే లాటరీ పద్ధతివల్ల రెండు సంవత్సరాల వరకే కాళోజీ విధానమండలి సభ్యుడిగా కొనసాగగలిగినాడు. ఈ సందర్భంలో అధ్యాపకుడుకాని కాళోజీకి ఓటువేయకూడదనే ప్రచారంకూడ జరిగింది. ఐనా కాళోజీ నభిమానించే అధ్యాపక మిత్రులెందరో ఉండిరి. వాళ్ల కారణంగా కాళోజీ గెలుపొందినాడు. తాను అధ్యాపకుల నియోజకవర్గం నుంచి గెలిచినా విధానమండలి సభ్యుడిగా తనకు రాష్ట్రాభివృద్ధి గురించి కూడ బాధ్యతలుంటాయని కాళోజీ భావించేవాడు.

ఆ పిదప మరి రెండుసార్లు కూడ కాళోజీ విధానమండలికి అసెంబ్లీ నియోజకవర్గం తరపున స్వతంత్ర అభ్యర్థిగా పోటీచేసి ఓడిపోయినాడు. దానికి కారణం పార్టీవ్రత్యమేనంటాడు. ఓటరుకు స్వేచ్ఛ నివ్వకుండా పార్టీ విప్‌లు జారీచేసి నోళ్లు మూయించడాన్ని కాళోజీ వ్యతిరేకిస్తాడు. ఓటరు అభిమతం ప్రకారం అభ్యర్థులకు ఓటువేసే స్వాతంత్ర్యం ఉండాలి, కానీ పార్టీల ఆదేశం ప్రకారం ఓటు వేయడం స్వచ్ఛమైన ప్రజాస్వామ్యం కాదంటాడు. ఇది మరొక విధమైన పార్టీ నియంతృత్వమంటాడు. అంతేకాక అధికార గర్వంతో మంత్రులూ తదితర నాయకులూ ఎన్నికల నిబంధనావళిని కూడ తుంగలో తొక్కి అతిగా ప్రవర్తించడాన్ని కాళోజీ అసహ్యించుకుంటాడు. ఇది రాజ్యాంగాన్ని అపహాస్యం చేయడమేనంటాడు. తాను విధానమండలికి పోటీ చేసినప్పుడు ఇలాంటి అనుభవాలెన్నో కలిగినాయంటూ కాళోజీ ఆవేదనపడేవాడు.

## 13

హైదరాబాదురాష్ట్రంపై పోలీసుచర్య జరిగిన కొంతకాలానికి తెలంగాణారచయితలసంఘం ఏర్పడి గొప్ప సాహిత్యచైతన్యాన్ని కలిగించింది. ఈ సంఘస్థాపనలో కాళోజీ ప్రముఖపాత్ర వహించినాడు. దీనికి కాళోజీఅధ్యక్షులుగా ఉండిరి. బి. రామరాజు, దాశరథి, సి. నారాయణరెడ్డి వంటి యువకుల తోడ్పాటు దీనికుండేది. ఈ సంఘం ఎన్నో కవిసమ్మేళనాల్ని నిర్వహించి ఎందరో యువకుల్ని ప్రోత్సహించింది. "ఉదయఘంటలు" పేరుతో ఒక కవితాసంకలనాన్ని వెలువరించింది. సంఘవార్షికోత్సవాల్ని నిర్వహించి ఆంధ్రప్రాంతంనుండి కూడ ఎందరో కవిపండితుల్ని ఆహ్వానించి గౌరవించింది. అట్లా రెండు ప్రాంతాలకూ ఈ సంఘం ఒక సాహిత్యవారధిగ పని చేసింది. ప్రజల్లో సాహిత్యఅభిలాషను పెంపొందించింది.

హైదరాబాదురాష్ట్రంలోని తెలంగాణాలో 1955లో విశాలాంధ్రోద్యమం ఉధృతంగా సాగింది. తెలంగాణాప్రాంతాన్ని ఆంధ్రప్రాంతంలో కలుపాలని విశాలాంధ్రవాదులూ, ప్రత్యేక తెలంగాణారాష్ట్రం కావాలంటూ తెలంగాణా వాదులూ సభలు సమావేశాలు జరుపుతుండేవాళ్లు. క్రమంగా ఉద్రేకాలు



పెరిగి హింసకు దారితీసింది. రాష్ట్రంలో అల్లకల్లోల పరిస్థితులేర్పడినాయి. అన్ని ప్రాంతాలకు చెందిన కవులు విశాలాంధ్రనే సమర్థించినారు. అట్లాగే కాళోజీ కూడ విశాలాంధ్రను సమర్థిస్తూ సభల్లో ప్రసంగించినాడు. కవితలు రచించి ప్రజల్ని ఉత్తేజపరచినాడు. చివరికి జవహర్లాల్‌నెహ్రూను ఒప్పించి తెలుగుప్రాంతాలన్నింటిని కలిపి ఆంధ్రప్రదేశ్‌ను ఏర్పరచినారు. ఈ కొత్త రాష్ట్రాన్ని 1 నవంబరు 1956నాడు నెహ్రూగారే ప్రారంభించినారు.

ఆంధ్రప్రదేశ్ అవతరించన పిదప రాష్ట్రంలోని కవిపండితులు కొందరికి అఖిలాంధ్రసాహిత్యపరిషత్తు నొకదాన్ని స్థాపించాలన్న కోరిక కలిగింది. దీన్ని సాధించడం కోసం కొందరు సాహితీవేత్తలు తీవ్రంగా కృషి చేసినారు. వీళ్లలో కాళోజీకూడ ఉండి ప్రముఖపాత్ర వహించినాడు. ఐతే ఈ ప్రయత్నం ఫలించే సందర్భంలోనే ప్రభుత్వమే ముందుకువచ్చి 1957లో ఆంధ్రప్రదేశ్‌సాహిత్యఅకాడమిని నెలకొల్పింది. కొందరు ప్రముఖ కవి పండితులతో కలిపి ఒక తాత్కాలిక సంఘాన్ని కూడ నియమించింది. ఐతే దీన్నొక కుట్రగా భావించి, అకాడెమీని ఆమోదించినవాళ్ల చర్యను ఖండిస్తూ కాళోజీ వెంటనే ఒక అధిక్షేపాత్మక కవితను రచించి ప్రకటించినాడు. అది "అంధపరదేశ అగాధమి" శీర్షికతో వ్యంగ్యంగా ఇట్లా సాగుతుంది -

ఆకాశ వీధి ఉన్మాదస్వామి
అంధపరదేశ స్వామి తాగాధమి
రామకృష్ణ పట్టాభిరామ చైత్యం
రాష్ట్రేతర వెంకటేశ్వరమహాత్మ్యం
సర్వసంస్థాః పరిత్యజ్య
సచివం మాం శరణం ప్రజ
దిల్లిబాబు సంజీవినితోడ చారు
తెలిసి తెలియక తలుపులు తెరచినారు
పూజపేరిట గట్టిరి మాటమ్మగుడి
పూజారులమజా హడావిడికిదడి
ప్రాతినిధ్యం ఇచ్చితి కులాలవారి
రాజ్యాంగానికి కీర్తి తెచ్చుదారి

ఇట్లా ఈ గేయం ఇంకా సాగుతుంది. ఇందులో సాహిత్య అకాడెమీ స్థాపనలో

సహకరించిన వాళ్ల పేర్లను పరోక్షంగా ధ్వనించేటట్లు ఉదాహరిస్తూ వెక్కిరించినాడు. ఈ కవితలో చదలవాడ పిచ్చయ్య, అబ్బూరి రామకృష్ణారావు, బులుసు పట్టాభిరామారావు, నార్ల వెంకటేశ్వరరావు, బాబూ రాజేంద్రప్రసాద్, నీలంసంజీవరెడ్డి, భీంసేన్‌సచార్ వంటి ప్రముఖుల పేర్లు తారుమారు చేసి ఉదాహరింపబడినాయి. రాష్ట్రంలోని ఉద్దండ కవిపండితుల్ని ఈ సాహిత్యఅకాడెమీ ద్వారా ప్రభుత్వం తన గుప్పిట్లోకి తెచ్చుకున్నదన్న భావంతో కాళోజీ ఈ కవితను రచించినాడు. దీని వెనకాల సాగిన రాజకీయాల్ని ఖండించడమే కాళోజీ ఉద్దేశ్యం. ఐతే కాళోజీని కూడ ప్రభుత్వం సభ్యునిగా నియమించింది. ఏదిఎట్లాఉన్నా ఈ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ సుమారు పాతిక సంవత్సరాలు ఎంతో సాహిత్యసేవ చేసింది. పలు గ్రంథాల్ని ప్రచురించింది. సభలు సమావేశాలు నిర్వహించింది. అది ప్రాచీన కావ్యాల్ని మళ్లీ ముద్రించి తక్కువ ధరతో ప్రజల కందించింది. ఈ దిశలో చిరకాలం అధ్యక్ష కార్యదర్శులుగా ఉండి పనిచేసిన బెజవాడ గోపాలరెడ్డి, దేవులపల్లి రామానుజరావుగారల కృషి గణనీయమైంది చివరికిది ఇప్పటి తెలుగు విశ్వవిద్యాలయంలో విలీనమైంది.

భారతదేశంపై 1962లో చైనా చేసిన దురాక్రమణ కారణంగా ఆ దేశంతో భారతదేశం యుద్ధం జరిపింది. చైనా భారతదేశంతో చేసుకున్న పంచశీల ఒప్పందాన్ని ఉల్లంఘించింది. చౌఎన్‌లై చేసిన మోసానికి జవహర్లాల్‌నెహ్రూ ఎంతగానో కలత చెందినాడు. చైనా నమ్మకద్రోహాన్ని భారతప్రజలు ముక్తకంఠంతో తెగడినారు. కవులూ కళాకారులూ సమంగానే స్పందించినారు. ఆ సందర్భంలో కాళోజీ స్పందించిన తీరు కొనియాడదగింది. "తుది విజయం మనది నిజం" అనే పేరుతో చైనా దుశ్చర్యలను ఖండిస్తూ తన కవితల సంపుటిని ప్రకటించినాడు. ఆ పుస్తక ఆవిష్కరణ కూడ ఒక ప్రెస్సు కార్మికునితో జరిపించినాడు. ఈ కవితాసంపుటికి యుద్ధ కవితల్లో విశేషస్థానమున్నది. అందులోని ఒక కవిత -

చీనా చీకట్లు బాప వెలసినట్టి అరుణతార
ఎరుపుచుక్కకిరణం మనపాలిట రక్తఉప్పలియై
మొలుస్తుందని అనుకోలేదు వారు
పంచశీల ఒప్పందం ప్రథమ సంతకదారుడు
పంచతంత్రం వ్యవహరిస్తాడని అనుకోలేదువారు



కోటొక్కపూలు వికసిస్తేనే శోభని వివరించినవాడు
పొరుగువాని పెరట్లో పూలుతొక్కేస్తాడని
అనుకోలేదువారు.
చాచా నెహ్రూతో యతి కుదిరినవాడు
ప్రాసలో బెడిసిందని మిడిసిపడి మీదపడుతాడని
అనుకోలేదువారు.

ఇట్లా చైనాను ఘాటుగా విమర్శిస్తాడు. అదొక మనపాలిటి రక్తఉప్పలివంటిదని నిరసిస్తాడు. ఇట్లాగే కాళోజీ ఎన్నో కవితల్లో భారతీయుల ఆగ్రహజ్వాలల్ని ప్రజ్వలింపచేసినాడు. ఐతే ఆ వెనువెంటనే 1965లో భారతదేశం పాకిస్థాన్‌తోనూ యుద్ధంచేయవలసివచ్చింది. అప్పుడు కూడ కాళోజీ ఆగ్రహోదగ్రుడై ఎన్నో కవితల్ని వెలయించినాడు. పాకిస్థాన్‌పై అక్షరాగ్నులు కురిపించినాడు. భారతదేశ విజయాన్ని ధ్వనింపజేస్తూ అన్యాపదేశంగా దీపావళి పండుగనాడు వెలిగించే దీపమాలికలను రమ్యంగా వర్ణించినాడు. -

ఇది జరిగిన కొన్నాళ్లకు 1969 ప్రాంతంలో ప్రత్యేకతెలంగాణా ఉద్యమం సాగింది. తెలంగాణాప్రజాసమితి ఏర్పడి ఈ ఉద్యమాన్ని ఉధృతం చేసింది. ఆంధ్రప్రదేశ్ నుంచి తెలంగాణాప్రాంతాన్ని విడదీసి ప్రత్యేకరాష్ట్రాన్ని ఏర్పరచాలన్నది దీని ఉద్దేశం. ఈ ఉద్యమంలో విద్యార్థులూ, ఉద్యోగులూ ప్రముఖ పాత్ర వహించినారు. ప్రజలు కదలివచ్చినారు. తెలంగాణానాయకులు కొందరు ప్రత్యేక తెలంగాణాను బలపరచగా, మరికొందరు సమైక్యాంధ్రను సమర్థించినారు. ఈ ఉద్యమం క్రమక్రమంగా బలపడి ఆందోళనలూ, అలజడులకూ దారితీసింది. హింస చోటు చేసుకున్నది. పోలీసుకాల్పులు జరిగినాయి. తెలంగాణా వాదులెందరో సమ్మెలు సత్యాగ్రహాలు చేసి జైళ్ల పాలైనారు. సుమారు 400 మంది ఉద్యమకారులు అసువులు బాసి అమరులైనారు. ఐనా కేంద్రప్రభుత్వం తెలంగాణాను విడదీయడానికి అంగీకరించలేదు. రాష్ట్ర ప్రభుత్వం కూడ అందుకు సానుకూలంగా లేకుండెను. అందువల్ల ప్రత్యేక తెలంగాణాఉద్యమం అర్థాంతరంగా ఆగిపోయింది. ఇందుకు కొందరు తెలంగాణానాయకులే ద్రోహం చేసినారని భావించబడింది. ఈ ఉద్యమసందర్భంలో కాళోజీ ప్రత్యేక తెలంగాణాను సమర్థిస్తూ ఎన్నో కవితల్ని రచించినాడు. తెలంగాణాకు జరుగుతున్న అన్యాయాల గూర్చి పలు సభల్లో

ఉద్రేకపూరితంగా ఉపన్యసించినాడు. ఈ ఉద్యమం సుమారు సంవత్సరకాలం నడిచింది. ఈ సంవత్సరకాలమంతా కాళోజీ ఉక్కుతూటాలవంటి కవితల్ని రచించి తెలంగాణాను నిర్లక్ష్యం చేస్తున్న పాలకులపై సంధించినాడు. కాళోజీ పూర్వం విశాలాంధ్రను సమర్థించినవాడే. అయినప్పటికీ ఆంధ్రప్రదేశ్‌లో తెలంగాణా ప్రజలకు న్యాయం జరగడంలేదన్న వాస్తవాన్ని ఆయన అనుభవపూర్వకంగా తెలిసికున్నాడు. కనుకనే ఆయన ప్రత్యేకతెలంగాణా వాదాన్ని సమర్థించసాగినాడు. తన కవితలద్వారా తెలంగాణాకు ద్రోహం చేస్తున్న పాలకులనూ ప్రభుత్వాధినేతలనూ దుయ్యబట్టినాడు. ఆంధ్రప్రదేశ్ లో తెలంగాణాకు ఎన్నటికీ న్యాయం జరుగదంటూ ఘంటాపథంగా వాదించినాడు. ఒక గేయంలో కాళోజీ -

ఎవరనుకున్నారు ఇట్లౌనని ఎవరనుకున్నారు
ఆంధ్ర తెలంగాణాలకు అన్యత ఏర్పడుతుందని
హామీలిచ్చినవారే అంతస్వాహా చేస్తారని ॥ఎవ॥
అన్నలు ఒప్పందానికి సున్నాచుట్టేస్తారని
పరిపాలనతో తమ్ముల 'ఫజీత'పాలు చేస్తారని ॥ఎవ॥
ముఖ్యమంత్రియే స్వయముగా సఖ్యత ఛేదిస్తాడని
ప్రాంతీయాధ్యక్షుండు ప్రక్కతాళమేస్తాడని ॥ఎవ॥
కావలికుక్కలు దొంగల గంజికాసపడుతాయని
కావలివాడే దొంగల కావళ్లను మోస్తాడని ॥ఎవ॥
సిబ్బందిలోగల తమ్ముల ఇబ్బంది పెడుతారని
అన్నలమను మాట మరచి అహంకారపడుతారని ॥ఎవ॥

అంటూ తీవ్రంగా విమర్శిస్తాడు.

1971లో తూర్పుపాకిస్థాన్ ప్రజలు పశ్చిమపాకిస్థాన్‌పై తిరుగుబాటు చేసి స్వతంత్రబంగ్లాదేశ్‌ను సాధించుకున్నారు. తూర్పుపాకిస్థాన్ ప్రపంచపటం నుండి అదృశ్యమై పోయింది. ఈ సందర్భంలోనూ భారతదేశానికి పాకిస్థాన్‌తో మరోసారి యుద్ధం జరిగింది. భారతదేశం బంగ్లాదేశ్‌ను సమర్థించింది. బంగ్లాదేశ్ ప్రజల వీరోచిత పోరాటాన్ని భారతప్రజలు బలపరచినారు. కవులు కవితలల్లి బంగ్లాప్రజల స్వాతంత్ర్య పోరాటాన్ని వేనోళ్ల కీర్తించినారు. కాళోజీ కూడ ఆ సమయంలో బంగ్లాదేశ్‌ను **స్వాగతిస్తూ** పలు కవితలల్లినాడు. ముజీబ్



వంటి బంగ్లాజాతీయనాయకుల్ని ఘనంగా కీర్తించినాడు. పాకిస్థాన్ దురాగతాల్ని పలు విధాలుగా ఖండించినాడు. ఒకచోట-

ఏడున్నరకోట్ల ప్రజల
గుండెగుట్టు బంగ్లాదేశ్
ఏడున్నరకోట్ల ప్రజల
ఎడదల దడ బంగ్లాదేశ్
ఏడున్నరకోట్ల ప్రజల
తియ్యని కల బంగ్లాదేశ్
ఏడున్నరకోట్ల ప్రజలు
తిరుగుబాటు బంగ్లాదేశ్
ఏడున్నరకోట్ల ప్రజల
బంగ్లాదేశ్ భేష్ భేష్
ప్రాంతేతరుల దోపిడి బాపెడి
పద్ధతి చూపెను బంగ్లాదేశ్
పీడితప్రజలకు దివ్యాదేశము

జై జై జై జై బంగ్లాదేశ్

అంటూ కాళోజీ హర్షామోదంతో బంగ్లాదేశ్‌ను స్వాగతిస్తాడు.

ఇటీవలి కాలంలో ప్రభుత్వాల దమనకాండను నిరసిస్తూ ప్రజాపోరాటాల్ని సాగించాలన్న ఉద్దేశంతో పౌరహక్కులసంఘం ఆవిర్భవించింది. కాళోజీ పౌరహక్కులసంఘం ఆశయాలతో ఏకీభవించి దాని పక్షాన పలు ప్రజాపోరాటాల్లో పాల్గొన్నాడు. పాలకులవల్ల ప్రజలకెప్పుడే ఆన్యాయం జరిగినా నిర్భయంగా వాళ్ల దురాగతాల్ని ఖండించేవాడు. అధికృతహింసను నిరసిస్తూ ఊరేగింపుల్లోనూ ఉద్యమాల్లోనూ వృద్ధాప్యంలో ఉండికూడ పాల్గొనేవాడు. ఆయన జీవితంలో చివరిభాగం ఎక్కువగా పౌరహక్కులకోసం పోరాడడానికే అంకితం చేసినాడు. సమాజంలో ఎప్పుడే దురన్యాయం పాలకులవల్ల జరిగినా, మరెవరివల్ల జరిగినా వెంటనే స్పందించి ఖండించడం కాళోజీ స్వభావం. స్వాతంత్ర్యోద్యమకాలం నుంచీ ప్రజలపక్షాన నిలిచి పోరాడిన కాళోజీని కేంద్రప్రభుత్వం 1972లో స్వాతంత్ర్య సమరయోధునిగా గుర్తించి తామ్రపత్ర ప్రదానంచేసింది. ఆయన నిరంతర సేవాభావానికి గుర్తింపుగా

ఇటీవల 1992లో భారత ప్రభుత్వం 'పద్మవిభూషణ్' బిరుదుతో సత్కరించింది. వరంగల్లులోని కాకతీయ విశ్వవిద్యాలయంకూడ అదే సంవత్సరంలో కాళోజీకి గౌరవడాక్టరేటు పట్టాను ప్రసాదించి సముచితంగా గౌరవించింది. ఇంకా రాష్ట్రప్రభుత్వమూ, పలు సాహిత్యసాంస్కృతికసంస్థలూ కాళోజీని యథోచితంగా ఆయా సందర్భాల్లో సత్కరించి గౌరవించినాయి. ఎన్ని బిరుదులు వచ్చినా ఎన్ని సత్కారాలు జరిగినా ప్రజలు ప్రదానంచేసిన 'ప్రజాకవి' అన్న బిరుదే కాళోజీకి అలంకారంగా మిగిలింది. ఇది తెలుగుప్రజలకు గర్వకారణం. ఐతే 1996 ప్రాంతంలో సంసారభారమంతా తానేమోసి కాళోజీని పెంచిపోషించిన అన్నగారైన రామేశ్వరరావుగారు పరమపదించడం కాళోజీ కెంతో వ్యథమిగిల్చింది. చివరికి తొడ ఎముక విరుగడంవల్ల నిజాంవైద్యవిజ్ఞాన సంస్థ (నిమ్స్)లో చేరి 13 నవంబరు 2002 నాడు 89వ ఏట కాళోజీ తనకాయాన్ని వైద్యవిద్యార్థుల అధ్యయనం కోసం అంకితంచేస్తూ కన్ను మూసినాడు. ప్రజల ఆశాకిరణం పరంజ్యోతిలో కలిసిపోయింది. ఆయన మరణానంతరం రాష్ట్రప్రభుత్వం ప్రజాభీష్టం మేరకు కాళోజీనగర్‌లోని మూడుబాటల కూడలిలో కాళోజీ నిలువెత్తు కాంస్యవిగ్రహాన్ని ప్రతిష్ఠించి ఋణం తీర్చుకున్నది. అంతకుమిన్నగా ఆయన ప్రజాహృదయపీఠంపై అధిష్ఠించి ఉన్నాడు.

---

# ప్రజాకవి కాళోజీ

## కవిత్వం :-

కవిగా కాళోజీకి విశిష్ట స్థానమున్నది. ఆయన రాజకీయాల్లో ఏ పార్టీకి చెందినవాడు కానట్లే సాహిత్యంలోనూ ఆయన ఏ ధోరణికీ మరే మార్గానికీ చెందినవాడు కాదు. ఏ సాహిత్యోద్యమంతోనూ ఆయన ప్రభావితుడు కాలేదు. తెలుగులో భావకవితావిర్భావం జరుగడంతోనే కాళోజీ కూడ జన్మించినాడు. ఆయన కలంబట్టిననాటికి భావకవిత్వం వెనుకంజవేస్తూ అభ్యుదయకవిత్వోద్యమం క్రమంగా పుంజుకుంటున్నది. ఆయన ఈ రెండింటి ప్రభావాలకుగానీ, మరే ప్రభావాలకుగానీ లోనుకాకుండా తన సొంత వ్యక్తిత్వాన్ని చివరిదాకా నిలబెట్టుకుంటూ వచ్చినాడు. తెలుగులో ప్రబలిన తీవ్రవాద ఆస్తిత్వవాద ఛాయలేవీ అయన మీద ప్రసరించలేదు. కవిత్వం అత్మానందం కోసమే అని నమ్మేవాడు కాదు కాళోజీ. కనుక ఆయన భావకవిగా చెలామణికాలేదు. ఆయన మార్క్సిజంపై విశ్వాసమున్నవాడు కాదు. కనుకనే ఆయన్ని అభ్యుదయకవిగా పరిగణించడానికి వీలులేదు. కవిత్వం కవిత్వం కోసమే రాసినవాడు కాదాయన. కవిత్వాన్ని సామాజిక ప్రయోజనంకోసం వాడుకున్నాడు. అంతేకాదాయన కవిత్వం రాసినా, కథలు రాసినా, మరేదిరాసినా ఈ దృక్పథంతోనే రచనలు చేసినాడు.

కాళోజీలో సంఘసంస్కరణాభిలాష ఉన్నది. కులతత్వమున్నవాడు కాదు. మతదురభిమానం అంతకన్నా లేదు. మూఢాచారాల్ని పాటించేవాడు కాదు. తనవాడూ పరాయివాడూ అన్న భేదభావం లేదు. ఆయనమీద తల్లిదండ్రుల ప్రభావమూ, ఇంటి వాతావరణప్రభావమూ బాగా కనిపిస్తుంది. ముఖ్యంగా కాళోజీమీద తన మేనమామగారైన నరదేవ్‌శాస్త్రిగారి ప్రభావం దట్టంగా కనిపిస్తుంది శాస్త్రిగారు ఆర్యసమాజ్ మార్గానుయాయి. కనుకనే కాళోజీ కూడ నిజాం ప్రభుత్వ దమనకాండను ఖండించడంకోసం ఆర్యసమాజ్ కార్యకలాపాల్లో పాల్గొనేవాడు. ఆయున ఏ గుడికి వెళ్లేవాడు కాదు. ఏ దేవున్ని పూజించేవాడు కాదు. ఎవరైనా వెంటరమ్మంటే సరదాగా గుడికి సైతం వెళ్లేవాడు. ఆయన ఏ రకమైన పూజాకార్యక్రమాల్ని ఆచరించేవాడు కాదు. కాని ఎవరైనా ఆహ్వానిస్తే ఆచరించేవాళ్ల సరసన కూచ్చుండి వాళ్లను

ఆశీర్వదించి వచ్చేవాడు. ఆయన సాహితీయాత్రలుచేసేవాడు తప్ప తీర్థయాత్రల కెన్నడూ వెళ్లినవాడు కాదు. ఆయన నాస్తికుడూ కాదు. ఆస్తికుడూ కాదు. ఆధ్యాత్మిక ప్రవచనాలు కానీ, వేదాంత ధోరణికానీ ఆయన నోటివెంట ఎన్నడూ రాలేదు.

ఐతే కాళోజీ సంప్రదాయాల్ని విచ్ఛిన్నం చేయాలన్న మనస్తత్వం కలవాడు కాదు. ఆయన కొన్ని సంప్రదాయాల్ని సనాతనసదాచారాల్ని సంస్కృతిలో భాగంగా సమాదరిస్తాడు. ఆయన గణపతి నవరాత్ర్యుత్సవాల్లో పాల్గొంటాడు. విజయదశమినాడు పాలపిట్టను దర్శించి జమ్మిఆకును కోసుకవస్తాడు. దిపావళిపండుగనాడు టపాకాయలు పేలుతుంటే కేరింతలు వేస్తాడు. బతుకమ్మ పండుగంటే మురిసి పోతాడు. సంక్రాంతిపండుగనాడైతే సాహితీమిత్రులతో కలిసి కవితాగోష్ఠుల్ని నిర్వహిస్తాడు. పెండ్లిపందిళ్లలో కూర్చుండి ఆచారాలనన్నింటిని శ్రద్ధగా తిలకిస్తాడు. వధూవరులపై సంప్రదాయ బద్ధంగా అక్షంతలువేసి ఆశీర్వదిస్తాడు. ఒక విధంగా చూస్తే ఇదంతా ఆయనలో ద్వంద్వ ప్రవృత్తివలె భాసించవచ్చు. కాని ఆయన ప్రధానంగా స్వేచ్ఛా జీవి. ఏ కట్టుబాట్లకూ, నియమనిబంధనలకూ ఆయన లొంగేవాడు కాదు. చిన్ననాటినుంచే ఈ ప్రవృత్తి ఆయనలో ప్రవర్థమానమవుతూ వచ్చింది. కనుకనే తనను పెంచి పోషించిన అన్నగారితోనూ అనేక విషయాల్లో తీవ్రంగా విభేదించేవాడు. మళ్లీ అన్నగారంటే కాళోజీకి అమితమైన గౌరవాదరాలున్నాయి. ఒక్కమాటలో చెప్పాలంటే ఆయన మానవతావాది. మనిషిగా జీవిస్తాడు. మనిషిని ప్రేమిస్తాడు. మనిషి మనుగడకోసం పోరాడుతాడు. మనిషికోసం జీవితం ధారపోస్తాడు. మానవత్వాన్ని కిరీటంగా ధరిస్తాడు. మనసున్న మహామనీషి కాళోజీ.

కాళోజీ పీడితులకోసం తాడితులకోసం పరితపిస్తాడు. అన్యాయానికి బలైపోయినవాన్ని చూసి కన్నీరు కారుస్తాడు. అన్యాయాన్నెదిరిస్తాడు. అన్యాయపరులపై అగ్నివర్షం కురిపిస్తాడు. దీనజనుల బాధల్ని చూసి చలించిపోతాడు. పాలకుల దుర్నీతిని ఎండగడుతాడు. సమాజంలో ఎక్కడ ఎవరికి ఏ రకమైన బాధ కలిగినా తనకు కలిగిన బాధగానే కాళోజీ వాపోతాడు. ఈ గుణాలన్నీ ఆయన కవిత్వంలో ప్రతిఫలిస్తాయి. సమకాలికసమాజ చలనానికి కాళోజీ కవిత్వమొక విమర్శనాత్మక వ్యాఖ్యానం వంటిది.



కాళోజీ చాలా కొద్ది సంఖ్యలోనే కథలు రచించినా ఆయన కవితల కన్న ముందుగానే కథల సంపుటి అచ్చైంది. మూడు చిన్నకథల సంపుటినొకదాన్ని "కాళోజీ కథలు" పేరుతో కె.సి. గుప్తగారు అణాగ్రంథమాల వరుసలో 1943లో ప్రచురించినాడు. ఆ పిదపనే కాళోజీ కవితల సంపుటి 'నా గొడవ'ను వట్టికోట ఆళ్వారుస్వామిగారు తన దేశోద్ధారక గ్రంథమాల' పక్షాన 1953లో అచ్చువేసినాడు. దాని తరువాత మళ్లీ చాలాకాలానికి కాళోజీ తన కవితల సంపుటులను పరాభవనామసంవత్సరంలో ఋతువు కొక్కటిగా వరుసగా అరు సంపుటాల్ని ప్రచురించినాడు. అవి పరాభవవసంతం, పరాభవ గ్రీష్మం, పరాభషవర్షం, పరాభవశరత్తు, పరాభవ హేమంతం, పరాభవ శిశిరం అనే పేర్లతో 1966-67లలో ఒక సంవత్సరమంతా వెలువడినాయి. వీటికి ఋతువులపరంగా పేర్లుపెట్టినా అవన్నీ 'నా గొడవ'లో భాగంగానే పరిగణింపబడుతున్నాయి. ప్రజాస్వామ్య విలువల్ని కాలరాస్తూ నిరంకుశంగా వ్యవహరించే పాలకులకు పరాభవం కలుగాలన్న సంకేతంతో వాటికా పేర్లు పెట్టడం జరిగింది. 'పరాభవ వసంతం' అనే సంపుటిని కొమురగిరి నారాయణరావుగారు సభకధ్యక్షత వహించగా కోదాటి నారాయణరావుగారు గ్రంథాన్ని ఆవిష్కరించినారు. కవి కాళోజీ నారాయణరావుగారితో కలిసి ఈ ముగ్గురు స్వాతంత్ర్య సమరయోధులు 'నారాయణత్రయం'గా సుప్రసిద్ధులు. దీనికి అయదారు సంవత్సరాలకు ముందే 1962లో భారతదేశానికి చైనాతో యుద్ధం జరిగిన సందర్భంలో 'తుది విజయం మనది నిజం' పేరుతో చైనాదురాక్రమణను ఖండిస్తూ కాళోజీ కవితల సంపుటి నొకదాన్ని ప్రచురించినాడు. ఇందులో కవితలన్నీ చైనా దుర్నీతినీ విశ్వాస ఘాతుకాన్నీ నిరసిస్తూ రచించినవే. అట్లాగే 1975లో దేశంలో ఎమర్జెన్సీని విధించిన సమయంలో ఆయన ప్రభుత్వ నిరంకుశవిధానాన్ని తీవ్రంగా ఖండిస్తూ రచించిన కవితలన్నింటిని కలిపి ఏలూరులోని కాళోజీ అభిమానులు కొందరు 'నా గొడవ 1975' పేరుతో అచ్చువేసినారు. ఇటీవల హనుమకొండలో "కాళోజీ ఫౌండేషన్" అనే ఒక సంస్థ ఆవిర్భవించి లభించినంతవరకు కాళోజీ కథల్ని సేకరించి "కాళోజీ కథలు" పేరుతో అచ్చువేసినారు. అట్లాగే కాళోజీ కవితా సంపుటాలన్నింటిని కలిపి 'నా గొడవ' పేరుతో ఒక బృహత్ సంపుటాన్ని ప్రచురించినారు.

స్వాతంత్ర్యోద్యమకాలంలో మాతృదేశాన్ని కీర్తిస్తూ రచనలు

చేయవలసిన అవసరాన్ని కవులు గుర్తించినారు. మాతృదేశ విముక్తికోసం దేనికైనా సిద్ధపడి పోరాడాలన్న స్ఫూర్తినీ, ఆర్తినీ ప్రజలకు కలిపించాలన్న తలంపుతో కవులు కలం బట్టినారు. భారతదేశ పూర్వవైభవాన్ని వేనోళ్లకొనియాడినారు. భారతవీరుల చరిత్రను త్రవ్వి కావ్యాలల్లినారు. కాళోజీకూడ మాతృదేశ వైభవాన్ని వర్ణిస్తూ చక్కని కవిత రచించినాడు. ఆందులో ఒకచోట -

నీరులేని ఎడారి యైనను
వానవరదల వసతి యైనను
అగ్నికొండల అవని యైనను
మాతృదేశము మాతృదేశమె.
దేశదేశము తిరిగిచూడుము
కొంత హాయియె కూర్చుమదికిని
నాల్గురోజులు నచ్చదేదియు
స్వర్గమే అపవర్గమేనియు

అంటూ మాతృదేశ మహిమను కొనియాడినాడు.

సమాజంలో వస్తుప్రపంచమొకచోట, అవసరాలు మరొకచోట ఉండి సంఘంలో సమతౌల్యం దెబ్బతింటున్నది. ఆకలి గొన్నవాళ్లకు అన్నం లభించకనూ, ఆకలిలేనివాళ్ల అధీనంలో అన్నపురాసు లుండడంవల్లనూ సమాజంలో వ్యత్యాసాలు దినదినం పెరిగిపోతున్నాయని వాపోతాడు కాళోజీ. ఇదే అంశాన్ని -

అన్నపురాసులు ఒకచోట
ఆకలి మంటలు ఒకచోట
హంసతూలిక లొకచోట
అలసిన దేహా లొకచోట

అంటూ కాళోజీ సమాజంలోని ఈ హెచ్చుతగ్గులు పోతేనే శాంతి నెలకొంటుందని సూచిస్తాడు.

ఈ రోజుల్లో పరభాష అయిన ఆంగ్లంపై ప్రజల్లో మోజు మితిమీరిపోతున్నది. చివరకి వావి వరుసలనుకూడా ఆంగ్లంలో పలుకడం నాగరకలక్షణంగా భావింప బడుతున్నది. నిత్యవ్యవహారంలో మాతృభాష



తెలుగుకు బదులు ఆంగ్లం రాజ్యమేలుతున్నది. నిజాంకాలంలోనైతే ఉర్దూ రాజ్యమేలింది. ఆనాడూ ఈనాడూ తెలుగుకు ఆదరణలేకుండా పోయింది. తెలుగుభాషాసంస్కృతులు జనజీవితం నుంచిక్రమంగా నిష్క్రమిస్తున్నాయి. తనకు తెలుగు రాదంటూ అన్యభాషల్లో ప్రసంగించడం తెలుగువాడికి గర్వకారణంగా కనిపిస్తున్నది. ఈ దురవస్థను చూసి కాళోజీ ఏనాడో ఆవేదనతో-

తెలుగు బిడ్డవురోరి తెలుగు మాట్లాడుటకు
సంకోచపడియెదవు సంగతేమిటిరా?
అన్యభాషలు నేర్చి ఆంధ్రంబురాదంచు
సకిలించు ఆంధ్రుడా చావవెందుకురా?

అంటూ ఘాటుగా విమర్శిస్తాడు. కాళోజీకి మాతృదేశమన్నా మాతృభాష అన్నా అమితమైన అభిమానం. వేషభాషల్లోకూడ ఆయన దేశీయతను పాటించేవాడు.

నిజాంకాలంలో రజాకార్ల, పోలీసుల దౌర్జన్యాలు మితిమీరిపోయినాయి. గ్రామాలను తగులబెట్టడం, స్త్రీలను మానభంగం చేయడం, మనుషుల్ని పిట్టల్ని కాల్చినట్లు తుపాకిగుండ్లకు బలిచేయడం వంటి అరాచకాలతో తెలంగాణం అట్టుడికి పోయింది. ముఖ్యంగా జనగామ తాలూకా ప్రాంతంలోనైతే రజాకార్ల దుష్కృత్యాలు నిత్యకృత్యమైనాయి. ఆ సందర్భంలో కాళోజీ కుపితుడై -

నవ యుగంబున నాజీ వృత్తుల
నగ్ననృత్యమింకెన్నాళ్లు?
పోలీసు అండను దౌర్జన్యాలు
పోషణ బొందే దెన్నాళ్లు?
దమననీతిలో దౌర్జన్యాలకు
దాగుడుమూతలు ఎన్నాళ్లు?
కంచెరెయె చేనును మేయుచుండగా
కాంచకుండు టింకెన్నాళ్లు?

అంటూ దౌర్జన్యపరులపై అక్షరాయుధాల్ని సంధిస్తాడు.

కాళోజీకి కర్షకులపై అమితమైన గౌరవం. మన భారతదేశం ప్రధానంగా వ్యావసాయికదేశం. దేశజనాభాలో కర్షకులదే సింహభాగం. కర్ష

కుని కర్రు కదలితేనే దేశం సుభిక్షమవుతుంది. కర్షకుడు సుఖిస్తేనే దేశంలో శాంతి నెలకొంటుంది. రైతు నాగలిపట్టకపోతే దేశప్రగతి ఆగిపోతుంది. సమాజంలోని అన్ని రంగాలూ నిస్తేజమవుతాయి. కాళోజీ కర్షకుని ప్రాముఖ్యాన్ని గుర్తించినవాడు కనుక -

నర్తకుని నాట్యాలు గాయకుని గానాలు
వాదిత్రుని వాద్యాలు శిల్పకుని శిల్పాలు
చిత్రకుని చిత్రాలు అంగనల అందాలు
కందర్పు కయ్యాలు కవిరాజు కావ్యాలు
కర్షకా నీకళ్లు కదలినన్నాళ్లే.

అంటూ మన సమాజంలో కర్షకుని స్థానమెట్టిదో చక్కగా వర్ణించినాడు. కాని ఈనాడు రైతు జీవితం కడు దుర్భరమై పోయిందన్న వేదన ఈ కవితలో గర్భితమై ఉన్నది.

రెండవ ప్రపంచయుద్ధకాలంలో బ్రిటిష్‌ప్రభుత్వం భారతీయ నావికుల కేవేవో ఆశలు చూపింది. అందమైన హామీలిచ్చింది. తన అవసరం తీరేదాకా ఎంతో సౌమ్యంగా ప్రవర్తించింది. చివరికి యుద్ధంలో విజయం సాధించిన పిదప బ్రిటీష్‌ప్రభుత్వం తానిచ్చిన హామీలనూ, వాగ్దానాలనూ తుంగలో తొక్కింది. అప్పుడు భారతనావికాదళం తిరుగుబాటు చేసింది. ఆ కాలంలో ఇదొక గొప్ప విప్లవం. ఆ సందర్భంలో కాళోజీ బ్రిటిష్‌ప్రభుత్వ కృతఘ్నతాభావాన్ని ఖండిస్తూ భారతీయనావికులు పలికినట్లుగానే -

ఉత్తుత్తి మాటలకు ఉబ్బి సాయము జేయ ఒడ్డెక్కిపోయారురా!
మీ ఇంటి వెలుగుకై మా క్రొవ్వుకాలింది మీ వత్తి వెలిగిందిరా!
మాట మీరక మేము ప్రాణాలు ఒడ్డినా మాకేమి ఒరిగిందిరా!
యుద్ధంబు ముగిసింది ఉత్సాహముడిగింది ఓరుపింకెట్లుండురా!

అంటూ గేయమొకటి రచించినాడు. ఇంకా ఈ కవితలో ఆయన ఆంగ్లపాలకుల దుర్నీతిని ఎండగట్టినాడు. నావికుల తిరుగుబాటుతో ఆంగ్లప్రభుత్వం దిగివచ్చింది.

ప్రపంచంలో రెండేరెండు రకాల మానవులుంటారని కాళోజీ తర్కసహంగా వింగడిస్తాడు. అమాయకులైన ప్రజలదొక రకమైతే, ఎత్తులపై



జిత్తులు వేసి తమ పబ్బంగడుపుకునే వాళ్లది మరొక రకం, రెండవరకంవాళ్ల ప్రయోజనాల కోసం మొదటి రకం వాళ్లు బలైపోతుంటారు. మొదటిరకంవాళ్లు వ్యవహారజ్ఞానం లేనివాళ్లు. రెండవరకంవాళ్లు బ్రతుకనేర్చినవాళ్లు. ఇంకా ఈ రెండవరకంవాళ్లు ఏదేదో చేసి ఏమేమో సాధిస్తారు. తిమ్మిని బమ్మి చేస్తారు. బమ్మిని తిమ్మి చేస్తారు. అమాయకులేమో ఉసూరుమంటూ అఘోరిస్తారు. ఈ సత్యాన్నే కాళోజీ -

కుటిల మతులు దేబె మొగాలు
జగతిలో రెండే రెండు రకాలు
చతురవర్గవిలాసం కొరకు
దేబెల సర్వస్వం ముడిసరుకు
లోక మెపుడు చతురునిదే సొత్తు
లే దమాయకున కందుల పొత్తు

అంటూ చక్కగా వింగడిస్తాడు. అంతేకాక -

దండెగొట్టు తెలివే చాలు
జోకవచ్చు గింజలుగా తాలు

అంటూ కూడ చతురమతుల నైజాన్ని వెల్లడిస్తాడు.

కవిత్వం గురించి కాళోజీకి ఖచ్చితమైన అభిప్రాయాలున్నాయి. కవిత్వం ఎంత గొప్పదైనా అందులో కేవలం శబ్దదోషాల్ని మాత్రమే చూపించి అది కవిత్వం కాదనే వైయాకరణులుంటారు. జనసందోహంలో నుంచి పుట్టుక వచ్చిన సహజసుందరమైన శబ్దాల్ని వాళ్లు ఖాతరుచేయరు. వ్యాకరణసూత్రాలే వాళ్లకు ముఖ్యం. ప్రజలనోళ్లల్లో నిత్యం నలిగే శబ్దాలు నిఘంటువుల కెక్కకున్నా, వ్యాకరణ సూత్రబద్ధం కాకున్నా అవి ఎంతో మనోజ్ఞంగా శ్రవణసుఖంగా ఉంటాయి. ఈ అంశాన్ని దృష్టిలో పెట్టుకొని ఆయన ఛాందసపండితుల నుద్దేశించి -

కైతకు లక్షణాలున్నాయి కోటొక్కటి
వానిలో వ్యాకరణంకూడా ఒక్కటి
మీకు దాని సూత్రాలే సర్వస్వం
గొంతుకు పోసుకొని వ్రేలాడి సతతం
చేస్తారు ఆక్రందన; అంటారు కవిత్వం

కైతకు వ్యాకరణమే పరమావధి
కాదు, అసలేకాదు అన్నాడు దాశరథి
మా రచనలో వ్యాకరణం మాత్రమే లేదు
మీ రచనంతా వ్యాకరణం మరేమి కాదు
వ్యాకరణసూత్రాలు పెట్టితే భట్టి
కాదెప్పుడు కైత పాకం గట్టి

ఇట్లా కవిత్వాన్నీ, వ్యాకరణాన్నీ ఆయన తన దృక్పథంతో విశ్లేషిస్తాడు. నిత్య ప్రవాహశీలమైన భాష ఎప్పటికప్పుడు జనవ్యవహారంలో మారుతున్నప్పుడు ఎప్పుడో కూర్చిన వ్యాకరణసూత్రాలు అన్వయించరాదంటాడు కాళోజీ.

ప్రజాస్వామ్యయుగంలో ఓటు చాలా విలువైంది. అది రాజ్యాంగం ప్రతి పౌరునికి ప్రసాదించిన పవిత్రమైన హక్కు. దాన్ని దుర్వినియోగం చేస్తే చివరికి పౌరులే నష్టపోతారు. ప్రతి పౌరుడు తన పవిత్రమైన ఓటును సద్వినియోగం చేసుకుంటే మంచి ప్రభుత్వం రాజ్యాధికారానికి వస్తుంది. లేకుంటే దుష్టప్రభుత్వం గద్దెనెక్కి ప్రజలకు యమపాశంలా బిగుసుకపోతుంది. ఏదైనా ఒక చిన్నవస్తువును కొనాలంటే మనం దాని మంచిచెడుల్ని అన్ని వైపులనుండి పరీక్షిస్తాం. అట్లాగే మనమొక నాయకున్ని ఎన్నుకోవాలంటే అతని వ్యక్తిత్వాన్ని సునిశితంగా పరిశీలించాలి. అతని ఋజువర్తన ఏపాటిదో అతని గతచరిత్ర నుండి గమనించాలి. కనుక ఓటువేసే ముందు ప్రతి ఓటరు బాగా ఆలోచించి ఆత్మప్రబోధంతో నిర్ణయం తీసుకోవాలని కాళోజీ -

ఓటిచ్చు అధికారమున్నట్టివారు
ఎన్నికల సమయాన తిన్నగా వినుడు
మట్టిబానలు కొనిన కొట్టిచూచెదము
సరుకు కొన వీధెల్లతిరిగి చూచెదము
పండుపండెనోలేదో పట్టిచూచెదము
వరునన్ని విధముల తరచి చూచెదము
ఓటు వేయుట పిల్లలాట యెట్లగును
సొరకాయ కోతలకు మురిసి పోతారా
కర్రకొరకని జీలకర్ర గొంటారా
చెరుకు తీపని వంటచెరుకు నములుదురా



ఉప్పుకప్పురంబు లుండు నొకతీరు
గుణముల జూచియే గుర్తింపవలయు

అంటూ ఓటరును హెచ్చరిస్తాడు. ఇది సర్వకాల సర్వావస్థల్లోనూ ప్రజలు గమనించవలసిన హెచ్చరిక. ఆరోగ్యవంతమైన ప్రజాస్వామ్యం వర్థిల్లడానికి ఉత్తమమైన ప్రబోధం.

కాళోజీ కన్నీటికెన్నెన్నో భాష్యాలు చెబుతాడు. కన్నీటిలో చెలరేగే భావాల్నీ ఉద్వేగాల్నీ చదువుతానంటాడాయన. కన్నీటిలో తుఫానులు చెలరేగుతుంటాయి. అగ్నిపర్వతాలు బ్రద్దలవుతుంటాయి. వాటిని పసిగడుతానంటాడు. వాటి మూలకారణాల్ని కనుగొంటానంటాడు. ఒక్కొక్క కన్నీటిచుక్కలో దాగిన బడబాగ్నుల్ని బయటకు తీస్తానంటాడు. ఐతే కాళోజీ కార్చే కన్నీళ్లలో ఈ అన్ని మతలబులూ ఉంటాయి. కనుకనే ఆయన కన్నీటి గురించి -

కన్నీటిలో ఎన్నెన్నో కలవు
కన్నీటిని గన కన్నులు కలవు
మసిబారిన ఎడదల రుసరుసలు
కసితీరని పడగల బుసబుసలు
విసుగెత్తిన జీవుల విసవిసలు
పసిగొంతుల నలిగిన పిసపిసలు
రసమూరెడి చూపుల గుసగుసలు
కన్నీటిలో ఎన్నెన్నో కలవు
కన్నీటినిగన కన్నులు గలవు

అంటూ రకరకాల కన్నీళ్లకున్న నేపథ్యాల్ని చదువగలుగుతానంటాడు. ఇట్లా కన్నీటికి గల అంతస్తత్వాన్ని చక్కగా వ్యాఖ్యానిస్తాడు కాళోజీ.

ప్రపంచంలో ఒకరికొకరు పోటీపడి తగవులాడడం సర్వసాధారణం. అది దేనికోసమైనా కావచ్చు. మనిషి మరో మనిషితో పోటీ పడడం దాన్ని సాధించడం కోసం తగవులాడడం మనిషి సహజగుణం. ఈ మనస్తత్వం అన్ని కాలాల్లోనూ, అన్ని సందర్భాల్లోనూ ఒకే విధంగా ఉంటుంది. కాలక్రమేణా వస్తువు మారుతుండవచ్చు. కాని మానవమనస్తత్వం మాత్రం ఈ పోటీ పడటంలోనూ తగువులాడడంలోనూ ఒకే రకంగా ఉంటుంది. ఈ వాస్తవిక

దృక్పథాన్ని అభివ్యక్తం చేస్తూ కాళోజీ -

చాపచింపు, సామ్రాజ్యం
కోడిగుడ్డు, కోహినూరు
పాటిమన్ను, ప్లాటీనం
బస్సుసీటు, బ్రహ్మరథం
ఏదైతేం ఏదైతేం
పోటీపడీ కాటులాడ
ఏదైతేం

అంటూ కవితాత్మకంగా తాత్త్వికధోరణితో ఉద్బోధిస్తాడు. సమాజంలో మనం నిత్యం చూస్తున్న వాస్తవ పరిస్థితే ఇది. ఒకడు సామ్రాజ్యం కోసం యుద్ధం చేస్తే మరొకడు పక్కవానితో ప్లాటుకోసం తగవులాడుతాడు. కొందరు బస్సులో సీటుకోసం తగవులాడుతారు. మరికొందరేమో అధికారపీఠం కోసం పోట్లాడుతుంటారు.

ఒకచోట కాళోజీ తన "నా గొడవ" లక్షణాల గురించి తానే నిర్వచించుకున్నాడు. అది మహాకాలునికైనా భయపడనిదనీ, కనురెప్ప తడుపునదనీ తన సహజగుణాల్ని వర్ణించుకున్నాడు. తానా గేయంలో చెప్పుకున్న లక్షణాలన్నీ తన ప్రవృత్తికీ, తన కవిత్వానికీ సమంగా అన్వయించేవిగా ఉన్నాయి. ఆయన సర్వతంత్రస్వతంత్రుడు. ఆయన్ని ఎవరూ నియంత్రించలేరు. ఆందుకే ఆయన -

నా గొడవనునది
కాళోజీ అనునది
నా గొడ వనునది
వాగుడు అనుపించునది
ఎడతెగని వాగుడుది
ఎడతెగక సాగునది
అక్షర జీవన మనునది
నా గొడవనునది
కాలమునకు ప్రతికూలముగా
సతతము పారునది, పోరునది



పారావారము ముట్టడి
వారిని సైతము ఢీకొని
ఎదురీతతో పొంగిపొర్లి
ఎత్తువైపు పారునది
నా గొడవనునది
కాళోజీ అనునది

అంటూ తన స్వభావాన్ని ఉన్నదున్నట్లుగా వర్ణించినాడు. అంతేకాదు ఇవి ఆయన కవిత్వానికి వర్తిస్తాయి. ఇందులో పాదాంతాల్లో ఉన్న 'నది' అనే పదానికి క్రియాపరంగానే కాక 'ఝరి' అనే అర్థంలోనూ అన్వయించుకుంటే ఇంకా సొగసుగా ఉంటుంది.

సమాజంలో కొందరు సమృద్ధిగా సంపదలు కలిగిఉన్న వాళ్లుంటారు. వాళ్లకు ఆకలి సంగతి తెలియదు. పేదరికం ఎట్లా ఉంటుందో తెలియదు. వాల్ల జీవితమంతా విలాసాలతో గడిచిపోతుంటుంది. కాని ఆకలిమంటలతో అలమటించే అభాగ్యులెందరో మన కళ్లముందు కనిపిస్తుంటారు. అన్నంకోసం అనునిత్యం పరితపిస్తుంటారు. ప్రొద్దస్తమానం చెమటోడ్చినా వాళ్లకు పట్టెడన్నం దొరకదు. పైగా కడుపు నిండినవాళ్లు ఆకలి గొన్నవాళ్లకు శాంతిసందేశాలు వినిపిస్తుంటారు. అట్లాగే వాళ్లకు సహనం సౌశీల్యం వంటి సద్గుణాల గురించి ఏకరువు పెడుతుంటారు. వాళ్ల ఆకలి తీర్చకుండా ఇవన్నీ చేయడం అవివేకమంటాడు కాళోజీ. అదేవిధంగా ఒకవైపు గుండాలు చెలరేగుతుంటే, అవినీతిపరులు అక్రమంగా కోట్లు దిగమింగుతుంటే, వాళ్లకు తగిన శాస్తి చేయలేనివాళ్లు బాధితులకు శాంతిమంత్ర ముపదేశించడం దుర్మార్గమంటాడు కాళోజీ. అందుకే ఒకచోట -

గుండె పగిలిపోతుంటే
కడుపు మండిపోతుంటే
కండ కరిగిపోతుంటే
ఎముక విరిగిపోతుంటే
బ్రతుకు చితికి పోతుంటే
శాంతి శాంతట ! శాంతి !
ఎర గాలం దాస్తూంటే

దొర దొంగల 'దోస్తుంటే'
'నేత' కుట్ర నేస్తుంటే
కంచె చేను మేస్తుంటే
బ్రతుకు చితికి పోతుంటే
శాంతి శాంతట ! శాంతి !

అంటూ కుండ బ్రద్దలు కొట్టినట్లు కుహనాపరులను ఖండిస్తాడు. ఈ గేయంలోని 'దోస్తుంటే' అనే పదాన్ని దోచుకోవడం అనే అర్థంలోనూ, స్నేహం చేయడం అనే అర్థంలోనూ అన్వయించుకోవాలి. 'దోస్తీ' అన్న ఉర్దూ పదానికి స్నేహం అనే అర్థం ఉన్నది. తెలంగాణా ప్రాంతంలో ఈ ఉర్దూ పదం తెలుగులో సహజసుందరంగా ఇమిడిపోయింది. అట్లాగే 'నేత' అనే పదానికి కూడ నాయకుడని ఒక అర్థం, చేనేతగాడని మరో అర్థం అన్వయించుకోవాలి. అంటే నేతగాడు నేసినట్లుగా నాయకుడు కుట్ర పన్నుతున్నాడని భావార్థం.

కాళోజీ కవిత్వంలో చాలావరకు వ్యంగ్యం, అధిక్షేపం కలగలిసి ఉంటాయి. అన్యాపదేశంగా రాయడంలోనూ ఆయన దిట్ట. కొన్ని సందర్భాల్లో సూటిగా వేడిగా వాడిగానూ చెబుతాడు. ఈనాటి కొందరు ప్రజానాయకుల తీరు తెన్నులను వాళ్ల కుటిలకుతంత్రాల్ని దొంగవేషాల్ని కాళోజీ సందర్భం వచ్చినప్పుడల్లా ఖండిస్తూనే ఉంటాడు. వాళ్లు నాయకులు కాదు వినాయకుల్లా తయారై బొజ్జలు నింపుకుంటున్నారని నిందిస్తాడు. వాళ్లు తమ పదవులకోసం చేయరాని పనులు చేస్తూంటారు. ప్రజల సమస్యల్ని పట్టించుకోకుండా పదవులకోసం చేయరాని పనులు చేస్తుంటారు. ప్రజలు అష్టకష్టాలు పడుతుంటే వాళ్లేమో విలాసవంతమైన జీవితం గడుపుతుంటారు. అలాంటి నాయకుల దుర్నీతిని తెగడుతూ అధిక్షేపాత్మకంగా కాళోజీ -

ప్రజాసేవను పేర బ్రతకండీ, తిన్నంగ మీరు
ప్రజల సొత్తును మీదె యనుకోండి
సులభమైన భుక్తిమార్గము
సుళువుగా పైకొచ్చు మార్గము ||ప్రజా||

ఆరితేరినవాని జూడండి - మెల్లంగవాని
తీరుతెన్నుల ననుకరించండి
అక్షరాలు నేర్వకుండనె



లక్షలను గడియించుమార్గము ||ప్రజా||

ఉన్న సంస్థను ఆక్రమించండీ, లేకున్న మీరో
చిన్న సంస్థను లేవదీయండి
పైరవీలకు సుగమమార్గము
పదవులను ఇప్పించుమార్గము ||ప్రజా||

అంటూ నిర్భయంగా నిర్మొహమాటంగా కుహనానాయకుల చర్యల్ని దుయ్యబడుతాడు. దినదినం ఇలాంటి నాయకులు పెరిగిపోతుండడాన్ని ఆయన సహించలేడు. వీళ్లు చెట్టుపేరు చెప్పుకొని కాయలమ్మినట్లు గాంధీపేరు చెప్పుకుంటూ బ్రతుకుతున్నారని దుయ్యబడుతాడు. ఈ గేయంలో కాళోజీ బ్రహ్మంగారి కాలజ్ఞానతత్త్వాల్లో చెప్పిన "చెప్పలేదంటనక పొయ్యేరు - జనులారమీరు" అనే తత్త్వాలలోని రచనాశైలిని అనుకరంచినాడు. అట్లాగే గాంధీమార్గం నుండి వైదొలగి కుక్షింభరులుగా మారిన నాయకులగూర్చి కాళోజీ మరొకచోట -

రఘుపతి రాఘవ రాజారాం
రాం త్రోవకు రానేరాం
పతితపావన సీతారాం
పతితులమార్గాన్నే పోతాం ||రఘు||

పుణ్యాత్ముల చరితలు విన్నాం
పుణ్యానికి బ్రతుకుచు ఉన్నాం
బకముల గురువులుగా కన్నాం
దిగమింగుట నేరుచుకొన్నాం ||రఘు||

సంస్థాధీశులము అయినాం
సంస్థానాధీశుల మించాం
ముఠాధిపతులం మేమైనాం
మఠాధిపతులను తలదన్నాం ||రఘు||

అంటూ కుండ బ్రద్దలు కొట్టినట్లు నిశితంగా విమర్శిస్తాడు. ఈ గేయం కూడ సుప్రసిద్ధ "రఘుపతి రాఘవ రాజారాం" అనే భజన కీర్తనకు వ్యంగ్యానుకరణే. వీటిని ఆంగ్లంలో పేరడీలంటారు. వీటిలో వ్యంగ్యమూ, అధిక్షేపమూ కలగలిసి

ఉంటాయి. చక్కగా అతికేటట్లుగా కాళోజీ పేరడీలు రచిస్తాడు. అవి వైచిత్రితో పాటు ధ్వనిమయంగానూ ఉంటాయి. చిన్నచిన్న మాటలతో విపులార్థాన్ని సాధిస్తాడు. ఒకచోట "సంభవామి పదే పదే" అన్న కవితలో - యదాయదాహి ధర్మస్యగ్లానిర్భవతి భారత, ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అన్న గీతాశ్లోకానికి -

యదా యదాహి దేశస్య
హానిర్భవతి పౌరక
ఎమర్జెన్సీ సంభవామి
భారతాన పదేపదే

అంటూ దేశంలో విధింపబడిన ఎమర్జెన్సీని ఖండిస్తూ అందమైన పేరడి కవితను రచించినాడు. ఇక్కడ కాళోజీ ఆనాటి దేశ దుస్థితిని ధ్వనింపజేస్తున్నాడు. నిరంకుశపాలకుల దుర్నీతిని ఎండగడుతున్నాడు. ఈ కవిత శీర్షికలోనూ పేరడీ కనిపిస్తున్నది. ఇట్లాంటి పేరడీలు మరెన్నో రచించినాడాయన.

ఎంతటి ప్రజాసేవాపరాయణుడైనా ఎంతటి చిత్తశుద్ధతో దేశసేవచేసినా, ఎంతటి ప్రజాభిమానం పొందినవాడైనా ఆతనికి ఏదో ఒక పార్టీలో సభ్యత్వం లేకుంటే ఈ రోజుల్లో అతన్ని పట్టించుకోవడం లేదు. పార్టీ ముద్రలేనిదే అతడెంతటి నిజాయితీతో పనిచేసినా దానికి విలువలేకుండా పోతున్నది. అతనికి గుర్తింపులేకుండా పోతున్నది. ఈ సత్యాన్ని వెల్లడిస్తూ కాళోజీ -

వ్యక్తిత్వముంటేమి?
వైదుష్యముంటేమి?
వక్తృత్వముంటేమి?
కర్తృత్వముంటేమి?
పార్టీలో లేకున్న
పనికి మాలినవాడు
వైరి వర్గముకన్న
దూరమైనావాడు
మంచివాడని పది
మంది యెంచిననేమి?



ఋజువర్తనుం డనుచు
లోకమెంచిననేమి?
పార్టీలో లేకున్న
పనికి మాలినవాడు
వైరివర్గము కన్న
దూరమైనావాడు

అంటూ చింతిస్తాడు. ప్రజాసేవకోసం పార్టీబంధనా లుండకూడదని కాళోజీ అభిప్రాయం.

లోక్ నాయక్ జయప్రకాశ్ నారాయణ్ గారు దేశంలో ప్రజాస్వామ్యాన్ని ఉద్ధరించడంకోసం జాతీయస్థాయిలో ఉద్యమం నడిపినాడు. ప్రభుత్వాల నిరంకుశ ధోరణిని నిరసిస్తూ పోరాటాలు సలిపినాడు. చివరికి విజయం సాధించినాడు. ఆయన జీవితంలో ఏ పదవినీ ఆశించలేదు. జీవితమంతా ప్రజల సౌభాగ్యం కోసమే ధారపోసినాడు. తనకోసం తాను బ్రతుకలేదు. ఆయన మరణించిన సందర్భంలో దేశమంతా కన్నీరు కార్చింది. కాళోజీ కూడ కదిలిపోయి జయప్రకాశ్ గారి గురించి ఒక చిన్న ముక్తకం -

పుటుక నీది
చావు నీది
బ్రతుకంతా దేశానిది

అంటూ కవిత రచించినాడు. ఈ చిన్న కవితలో ఎంతో విశాలమైన అంశం ధ్వనిస్తున్నది. జయప్రకాశ్‌గారి జీవిత పరమార్థమంతా ఇందులో ఇమిడి ఉన్నది. బహుశః ఇంతటి ధ్వనిమయమైన కవితకన్నా చిన్నది రచించడం ఎవ్వరికైనా అసాధ్యమేమో.

స్వార్థపరులైన నాయకులచేతిలో ప్రజాస్వామ్యం అభాసుపాలవు-తున్నది. దేశసేవకుల ముసుగులో వాళ్లు ప్రజల్ని జలగలవలె పీల్చిపిప్పి చేస్తున్నారు. చూస్తే నాగరీకుల్లా కనిపిస్తారు. కానీ ఆచరణలో కిరాతకంగా ప్రవర్తిస్తుంటారు. పైకి కనిపించే వాళ్ల మెరుగైన వేషభాషల్ని చూసి మోసపోరాదంటాడు కాళోజీ -

ఈనాడు తెల్లవి ఉడుతమొగాలు
ఈనాడు నాగులు అగుపిస్తాయి కుందేళ్లు

ఈనాడు పులుల మొగాలపై లేళ్లతోళ్లు
ఈనాడు హంతకులే కాపలాదార్లు
ఈనాడు దొంగకూడ మన ఇంటివాడు

అంటూ హెచ్చరిస్తాడు. అట్లాంటివాళ్ల గురించి చాలా జాగ్రత్తగా ఉండాలంటాడు. పరాయిదొంగల్ని సులభంగా గుర్తుపట్టి బుద్ధి చెప్పవచ్చుగాని ఇంటిదొంగను పసిగట్టలే మంటాడు. కనుకనే ఇలాంటి కుళ్లునంతా ప్రక్షాళనం చేయడం కోసం మరొక విప్లవం రావాలంటారు.

ఈ రోజుల్లో ప్రజలు అమాయకంగా నాయకుల మాయమాటల్ని నమ్ముతున్నారు. వాళ్లు చేసే మోసాల్ని గమనించడం లేదు. ఓట్ల కోసం వచ్చి ఏవేవో ఆశలు చూపుతుంటారు. ఎన్నికై గద్దెనెక్కినాక ప్రజలగోడు నెవడు పట్టించుకోడు. పైగా అవినీతి మార్గంలో ప్రజాధనాన్ని కొల్లగొడుతుంటారు. తమ విలాసాలకోసం ప్రభుత్వఖజానాను దుర్వినియోగం చేస్తుంటారు. ఐనా ప్రజలు అమాయకంగా వాళ్లనే నమ్ముతూ మళ్లీమళ్లీ గద్దెనెక్కిస్తుంటారు. ప్రజలకు ప్రతీకగా గొర్రెనూ, నాయకులకు ప్రతీకగా గొల్లన్ననూ తీసుకొని కాళోజీ ఈ అంశాల్ని వర్ణిస్తూ చక్కని వ్యంగ్యభరితమైన కవితను రచించినాడు. ముందున్నగొర్రె ఎటువెళ్లితే అటే వెనుకనున్న గొర్రెలు పరుగిడుతుంటాయి. ముందున్నవాటిని అనుసరించడమే వెనుకనున్న గొర్రెల సహజస్వభావం. దీన్ని దృష్టిలో పెట్టుకునే తెలుగులో 'గొర్రెదాటు' అనే సామెత వాడుకలో ఉన్నది. గొర్రె అమాయకంగా గొల్లన్నను ఎట్లా నమ్ముతుందో వర్ణిస్తూ -

దగా గడ్డి కరుస్తాంది గొర్రె
వగలగాలి పీలుస్తాంది గొర్రె
పగలనీళ్లు తాగుతాంది గొర్రె
మందలపడి మురుస్తాంది గొర్రె
తెగ బరుస్తాంది గొర్రె
బళ్లయాకరణం నెమరేస్తాంది గొర్రె
'ల' 'ర' ల అభేదం గుర్తిస్తాంది గొర్రె
గొల్లన్నను గొర్రన్ననుకుంటాంది గొర్రె
మందలపడి మురుస్తాంది గొర్రె
తెగబలుస్తాంది గొర్రె



అంటూ అన్యాపదేశంగా చక్కగా కవితను రచించినాడు. గొర్రె బలువడం గొల్లన్నకే లాభమన్నధ్వని ఇందులో ఉన్నది. అందుకే గొల్లన్న గొర్రెను బాగా మేపుతాడు. దీన్ని చూసి గొర్రె గొల్లన్నే తనను చక్కగా పోషిస్తున్నాడనీ, తన సంరక్షకుడనీ గొల్లన్న కారణంగానే తను హాయిగా జీవించగలుగుతున్నాననీ భావిస్తుంది. చివరికి గొల్లన్న కోసం బలైపోతుంది. ఈ ధ్వని అంతా ఈ కవితలో ఇమిడి ఉన్నది. ఇందులో తెలంగాణాపదాల సొగసు, యాస గుబాళిస్తున్నాయి. ఈ కవితలో మరొకసొగసున్నది. వ్యాకరణంలో 'ల' 'ర' లకు అభేదమంటూ సూత్రమొకటున్నది. అట్లా గొర్రె 'గొల్లన్న' ను గొర్రెన్నగా సంభావిస్తున్నదని భావం. గొర్రెన్నగా భావిస్తున్నదంటే తనకు ఆత్మీయునిగా విశ్వసిస్తున్నదని ధ్వని.

ప్రత్యేకతెలంగాణాఉద్యమసందర్భంలో కాళోజీ ఆ ఉద్యమాన్ని సమర్థిస్తూ పెక్కు రచనలు చేసినాడు. ఉద్యమంలో స్వయంగా పాల్గొన్నాడు. అనేక సభల్లో ప్రసంగించినాడు. యువకుల్ని ఉత్తేజపరచినాడు. ఆయన మొదట్లో విశాలాంధ్రవాది అయినప్పటికీ ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరం తెలంగాణాప్రాంతానికి జరిగిన అన్యాయాన్ని చూసి భరించలేకపోయినాడు. ఆంధ్రప్రదేశ్‌లో వరుసగా వచ్చిన ప్రభుత్వాలన్నీ తెలంగాణా పట్ల వివక్షను పాటించడాన్ని నిర్ద్వంద్వంగా ఖండించినాడు. తెలంగాణాలో సమృద్ధిగా ఉన్న వనరులన్నీ తెలంగాణాకు దక్కకుండా పోతున్నాయని వాపోయినాడు. ప్రత్యేక తెలంగాణా రాష్ట్రం ఏర్పడితేనే ఈ ప్రాంతం అభివృద్ధి చెందుతుందని ఆయన గట్టిగా నమ్మినాడు. కాళోజీకి తెలంగాణా అంటే ప్రాణం. తెలంగాణా భాష అన్నా యాస అన్నా ఆయనకెంతో ప్రీతి. తెలంగాణా ప్రజల జీవన శైలిని ఆయన బాగా ప్రేమిస్తాడు. ఆయన సంభాషణ అంతా తెలంగాణా నుడికారంతోనే సాగుతుంది. కాళోజీ కట్టు బొట్టు కూడ మధ్యతరగతి తెలంగాణా రైతును పోలి ఉంటుంది. అట్లాగని కాళోజీది సంకుచిత దృష్టికాదు. ప్రత్యేక తెలంగాణా ఉద్యమాన్ని బలపరుస్తూ కాళోజీ -

కాముడ కాముడా వలలో
చేజిక్కి పోంగా వలలో
ప్రజల రాజ్యమంచూ వలలో
ప్రకటన జరుగంగ వలలో

ప్రజల ఓట్లతోనే వలలో
ప్రతినిధులుండంగా వలలో
పౌరుల కోరికలూ వలలో
పాటించబడవూ వలలో
తెలంగాణా ప్రజలు వలలో
దిక్కుమొక్కులేక వలలో
ఏమిటిగతి అంచు వలలో
ఏడుస్తూ పోతే వలలో

అంటూ తెలంగాణా ప్రాంతంలో కామునిపున్నమ పండుగ సందర్భంలో గ్రామీణ ప్రజలు పాడుకునే ఒకానొక జానపదగేయాన్ని అనుకరిస్తూ ఒక చక్కని వ్యంగ్య కవితను రచించినాడు. ఇట్లా మరికొన్ని జానపద బాణీలను అనుకరిస్తూ కూడ ఆయన పలు కవితలు రచించినాడు.

చెట్టుపేరుచెప్పుకొని కాయలమ్ముకున్నట్లు ఒకవైపు గాంధిమహాత్ముని పేరును జపిస్తూ మరొకవైపు పాపిష్టి పనులు చేసే నాయకులు దేశంలో పెరిగిపోయినారు. వాళ్లు ఒక వైపు గాంధిజయంతులూ వర్ధంతులూ చేస్తుంటారు. మరొకవైపు వక్రమార్గంలో ధనార్జన చేస్తుంటారు. ఇంటింటా గాంధిమహాత్ముని చిత్రపటాల్ని వ్రేలాడదీసి పూజిస్తుంటారు. మరొకవైపు అవినీతిపరులై ప్రజల్ని పీడిస్తుంటారు. అలాంటి వాళ్లను దృష్టిలో పెట్టుకొని గాంధిని సంబోధించినట్లుగా కాళోజీ -

ఇంకేమి గావాలె? ఇంకేమి చేయాలె?
బతికినన్నాళ్లు నిను బాపు అని పిలిచితిమి
చచ్చిపోయిన నిన్ను జాతిపిత చేసితిమి
ఇంకేమిగావాలె? ఇంకేమి చేయాలె?
పెక్కుభంగుల నిన్ను చెక్కి నిలవేసితిమి
వేడ్కతో ఇంటింట వేలాడదీసితిమి
ఇంకేమిగావాలె? ఇంకేమి చేయాలె?
నీ పేరుతో టోపి నిత్యమైపోయినది
నీ సూత్రభాష్యమే నిలువెల్లదాచినది
ఇంకేమిగావాలె? ఇంకేమి చేయాలె?



అంటూ వ్యంగ్యవైభవంతో చక్కని అధిక్షేపకవిత రచించినాడు. ఇందులో 'టోపీ' అన్న పదంలో గాంధిటోపీని ధరించడం, ఇతరులకు టోపీపెట్టడం అంటే దగాచేయడం అనే రెండర్థాలు ధ్వనిస్తున్నాయి.

దేశంలో జరిగే దురన్యాయాలనూ, దుర్మార్గాలనూ చూసినప్పుడు తానెంతగా చలించిపోతాడో, ఎట్లా బాధపడుతాడో, ఎంతగా వేదనకు గురవుతాడో కాళోజీ స్వయంగా ఒకచోట -

అవనిపై జరిగేటి అవకతవకలు జూచి
ఎందుకో నా హృదిని ఇన్ని ఆవేదనలు
పరుల కష్టముజూచి కరిగిపోవును గుండె
మాయమోసము జూచి మండిపోవును ఒళ్లు
పతితమానవు జూచి చితికిపోవును మనసు
ఎందుకో నా హృదిని ఇన్ని ఆవేదనలు

అంటూ తన సహజస్వభావాన్ని చెప్పుకుంటాడు. అట్లా కాళోజీ కవిత్వాన్ని మనం సామాజికనేపథ్యం నుండి వేరుచేయలేం. రెండూ కలగలిసిపోయి ఉంటాయి. "నా గొడవ" సమగ్రసంపుటానికి ముందుమాట రాస్తూ కాళోజీ తన అంతస్స్వభావం గూర్చి ఇట్లా చెప్పుకున్నాడు. "జరిగినదంతా చూస్తూ ఎరగనట్లు పడిఉండగ సాక్షీభూతుణ్ణిగాను, సాక్షాత్తు మానవుణ్ణి అని నా గొడవలో చెప్పుకున్న, అగో ఆ మానవుణ్ణి కాబట్టే చుట్టుపట్ల జరిగే ప్రతి విషయానికి స్పందించడం, ఆలోచన - అసమ్మతి, నిరసన - ధిక్కారం, ప్రతిఘటన, ప్రతిఘటనా కార్యక్రమం. నేననుకున్న అవకతవకలను సవరించే ప్రయత్నం, నా వలెనే అవకతవకలను సవరించే వారితో సహకరించే ప్రయత్నం. ఎవరితోనూ సంపూర్ణంగా ఏకీభవించకపోవడం - మరెవరూ నాతో ఏకీభవించక-పోవడం. నా కనిపిస్తుంది - ఒకరితో ఏకీభవించే ధోరణికన్నా, ఒకరిని మనతో ఏకీభవింప జేయాలనేదే పరస్పరసహకారానికి గొప్ప లోటేమోనని, ఇంతకూ మనస్సేమో, క్షణమోతీరున మారి రకరకాలుగా ఆడిస్తున్నది. దాన్ని అచలంచేసే నాప్రయత్నం ఎప్పుడూ ఫలించలేదు" ఈ జీవలక్షణం కారణంగానే కాళోజీ కవిత్వమావిర్భవించింది.

కాళోజీ కవిత్వంలో అధిక్షేపమూ, వ్యంగ్యమూ అధికంగా ఉంటాయి. అన్యాపదేశంగా రాయడంలోనూ, పేరడీలు రాయడంలోనూ ఆయన

సిద్ధహస్తుడు. ఆయన మాత్రాఛందస్సుల్లోనూ, వచనకవితాప్రక్రియలోనూ తన "నా గొడవ"ను రచించినాడు. ఐతే మాత్రాఛందస్సులో నడిచిన గేయాల్లోనే కవిత్వంపాలు ఎక్కువగా కనిపిస్తుంది. కొన్ని కవితల్ని మరీ సాగదీయడం వల్ల అక్కడక్కడ కవిత్వం పలుచబడినట్లుంటుంది. మరికొన్ని చోట్ల వాచ్యంగానూ ఉంటుంది. అక్కడక్కడ తన భావోద్వేగాల్ని వ్యక్తీకరించడంలో ఆవేశాన్నీ ఆగ్రహాన్నీ అదుపుచేసుకోలేకపోయినా డనిపిస్తుంది. ఐతే తనది కవిత్వం కావాలన్న ఉద్దేశంతో రాయడంలేదని ఆయనే చెబుతుండేవాడు. సామాజిక రాజకీయాది సమస్యల్ని ప్రజలముందుంచి వాళ్లను చైతన్యపరచడం, అవినీతిపరుల దుర్మార్గాల్ని బట్టబయలు చేయడమే తన కవిత్వానికున్న ముఖ్య ప్రయోజనమంటాడు కాళోజీ. కళ్లముందు ఏ సంఘటన జరిగినా ఏ సన్నివేశం దొరికినా వెంటనే అనుకూలంగానో, ప్రతికూలంగానో స్పందించడం ఆయన స్వభావం. నిజాంనిరంకుశ పాలననాటినుంచీ, నేటి ప్రజాప్రభుత్వాల కాలందాకా ప్రజల పక్షాన నిలిచి పోరాటాలు సల్పినాడు. పౌరహక్కులకు ఎక్కడ భంగం వాటిల్లినా అక్కడ కాళోజీ నిర్భయంగా నిలుచుండి నినదిస్తాడు. పాలకుల దుర్నీతిని ఎండగడుతాడు. పౌరుల హక్కుల్ని ప్రభుత్వాలు హరించరాదనీ, వాటిని పరిరక్షించాలనీ వాదిస్తాడు. ఆయనే ఒక ఉద్యమంగా విజృంభిస్తాడు. కాళోజీ కవిత్వమంతా ఇట్లా వెలువడిందే. అదే "నా గొడవ" గా అవతరించింది. ఒక విధంగా చూస్తే ఆయన కవిత్వం నడుస్తున్న చరిత్రకు సాక్షర వ్యాఖ్యానం (రన్నింగ్ కామెంటరీ) వంటిది. కాళోజీ కవిత్వం ఆగ్రహం, ఆవేశంతో కూడుకొని ఉంటుంది. అది సూటిగానూ, ఘాటుగానూ తగులుతుంది. ఉద్రేకంతో వెలువడుతుంది. కనుక సుదీర్ఘంగా ఉండడం సహజం. కొన్ని సందర్భాల్లో అది కశాఘాతంగానూ తగులుతుంది. కాళోజీ నిత్యసమరశీలి. అవిశ్రాంత సమరయోధుడు. ఆయన కలం అన్యాయాన్ని అధర్మాన్ని ఎదిరించడానికే అంకితమైంది. యుద్ధరంగంలో వీరవిహారం చేసే సైనికుని కత్తిలా అయనకలం దురాగతాలనూ, దురన్యాయాలనూ ఖండిస్తుంది. దానికి స్వపక్ష భేదాలులేవు. కాళోజీ సతతం ప్రజలపక్షాన నిలిచి ప్రజలకోసంకవితలు రచించినాడు. కనుక ఆయనకు 'ప్రజాకవి' అన్న బిరుదు సార్థకమవుతున్నది. ఈయన ఇతర భాషల నుండికూడ కొన్ని కవితల్ని తెలుగులోకి అనువదించినాడు. మరికొన్నింటిని అనుకరించినాడు.



కాళోజీ భాషాపరంగా కూడ కొన్ని విశేషమైన ప్రయోగాలు చేస్తాడు. జంగ=అడుగు, మోరుదోపుతనం=మొరటుతనం, తుట్టి=నష్టం, ఈమలక=ఈసారి, ఈకమాన=ఈతీరుగ, కలాస్=పూర్తిగా ఖాళీకావడం, వంటి తెలంగాణా మాండలికాల్ని తన కవితల్లో విరివిగా ప్రయోగిస్తాడు. తాగుతాంది, చేసిన్రు, ఊగుద్ది, యాడినుంచొస్తది, వంటి తెలంగాణా నుడికారాన్నీ యాసనూ ఆయన యథేచ్ఛగా వాడుతాడు. కొన్ని సుప్రసిద్ధమైన పదాల్ని కొద్దిమార్పుతో - 'పార్టీ వ్రత్యం', ప్రజాకీయాలు' 'సర్వోదర' 'దశా వధారాలు' అంటూ ప్రయోగించి విశేషార్థాన్ని సాధిస్తాడు. కొన్ని చోట్ల ఆంగ్లపదబంధాలకు - మిట్టచదనుమాట (హై లెవల్ టాక్స్) అంతర్వాహినిమోరి (అండర్ గ్రౌండ్ డ్రైనేజి) అంటూ తెలుగు పదబంధాల్ని కల్పించి వైచిత్రిని ప్రదర్శిస్తాడు. ఇట్లా కాళోజీ భాషాప్రయోగంలోనూ తన ప్రత్యేకతను నిలుపుకుంటాడు. కవితల్లో ఎక్కువగా తెలంగాణా మాండలికాల్ని ప్రయోగించినా అక్కడక్కడ గ్రాంథిక పదాలు దొర్లుతుంటాయి.

కాళోజీ దృష్టిలో భాష రెండు రకాలు. ఒకటి బడిపలుకుల భాష, రెండవది పలుకుబళ్ల భాష. తనది మాత్రం పలుకుబళ్ల భాష అంటాడు కాళోజీ. అంటే జనవ్యవహారంలోని భాష అని అర్థం. ఇక బడిపలుకుల భాష అంటే గ్రాంథికభాష అన్నమాట. అది బళ్లల్లో పుస్తకాల ద్వారా బోధించే భాష అని తాత్పర్యం. పెద్దపెద్ద సంస్కృత సమాసాల్ని, గొట్టుగొట్టు పదాల్ని, నిఘంటువుల్లో తప్ప జనవ్యవహారంలో లేని జటిల పదాల్ని ప్రయోగించడం కొందరు గొప్పగా భావిస్తుంటారు. కాని అది కృత్రిమంగా ఉంటుందంటాడు కాళోజీ. ఆ భాష సంస్కృతాంధ్ర వ్యాకరణాలు నేర్వనిదే అబ్బదు. కాని పలుకుబళ్ల భాష పుట్టుకతోనే జనవ్యవహారం నుండి అబ్బుతుంది. తల్లిదండ్రుల నుండి సంక్రమిస్తుంది. అది మన నరనరాల్లో జీర్ణించుకొని ఉంటుందని కాళోజీ అభిప్రాయం. అట్లాగే కాళోజీకి మాండలిక భాషల గూర్చి కూడ కొన్ని ఖచ్చితమైన అభిప్రాయాలున్నాయి. ఏ ప్రాంతంవాడు ఆ ప్రాంతం వాడుకభాషలోనే రాయాలని ఆయన అంటుండేవాడు. మాండలికంలో తేడాలు, యాసలో వ్యత్యాసాలు ఉండడమే భాషకు జీవలక్షణమంటాడాయన. ఎవడి యాసలో వాడు మాట్లాడుతాడు. ఒక సంఘంలో కానీ ఒక మండలంలో కానీ ఏ భాష వ్యవహారంలో ఉంటే అదే వాడి వాడుకభాష అవుతుంది. అతడు అదే భాషలో రాస్తాడు. ఒక

మండలంవాడు మరొక మండలంవాని వాడుకభాషను తప్పుపట్టకూడదు. మాండలికాలన్నీ ఎదగాలి. కాని కొన్ని మాండలికాలే ప్రామాణికమైనవి, కొన్ని కాదనడం భాషాస్వభావానికి విరుద్ధమైంది. అట్లా అవుతే ఆ భాషల ఎదుగుదల ఆగిపోతుంది. ఆ పిదప చచ్చిపోతుంది. కొందరు కొన్ని మాండలికాలపట్ల వివక్ష చూపుతుంటారు. ఈ వివక్ష కారణంగానే రెండూ లేక రెండున్నర జిల్లాల భాషే ప్రామాణిక భాషగా చలామణి కావడాన్ని ఆయన ఖండిస్తాడు. అందుకు కాళోజీ ఒక ఉదాహరణ చెబుతాడు. ఎవడి దస్తూరీ వాడికి ప్రత్యేకంగా ఉంటుంది. ఒకని దస్తూరీతో మరొకనిది కలువదు. అవి భిన్నభిన్నంగా ఉంటాయి. ఐనా మనం ఈ వేరు వేరు దస్తూరీలను సులభంగా చదువగలుగుతున్నాం. అట్లాగే ఎవడి యాస వానికి ప్రత్యేకం. ఐనా మనం వేరు వేరు యాసల వాళ్లు మాట్లాడినా అర్థం చేసుకోగలుగుతున్నాం. అదేవిధంగా మాండలికం కూడ. పుస్తకాల్లో ఎవ్వరే మాండలికం రాసినా దాన్ని అందరూ అర్థం చేసుకోగలుగుతారని కాళోజీ వాదిస్తాడు.

## కథలుః

కాళోజీ కవిగానే సుప్రసిద్ధుడు కానీ కథకుడుగా ఆయన లోకానికి అంతగా తెలియదు. ఆయన నలభైలలో కొన్ని కథలు రాసి పలు పత్రికల్లో ప్రచురించినాడు. కాళోజీ రాసిన కథలు సంఖ్యలో చాలా తక్కువ అయినా అవి ఎంతో విలువైనవి. సందేశాత్మకమైనవి. ఆ కొద్ది కథలు కూడ పరిమాణంలో చాలా చిన్నవి. ఆ చిన్న కథల్లోనూ కాళోజీ తన కవితల్లోవలె వాటిలో అధిక్షేపాన్నీ, వ్యంగ్యాన్నీ, పేరడీని ప్రదర్శించినాడు. అవి ధ్వనిమయంగానూ ఉంటాయి. అచ్చై మనకిప్పుడు లభిస్తున్న కథలు మొత్తం 11 మాత్రమే. వాటిలోనూ నాలుగు కథలు అనువాదాలే. మూడు కథలు మరాఠీ నుంచీ ఒకటి ఆంగ్లం నుంచీ అనువదించినాడు. స్వంత కథలైనా అనువాదాలైనా కాళోజీ ప్రగతివాద దృక్పథాన్ని ప్రదర్శించే సామాజిక వస్తువునే పరిగ్రహించినాడు. ఆయన ప్రతీకాత్మకంగానూ కథలు రాయగల సమర్థుడని ఈ కథలవల్ల మనకు తెలుస్తుంది.

ముందుగా మనం 'మనమే నయం' అనే కథను పరిశీలిద్దాం. ఇందులో స్థూలంగా కథయిది. ఒక గ్రామంలో ఎస్.పి.సి.ఏ. (జంతువుల యెడ జరుగు



అన్యాయనిరోధకసంస్థ) వార్షికోత్సవం పెద్ద ఆడంబరంతో జరుగుతుంటుంది. ఆ ఉత్సవం నిర్వహించడంకోసం ప్రభుత్వాధికారులు గ్రామంలో ఉన్న ఎడ్లు, ఆవులు, గుఱ్ఱాలు మొదలైన జంతువుల్ని తెప్పించి పసుపుకుంకుమలతో పూలదండలతో బాగా అలంకరింపజేస్తారు. వాటి కారోజు ఆటవిడుపు. వీటిలో మల్లన్నకు చెందిన నల్ల ఎద్దొకటి, తెల్ల ఎద్దొకటి ఉన్నాయి. అట్లాగే ఆ ఉత్సవంలో పాల్గొనటానికి ప్రభుత్వాధికారులు అన్ని రకాల ప్రజలనూ, అన్ని వర్గాలకు చెందిన ఉద్యోగులనూ చిన్న పెద్ద తేడా లేకుండా రప్పిస్తారు. అధికారుల ఆజ్ఞ ప్రకారం వలంటీర్లు గార్డ్ఆఫ్ఆనర్ చెప్పగా బాజాబజంత్రీలతో మనుష్యుల వరుస ముందు నడుస్తుండగా, వెనక జంతువుల వరుస పెద్ద ఊరేగింపుగా వెళ్లుతుంటుంది. ఆ ఊరేగింపు ఎందుకు ఎక్కడికి వెళ్లుతున్నదో జంతువులకు తెలియనట్లే అందులో పాల్గొన్న మేధావులకూ విద్యావంతుల క్కూడా తెలియదు. ఇక్కడ రచయిత ఇట్లా ఊరేగింపునుద్దేశించి 'ద్విపద చతుష్పాదముల గుంపు' అంటాడు. అంటే అందులోని రెండు కాళ్లున్న మనుషులు, నాలుగు కాళ్లున్న మెదడులేని జంతువులతో సమానమని ధ్వని. అప్పుడు నల్ల ఎద్దుకు అనుమానం వచ్చి ఇదంతా దేనికోసమని తెల్ల ఎద్దునడుగుతుంది. తెల్లఎద్దు తనకూ్కడా తెలియదంటుంది. ఇక్కడొక ముఖ్య విషయం. ఒక పశువుకైనా ఎందుకన్న ప్రశ్న ఉదయించింది. కాని ఊరేగింపులో పాల్గొంటున్న మేధావుల కెవరికీ ఈ ప్రశ్న పుట్టలేదు. ఐతే రచయిత దాన్ని వాచ్యం చేయక కథాకథనశిల్పం ద్వారానే ధ్వనింపజేస్తాడు. ఇట్లా ఆ రెండిటి సంభాషణ జరుగుతుండగా ఊరేగింపు పురమందిరం చేరుతుంది. ఒక ప్రభుత్వఉన్నతాధికారి అధ్యక్షతన ప్రారంభమైన సభలో కార్యదర్శి తన వార్షికనివేదిక చదువుతాడు. అందులో ఆ సంవత్సరం ఎన్నిముల్లుకట్టెల్ని విరగొట్టిందీ, బక్క ఎడ్లను బండ్లకు కట్టినందుకూ, రోగపు గుఱ్ఱాలతో జట్కాతోలినందుకూ ఎందరెందరిని కోర్టుకీడ్చి శిక్షలు వేయించిందీ మొదలైన వివరాలుంటాయి. కాని తిండి పెట్టలేని పేదరైతుల ఎడ్లు ఎన్ని చనిపోయినాయో వాటి వివరాలందులో ఉండవు. పిదప మరి కొందరు పెద్దలు జంతువులకు జరిగే అన్యాయాల గురించీ, మనుషులు వాటికి పెట్టే హింసల గురించీ ఘనంగా ఉపన్యసిస్తారు. అంతటితో సభ సమాప్తమై అధికారులు కార్లలో తమతమ బంగ్లాలకు వెళ్లిపోతారు. పశువులు తమతమ దొడ్లకు వెళ్లిపోతాయి. ఇక్కడ కూడ పశువులు దొడ్లకు వెళ్లినట్లే మనుషులు కూడ బంగ్లాలకు

వెళ్లినారన్న ధ్వని ఉన్నది. ఈ ఉత్సవంలో పాల్గొన్న చాలామందికి అసలు ఆవులెట్లా ఉంటాయో, ఎడ్లెట్లా ఉంటాయో కూడ తెలియదు.

దొడ్లోకి వెళ్లిన పిదప నల్లఎద్దుకూ తెల్లఎద్దుకూ జరిగిన సంభాషణ చాలా రసవత్తరంగా ఉంటుంది. అసలు కథకు ఆయువుపట్టు ఇక్కడే ఉంది. పశువులకు జరుగుతున్న అనేకమైన అన్యాయాల గురించి తెల్లఎద్దు నల్ల ఎద్దుకు వరుసగా ఏకరువు పెడుతుంది. ఈ ఉత్సవం నిర్వహించిన వాళ్లకు చిత్తశుద్ధి లేదంటుంది. పశువులకు బాధలు పెట్టే మానవజాతినంతా విమర్శిస్తుంది. ఈ ఉత్సవమొక నాటకమూ బూటకమంటుంది. తమ ఆహారంకోసం ఈ మనుషు లొకవైపు ప్రతినిత్యం ఎన్నో జంతువుల్ని నరుకుతూ మరొకవైపు ఇలాంటి సభలు చేస్తుంటారంటుంది. యజమాని ఏది పెడితే అది తింటూ జీవితాంతం వాళ్లకు చాకిరీ చేయాల్సిన దుర్గతి పట్టిందంటుంది. కట్టివేసిన గుంజ వద్దనే పడి ఉండాలి తప్ప పశువులకు స్వేచ్ఛ లేదంటుంది. ఇదంతా విన్న నల్ల ఎద్దు - 'పశువులకు తమతమ యజమానులు సమయానికి తిండి పెడుతారు. ఉండడానికి దొడ్డి చూపిస్తారు. త్రాగడానికి క్రమం తప్పకుండా కుడిదిపోస్తారు. రోగంవచ్చినా నొప్పి వచ్చినా మందులిస్తారు. కాని మనుష్యుల్లో అధిక సంఖ్యాకులు కష్టజీవులు. సమాజంలోని భాగ్యవంతులు ప్రొద్దస్తమానం వాళ్లచేత చాకిరీ చేయించుకుంటారు. తమ విలాసాలకు వాళ్లను వాడుకుంటారు. ఐనా ఈ భాగ్యవంతులు వాళ్లకు కడుపునిండ తిండిపెట్టరు. వాళ్లకు ఉండడానికి గూడు ఉండదు. కట్టడానికి గుడ్డ ఉండదు. వాళ్లను ఆదుకునే నాథుడే ఉండడు. అందువల్ల వాళ్లకన్న మనమే నయమంటుంది.

ఇట్లా ఈ కథ మనమూహించని విధంగా ముగుస్తుంది. రచయిత చివరిదాకా ఇందులో సస్పెన్స్ నిర్వహించినాడు. వ్యంగ్యమూ అధిక్షేపమూ కలగలసిన కథాకథనశిల్పం ఇందులో ప్రదర్శింపబడింది. సమాజంలో నిరుపేదల, కష్టజీవుల బ్రతుకులు పశువులకన్నా హీనంగా ఉన్నాయన్న వాస్తవికతను వ్యంగ్యవైభవంగా రచయిత ఈ కథలో చిత్రించినాడు. తెల్ల ఎద్దు, నల్లఎద్దు లాంటి మనస్తత్వం కల మానవులూ మన సమాజంలో ఉంటారన్న అంశాన్ని కూడ ఇందులో ధ్వనింపజేసినాడు. అంతేకాక ప్రభుత్వాలు నిర్వహించే కొన్ని కార్యక్రమాలు ఎంత ఆడంబరంగా ఎంత



అర్థరహితంగా ఉంటాయో కూడ కాళోజీ ఈ కథలో శిల్పసహితంగా ధ్వనింపజేసినాడు.

ఇక రెండో కథ "తెలియక ప్రేమ తెలిసి ద్వేషము"ను పరిశీలిద్దాం. ఒక గ్రామంలోని దేవాలయంలోకి హరిజనులు ప్రవేశించడాన్ని సవర్ణ హిందువులు ప్రతిఘటిస్తారు. ఈ రెండు వర్గాలూ పరస్పరం లాఠీలతో గొడ్డళ్లతో కొట్టుకోగా ఒక బ్రాహ్మణుడూ, ఒక హరిజనుడూ మరణిస్తారు. యమదూతలు వచ్చి వాళ్ల జీవాత్మలను యమలోకానికి తీసుకపోతుంటారు. మధ్యలో ఈ జీవాత్మలను వైతరణీనది ఒడ్డున ఉంచి యమదూతలు గంధర్వులగానం వింటూ విశ్రాంతి తీసుకుంటుంటారు. ఆ సమయంలో ఈ జీవాత్మలు పరస్పరం సంభాషణ సాగిస్తాయి. మాటల సందర్భంలో అవి భారతదేశంలో ఒకే ప్రాంతంలోని ఒకే గ్రామానికి చెందినవిగానూ ఒకేభాష మాట్లాడేవిగానూ పరస్పరం పరిచయం కావడంతో అవి మరీ సన్నిహితమవుతాయి. ఎంతో ఆత్మీయతను ప్రదర్శిస్తాయి. ఐతే యోగక్షేమాలు మాట్లాడుకుంటూ ఉన్న సందర్భంలో అవి అదేరోజు ఘర్షణపడి హతులైన బ్రాహ్మణుడీ, హరిజనుడీ తాలూకు జీవాలైనట్లు తెలిసికుంటాయి. అంతటితో వాటికీ మళ్లీ వైరం ప్రారంభమై తన్నుకుంటాయి. కులాలపేర్లతో దూషించుకుంటూ ఉంటాయి. ఇంతలో యమదూతలు వచ్చి వీటికి చచ్చినా కులపిచ్చి, వర్గభేదం పోలేదంటూ మందలించి వాటిని యమధర్మారాజు సమక్షంలో నిలబెడుతాయి. అప్పుడాతడు విచారణ జరిపి అగ్రకులఅహంకారంతో విర్రవీగిన బ్రాహ్మణుని జీవాత్మ కొచ్చిన్‌లోని పరయా (మాదిగ) కుటుంబంలో పుట్టునట్లునూ, గాంధీమహాత్ముని అహింసామార్గాన్ని వదలి అతిగా ప్రవర్తించిన హరిజనుని జీవాత్మ తిరువాన్కూరులో ఒక హరిజనకుటుంబంలో పుట్టునట్లునూ శిక్ష విధిస్తాడు. ఇక్కడ విశేషమేమిటంటే పరయా అనబడే మాదిగలు కొచ్చిన్‌లో ఎంతో దుర్భరంగా జీవిస్తున్నారు. అదే తిరువాన్కూరులోని హరిజనులకు దేవాలయ ప్రవేశభాగ్యం కలిగి గౌరవాదరాలను పొందినారు. ఈ కథద్వారా కాళోజీ గాంధేయవాది అన్న విషయం కూడ మన కవగతమవుతుంది. మనదేశంలో మనుష్యులు చచ్చిపోయినా ఈ వర్ణ వర్గ వైషమ్యాలు మరచిపోవడం లేదన్నది ఈ కథలోని సారంశం. ఫలానా వాళ్లమని తెలియనంతవరకూ ఆ జీవాత్మలు ఎంతో ప్రేమానురాగాలతో పలుకరించుకుంటూ స్నేహంగా ఉంటాయి.

పూర్వచరిత్ర తెలియగానే మళ్లీ మామూలుగా కులంపేరుతో మతంపేరుతో దూషించుకుంటాయి. ఈ కథంతా సంభాషణ రూపంలో సాగింది. కథా ప్రారంభమే జీవాత్మలు సంభాషించుకోవడం, కలహించుకోవడంతో మొదలవుతుంది. వాటి సంవాదంద్వారానే వాటి పూర్వచరిత్ర మనకు తెలుస్తుంది. ఇందులోనూ రచయిత చివరిదాకా సస్పెన్స్ నిర్వహించినాడు. సున్నితమైన వ్యంగ్యాన్ని ప్రదర్శించినాడు. కథాకథనశిల్పం మనల్ని కడదాకా చదివిస్తుంది.

మరో కథ 'లంకా పునరుద్ధరణ' గురించి పరిశీలిద్దాం. ఇందులోని కథ ఇది. చారిత్రకపరిశోధకమండలివాళ్లు కిష్కింధలో త్రవ్వకాలు జరుపుతుండగా కొన్ని బంగారు ఇటుకలు, విలువైన ఆభరణాలు లభిస్తాయి. వాటి గురించి శతవృద్ధుడైన పురాణమార్తాండాచార్యులను అడగ్గా అతడు అధ్యాత్మరామాయణంలో వాటిగురించి ఇట్లా ఉన్నదని చెప్పనారంభించినాడు. రావణవధానంతరం లంకానగరంలో ఇంకా శాంతి నెలకొనలేదు. రావణుని పక్షంవాళ్లు చాలామంది యుద్ధంలో చనిపోయినా, మిగిలిన కొందరు పైకి మాత్రం రామభజనచేస్తూ విభీషణుని పక్షంవాళ్లను వేధిస్తుంటారు. లోపాయికారితనంగా పితూరీలు చేస్తుంటారు. దీనికి తోడు మైరావణ బలగమూ, మారీచుని బలగమూ చెలరేగి విభీషణుని పక్షంవాళ్లనూ, వానరనాయకులనూ వధిస్తుంటారు. దేశం అల్లకల్లోలంగా ఉన్నది. ఇట్లా అశాంతి ప్రబలిన సందర్భంలో విభీషణునికి వెంటనే లంకను అప్పజెప్పడం భావ్యంకాదని ప్రముఖులంతా నిర్ణయిస్తారు. అప్పుడు రాముడు సుగ్రీవునితో సంప్రదించి అతని సలహామేరకు లంకలో శాంతి నెలకొల్పడంకోసం కిష్కింధనుండి సుగ్రీవుని మేనమామనూ, అయోధ్యనుండి సుమంతుని మేనల్లున్నీ లంకలో రాజ్యాధికారులుగా నియమిస్తాడు. వాళ్లకు సహాయంగా కిష్కింధనుండి పరిపాలనాదక్షులైన వానరులనూ, అయోధ్యనుండి కొమ్ములు తిరిగిన యోధులనూ లంకకు పంపిస్తాడు. ఇట్లా లంకలో శాంతిని నెలకొల్పడం కోసం వెళ్లిన ఈ యోధానయోధులంతా మొదట్లో పొగడ్తలకూ సన్మానాలకూ అలవాటు పడుతారు. క్రమంగా వాళ్లు అవినీతిపరులై లంచాలకు మరుగుతారు. అక్రమార్జన చేస్తుంటారు. లంకావాసులనుండి బంగారు ఇటుకలూ విలువైన ఆభరణాలూ పరిగ్రహిస్తూ రాజభోగాలనుభవిస్తుంటారు. వాళ్లు వచ్చిన పని మరచిపోయి సుఖలాలసు లవుతారు. దేశం అరాచకం పాలవుతుంది.



గూఢచారులవల్ల ఈ విషయమంతా తెలిసికొని శ్రీరామచంద్రుడు స్వయంగా లంకకు వెళ్లి అక్కడి పరిస్థితులన్నీ గమనిస్తాడు. వెంటనే దీనికంతటికీ కారకులైన సుగ్రీవుని మేనమామనూ, సుమంతుని మేనల్లున్నీ ఒకే తాడుతో కట్టకట్టించి సముద్రంలో పడవేయిస్తాడు. అదే విధంగా ఇతర దోషులకూ తగిన శిక్ష విధిస్తాడు. ఆ పిదప విభీషణున్ని లంకా రాజ్యానికి పట్టంకట్టి అయోధ్యకు చేరుకుంటాడు.

ఇట్లా పాలకులు కొందరు రాజ్యాధికారాన్ని దుర్వినియోగం చేస్తూ, దుష్టవర్తనులై ప్రజల్ని బాధించడాన్ని కాళోజీ ఈ కథలో చక్కగా చిత్రీకరించినాడు. ఈ రోజుల్లోనూ కొందరు అధిపతులు అవినీతిపరులై అక్రమార్జనచేస్తూ అధికారగర్వంతో ప్రజల్ని నానా కడగండ్లపాలు చేయడం మనం చూస్తూనే ఉన్నాం. అంతేకాక ఒక దేశం మరొక దేశాన్ని ఉద్ధరిస్తామని వెళ్లి అక్కడి ప్రజల్ని నానాహింసలు పెడుతూ, ప్రజల ధన, మాన, ప్రాణాల్ని దోచుకోవడం ప్రపంచరాజకీయాల్లో నిత్యం మనం ప్రత్యక్ష సాక్ష్యంగా చూస్తున్నదే. ఇట్లాగే ఇతర కథల్లోనూ ఏదేని సందేశం వ్యంగ్యంగా ధ్వనిస్తూ ఉంటుంది.

కాళోజీ కథల్లో ఎక్కువగా కాల్పనిక వాతావరణముంటుంది. ఐనా అవి సామాజికవాస్తవికతను ప్రతిబింబిస్తూ ఉంటాయి. ప్రతీకాత్మకంగానూ, అన్యాపదేశంగాను, వ్యంగ్యభరితంగానూ కథలుండి మనలో ఉత్సుకతను పెంపొందిస్తుంటాయి. ఆయన కథల్లో ఎక్కువగా గ్రాంథికభాషను వాడుతాడు.

## అనువాదాలు:

కాళోజీ అనువాదాల్లో 'జీవనగీత' ముఖ్యమైంది. ఇది ఖలీల్ జిబ్రాన్ రచించిన 'ప్రాఫెట్' అనే ఆంగ్లగ్రంథానికి తెలుగు అనువాదం. ఖలీల్‌జిబ్రాన్ లెబనాన్‌కు చెందినవాడు. ఆయన 1883లో జన్మించి 1931లో మరణించినాడు. జిబ్రాన్ గొప్పకవీ చిత్రకారుడున్నూ, అంతకన్న ఆయనొక దార్శనికుడూ, తత్త్వవేత్త కూడ. జిబ్రాన్ తన మాతృభాష అరబ్బీలోనూ, ఆంగ్లంలోనూ పలుగ్రంథాలు రచించినాడు. అతని 'ప్రాఫెట్' అనే కావ్యం ఎన్నో ప్రపంచభాషల్లోకి అనువదింపబడి ప్రపంచ వ్యాప్తంగా ప్రసిద్ధిగాంచింది. భారతీయభాషల్లోనూ దానికి అనువాదాలు వచ్చినాయి. కాని కాళోజీ

అనువాదమే తెలుగులో మొదటిది. దీన్ని కాళోజీ 1953 ప్రాంతంలో అనువదించగా 1968లో 'యువభారతి' ప్రచురించింది.

ప్రాఫెట్ కావ్యంలో అల్‌ముస్తాఫాను వివిధ రంగాలకు చెందిన ఆర్ఫలీజు పట్టణప్రజలు పలు అంశాల గూర్చి ప్రశ్నిస్తుంటారు. వాటన్నింటికి అల్‌ముస్తఫా దార్శనికంగానూ, తాత్త్వికంగానూ విడమర్చి సమాధానాలు చెబుతుంటాడు. ఈ చెప్పడం ఎంతో అందంగాను, కవితాత్మకంగానూ ఉంటుంది. ప్రతిఅంశాన్ని సునిశితంగానూ, సుందరంగానూ వర్ణిస్తాడు. కాళోజీ అనువాదగ్రంథం 'జీవనగీత' మూలానుసరణంగా సాగుతుంది. రచనలో సరళమైన తెలుగును వాడినందున ఇది సామాన్య పాఠకులకు కూడ సులభంగా అర్థమవుతుంది. ఉదాహరణకు -

జీవితమంతయు చీకటి నిజమే -
ప్రేరణ లేకున్న
ప్రేరణ సహితము గ్రుడ్డిది -
జ్ఞానము లేకున్న
జ్ఞానంబంతయు మిధ్య -
ఆచరణము లేకున్న
ఆచరణము వృధా వృధా -
ప్రేమమయము కాకున్న

ఇట్లా అనువాదం సరళసుందరంగా సాగుతుంది. ఐతే అనువాదకుడు వాక్యనిర్మాణంలోనూ, తెలుగు నుడికారప్రయోగంలోనూ, మరికొంత మెలకువను పాటించవలచి ఉండెనని పండితు లభిప్రాయపడుతుంటారు. కాళోజీ చిరకాలం క్రితం చేసిన మరో అనువాద గ్రంథం "నాభారతదేశ యాత్ర". ఇది హెచ్. ఎన్. బ్రేల్స్‌ఫోర్డ్ రచించిన "రెబల్ ఇండియా"కు అనువాదం. దీన్ని వట్టికోట ఆళ్వారుస్వామిగారు 1941లో తన దేశోద్ధారక గ్రంథమాల పక్షాన ప్రచురించినాడు. ఆయన చేసిన మరికొన్ని అనువాదాలు అచ్చు కాకముందే లుప్తమైపోయినాయి. కాళోజీ తన ఆత్మకథను వినిపిస్తుంటే కొందరభిమానులు క్యాసెట్లలో కెక్కించగా, వాటి ఆధారంతో 'స్వేచ్ఛా సాహితి' 1995లో 'ఇదీ నా గొడవ' గా ప్రచురించింది.

కాళోజీ ప్రోత్సాహంతో పందొమ్మిది వందల యాభైలలోనే వరంగల్లులో



"మిత్రమండలి" పేరుతో ఒక సాహిత్య సంస్థ ఆవిర్భవించింది. దీనికి రామేశ్వరరావుగారి ఆశీస్సులు కూడ మెండుగా ఉండెను. దీని ద్వారా నెలకొక్కసారి ఎవరింట్లోనైనా సాహితీమిత్రులంతా కూడి, కవితాగోష్ఠులు జరుపడం నేటికీ ఆచారంగా వస్తున్నది. దీనికి ప్రచార ఆర్భాటాలేవీ ఉండవు. కార్యవర్గం కూడ ఉండదు. సాహితీమిత్రుల ఆమోదం పొందిన ఒక సమావేశకర్త మాత్రమే ఉండి, నెలనెలకు సమావేశాల్ని ఏర్పాటు చేస్తుంటాడు. ఈ సంస్థ యువకవులకెంతో ప్రోత్సాహాన్నిస్తుంటుంది. ఈ వేదికనెక్కిన ఒకనాటి యువరచయితలు చాలామంది నేడు సాహితీక్షేత్రంలో లబ్ధప్రతిష్ఠులైనారు. ఇట్లా కాళోజీ జీవితాంతం దేశంలో సాగుతుండిన అనేక ప్రజాఉద్యమాల్లో పాల్గొనడమే కాకుండా కవితా రచనలతో ప్రజల సమస్యల్ని ఎలుగెత్తి చాటేవాడు. ప్రజలసంక్షేమం కోసం అవిశ్రాంతంగా పోరాటం చేసేవాడు. ఆయన ధన్యజీవి.

---

# కాళోజీ ముద్రిత రచనలు

1. కాళోజీ కథలు
2. నా గొడవ (మొదటి సంపుటి)
3. నా గొడవ - పరాభవ వసంతం
4. నా గొడవ - పరాభవ గ్రీష్మం
5. నా గొడవ - పరాభవ వర్షం
6. నా గొడవ - పరాభవ శరత్తు
7. నా గొడవ - పరాభవ హేమంతం
8. నా గొడవ - పరాభవ శిశిరం
9. నా గొడవ - 1975
10. తుదివిజయం మనది నిజం
11. నా భారతదేశ యాత్ర (అనువాదం)
12. జీవనగీత (అనువాదం)
13. ఇదీ నాగొడవ (ఆత్మకథ)

**అముద్రిత అనువాదాలు**

1. అంజలి (మూలం : ఎన్.సి.ఫడ్కే)
2. భారతీయ సంస్కృతి (మూలం : సానేగురూజీ)
3. ఖలీల్ జిబ్రాన్ ఇతర కవితలు కొన్ని (ఇపుడివేవీ లభ్యంకావు)

**కాళోజీ గురించి వెలువడిన గ్రంథాలు**

1. కాళోజీ నారాయణరావు జీవితం - సాహిత్యం
(ఎం.ఫిల్. సిద్ధాంత గ్రంథం - కాకతీయ విశ్వవిద్యాలయం)- తూర్పు మల్లారెడ్డి
2. కాళోజీ కథ - గేయకావ్యం - వీరబత్తిని శ్రీశైలం
3. కాళన్న శతకం - నల్ల ఉపేందర్
4. యాది - ప్రముఖులవ్యాస సంకలనం

**అముద్రిత పరిశోధన గ్రంథాలు**

1. "కాళోజీ కథ - ఒక పరిశీలన" - ఎస్. వీరభద్రాచారి
(తెలుగు విశ్వవిద్యాలయం నుండి ఎం.ఫిల్ డిగ్రీ ప్రదానం)
2. "కాంట్రిబ్యూషన్ ఆఫ్ కాళోజీ నారాయణరావు టు ది తెలంగాణ" - కె.కరుణశ్రీ
(కాకతీయ విశ్వవిద్యాలయము నుండి ఎం.ఫిల్ డిగ్రీ ప్రదానం, చరిత్రశాఖలో)